*With the service of simple affection and faithful loyalty*

*to our*

*Balija Community,*

*this valuable*

*"Balija Vamsa Puranam"*

*written and published in 1905AD, in Telugu Language by Sri Selam Pagadalu Narasimmalu Naidu Garu a famous social reformer (12th April 1854 - 22nd January 1922) of Coimbattore, who was then a lineal descendant of Sri Pagadalu Narasimhalu Naidu garu, a commander-in-chief of Great Sri Krishnadevaraya, a Kshatriya Balija Emperor of Vijayanagara Empire in 15th Century, settled as one of the prominent personnel in Coimbattore City,*

*Now this "copy" of the book was bought from British Library, London, with a cost of Rs. 4,236.03/- (British Pounds 54.20 i.e. 1 pound is equal to 78.15 /- Indian Rupees is equal to Rs. 4,236.03/-) on 24th November 2008 by me, i.e Mr. Polisetty Sathi Rayadu, B.Com, S/o Sri Polisetty Mangapathi Rao Garu of Challapalli Village, (Near Amalapuram), Uppalagupatam Mandal, in East Godavari District, Andhra Pradesh, whose family is descended from the Chalukyan line of Karnataka, and their ancestors were Great Emperors and Inter-continental Merchants known by Vira Balijas or Kshatriya Balijas.*

*With Warmest Regards*

*Polisetty Sathi Rayadu*

*Challapalli, 24/11/2008*

శ్రీ ర స్తు.

నమో దేవాయ.

శ్రీచంద్రవంశక్షత్రియులైన, ఆంధ్రులు, గౌరవులు,

అను

# బలిజవంశ పురాణము.

లేక

నాయడుగార్ల సంస్థాన చరిత్రము.

ఇది

ద్రావిడమునందు ఆస్తికమత సిద్ధాన్తాద్యనేక గ్రంథకర్తలును,

కోయముత్తూరు కలానిధిపత్రికాధిపతులును,

మధుర ద్రవిడసంఘ సామాజికులును,

కోయముత్తూరు డిస్ట్రిక్టుబోర్డు మెంబరును, ఆనరెరి మేజస్ట్రేటును

అగు

సేలము పగడాల

నరసింహులు నాయడుగారిచే

రచియింపఁబడి,

మద్రాస్.

డివైన్ ముద్రాక్షరశాలయంద

ముద్రించి ప్రకటింపఁబడియె.

1905.

TO

# All Balija Caste People.

OR

## Nayudu Community

**IN WHATEVER COUNTRY, TONGUE AND CREED**

**IN WHATEVER POSITION AND NEED**

**TO WHOM**

**MY HEART HAS CLUNG**

AMID MANY TRANSITIONS & TRIALS

**THE FOLLOWING PAGES**

**Are Inseribed**

**With The Service Of Simple Affecton**

**AND**

**FAITHFUL LOYALTY.**





శ్రీ.

# బలిజవంశ పురాణము

## విషయసూచిక.

విషయము. — పుటసంఖ్య.

బలిజవంశపురాణము
విషయసూచిక
సమాప్తము.





# ఉపోద్ఘాతము.

శ్రీమంతంబగు నీభరతఖండమునందుగల ఉత్కృష్టజాతులొక్కరొక్కరియొక్క పూర్వ, మధ్య, తత్కాలస్థితులను దెలియఁజేయు పురాణము లనేకము లున్నవి. వానిలో ననేకములు ఇక్కాలమునందు ముద్రితములై యున్నవి. ఆ పురాణములవలన కొందఱు తాము ఆర్య బ్రాహ్మణులమనియును, మఱిగొందఱు విశ్వకర్మ బ్రాహ్మణులమనియును, కొందఱు సౌరాష్ట్రి బ్రాహ్మణులమనియును, కొందఱు సూర్యచంద్ర వంశ్యక్షత్రియుల మనియును, కొందఱు దేవాంగమువారనియును, కొందఱువేదోక్తకర్మములననుష్ఠించువైశ్యులమనియును,మఱిగొందఱు ఉత్తమ వెలమవారమనియును గౌరవమును వహించి, తమతమ కుల స్థులను గౌరవ పఱుచుచుండఁగా, బలిజవారనెడి చంద్రకులక్షత్రియుల యొక్క సరియైన చరిత్రము ఇంతవఱకు ముద్రింపకున్నందువలన, అనేకులు వీరిని శూద్రులనియును, సేవకావృత్తి చేయువారనియును చెప్పచున్నారు. ఈమధ్య "గౌరీపుత్ర చరిత్ర" మనెడి పుస్తకము ఆంధ్రమునందు ముద్రితమైనదికాని అది అంతగా ప్రయోజనకారియైనదిగ లేదు. కనుక,

ఈ బలిజవారు ఏ తరగతిలోఁ జేరినవారు? వీరి ఆదియుత్పత్తి యెట్లు? వీరియొక్క మధ్యకాలస్థితి యెట్టిది? తత్కాలస్థితి యేవిధముగ నున్నది? వీరు క్షత్రిలా? లేక శూద్రులా? వీరి కుల గోత్ర ఆచార వ్యవహారాది కర్మ లెట్టివి? అను వీనినంతయు తెలిసికొనఁగోరి సుమారు ౩౦ సంవత్సరములుగా తదేక మనస్కుఁడనై పెద్దలను విచారించితిని. అనేకగ్రంథములను శోధించితిని. ఈ నా ప్రయాసకుఁదగిన ఫలము కలుగలేదు. ఏలన, ఒకఁరొక్కరును ఒక్కొకవిధముగాఁ జెప్పిరి. గ్రంథాధారములవలనను ఇదమిత్థమని నిర్ణయించుటకు కాకపోయెను.

ఇట్లుండఁగా, కొంతకాలమునకుముందు చెన్నపురియందు శ్రీమాన్ అబ్బాయినాయడుగారు మొదలగువారు బలిజవారికి విద్యాబుద్ధులు గఱపుటకుగాను "నాయడు హోమ్" స్థాపింప ప్రయత్నించినపుడు, ఎవరోయొకరు మద్రాస్‌హిందూపత్రికలో "నాయడుజాతివారి జనన మెట్లు?" అని ప్రశ్నించిరి. ఆ ప్రశ్నకైనను ఉత్తరము కలుగదా,యని చాలాదినములు ఎదురుచూచినాఁడను. ఇదివఱకెవ్వరునుబదు లానతిచ్చినట్లు తెలియలేము. ఇఁక ఆలస్యము చేసి ప్రయోజనములేదని తలంచి, నానేర్చినకొలఁది, పెద్దలవలనను గ్రంథములవలనను లభించినసాధనముల నాధారము జేసికొని, సర్కారువారు ధన ప్రయాసకులోనై ప్రచురించిన శాసనాధారములనుగైకొని, బలిజవారుఆంధ్రులేయగుటం జేసి, తెనుగునచెన్నపురిఆంధ్రప్రకాశికలోకొన్నాళ్లు ప్రకటించుచుంటిని. అయినను కాల దేశ వర్తమానముల ననుసరించి బలిజవారు ద్రవిడ మహారాష్ట్రాది భాషలను స్వభాషగా గైకొనియుండు వారనేకు లున్నందునుబట్టి, ఆ తెనుగుననుసరించియే గ్రంథరూపముగా ద్రావిడ భాషయందు 1896 సం॥ ప్రకటింపించితిని. ఆప్రథమ ముద్రణగ్రంథము నందుదహరించిన విషయములు శాస్త్రోక్తములైనవియా, యనువానిని దెలియఁగోరి పత్రికాధికారులకును, పండితులకును చాలా ప్రతులు పంపించినాఁడను. ఈగ్రంథమునుజూచిపత్రికాధిపతులును,పండితులును తమతమ యభిప్రాయములను దెలియఁజేసిరి. అన్నిఁటిని ముద్రించుటకు వలనుపడనందున గొన్నిఁటిని యుదహరించెదను.

మద్రాస్ హిందూపత్రికయందు దిగువ నుదహరించిన విధమున ముద్రింపఁబడెను.

## ORIGIN AND HISTORY OF BALIJA CASTE
## BY Mr. S. P. NARASIMMALU NAIDU.

" The perusal of the book shows, what time, and trouble should " have been taken to gather the various interesting information about " the various dynasties of Northern and Central India and of the Vijia-



" nagar Dynasty in particular. The * * introduction is the more " important and bulkier part of the book. and it gives us a synopsis of " the various dynasties beginning of course from the beginning of the " world; from Brahma and from the Solar and Lunar dynasties. Our " friend thinks that the Balejahs are Kshatryas of the Lunar Dynasty, " take their name from an Andhra King called "Balinja", who ruled " more than 2803 years before Christ. * * * The famous Vickra- " maditya is stated to belong to the Andhra Dynasty. "Andhra" means " great, "noble' &c. Andhras have been called, "Telugus" or Telingas as " they came to occupy the country of Trilinga.

"The book proper gives us the names of the four divisions "and the " *Inti Peru*" of the various sub-divisions of the Kota Balijas, so called " from the Vijianagar fort which shows at any rate their immediate " origins. The names and divisions of the Petta Balija's our friend " promises in a future publication. Then follow rules and rituals obser- ved by the Balijas at deaths and marriages, and the book concludes " with a synopises of Hindu Caste observations and quotations form " the Veda and the Vedanta. The book on the whole combines very " useful information with instruction, and this being the first account " in Tamil of a forgotten past. Mr. Narasimulu Naidu's patriotic atte- " mpet is highly commendable"—The Hindu, Madras, 30th November " 1896.

పైనుదహరించిన ఆంగ్లేయభాష ననుసరించి తెనుగున సంగ్రహముగా వ్రాయఁబడుచున్నది.

---

ఈ (బలిజవంశ) పురాణమును జదివినయెడల ఉత్తర హిందూస్థానమునందును, మధ్యహిందూస్థానమునందునున్న అనేకజాతులచరిత్రములును, ముఖ్యముగా విజయనగర (ఆనెగొంది) సంస్థానాధిపతుల చరిత్రములును స్పష్టమగును. ఇందువలన సూర్య చంద్రవంశ క్షత్రియులయొక్క పరంపరలును, విక్రమార్కాది మహారాజులనేకులు ఆంధ్రులనియును, క్రి - ము. 2803 ;సం॥ ముందే "బలిజ" అను రాజ

వంశసంతతివారు రాజ్యమేలుచుండిరనియును దెలియుచున్నది. ఇది గాక, బలిజవారిలోఁగల భేదములనుగుఱించియును స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. మరియు బలిజవారాచరింపవలసిన కర్మవిధులును జెప్పియున్నది. అన్నివిధములచేతను ఈగ్రంథము మిగులఁ గొనియాడఁదగియున్నది.

1896 సం॥ నవంబరు 30. హిందూపత్రికాధిపతి, మద్రాస్.

మొదటికూర్పు ద్రవిడ బలిజపురాణమునుగూర్చి,

శ్రీమాన్ టి. రాజమయ్యంగార్ బి. ఏ. గారు, ఇది సరియైన చరిత్రమని నాగపట్టణము నీలలోచని యను పత్రికయందువిపులముగా వ్రాసిరి. కోయముత్తూరుకాలేజి ద్రవిడపండితులు మ-రా-శ్రీ సభాపతి పిళ్లగారును, లండన్ మిషన్ హైస్కూల్ ద్రవిడపండితులు మ-రా-శ్రీ తిరుచ్చిత్తంబలంపిళ్లగారును, సేతుపతి సంస్థాన విద్వాంసులలోనొకరైన శ్రీమాన్ వేంకటరమణయ్యంగారును, ఈగ్రంథమును జదివిచూచి యిది సరియైన చరిత్రమని పద్యములను వ్రాసిరి.

తర్వాత ఈపుస్తకమును తిరునెల్వేలి, శ్రీవిల్లిపుత్తూరు మొదలగుచోటులకు పంపినపుడు, గవర్నమెంటువారు 1901 సం॥ జనగణితి చేయుటకు ఆరంభించి, బలిజవారిని రెడ్డి, కంబళ, దొడ్డిమొదలగు జాతులలో చేర్పవచ్చునని అచ్చటి కలెక్టరు ఎన్యూమరేటర్లకు సర్క్యులర్ పంపించగా, అచ్చటిబలిజవారు భయపడి, ఆ సర్క్యులరును, బలిజవారిపురాణమును అచ్చటగల వడకల తెన్కల ఆచార్యస్వాములకు గనపఱచగా, ఆ యాచార్యస్వాములు బలిజవారికిశ్రీముఖమునంపిరి.

ఆ శ్రీముఖమునకు తెనుఁగు ఈదిగువ వ్రాయఁబడుచున్నది.

# శ్రీముఖపత్రిక.

శ్రీమతేరామానుజాయనమః.

గౌరవబలిజవారు, ఆదిజనన ఉత్పత్తియొక్క వివరణమును తెలిసికొని, అనుష్ఠానమునకు కొనివచ్చుటకు, దిగువ చేవ్రాళ్లుచేసియుండువారివలన ప్రచురముచేయఁబడునదేమనఁగా,—

(1) గౌరవబలిజవారియొక్క ఆదిజనన విషయమునుగుఱించి ఆగమ వేద ఆదిపూర్వ గ్రంథములైన భారతము,భాగవతము,విష్ణుపురాణము,మనుస్మృతి మొదలగు గ్రంథములను పరిశీలనచేసినందువలనను; దానికి ఆధారముగా ఈ గౌరవబలిజవారి జాతివిషయముగా, కోయముత్తూరులోనుండు, తర్క యోగ సాముద్రికాద్యనేక గ్రంథకర్తలైన, సేలము పగడాల నరసింహులునాయడుగారు అనేకగ్రంథములను బహుకాలముగా శోధించి 1897సం॥ము నందు ముద్రించిన బలిజవారి పురాణమునందు చెప్పఁబడియుండు విషయములవలనను; 1890 సం॥ అక్టోబరునెలలో గవర్నమెంటువారు ప్రచురించియుండు సెన్సస్ మాన్యుయల్ 10 వ పుటయందు కనఁబఱచిన ప్రకారము (రావ్) అని తమ్ముచెప్పుకొనువారు బ్రాహ్మణులుగానైనను (బలిజ) జెంతువారుగానైన నుండవచ్చునని వ్రాయంబడియుండుటవలనను; ఈ సంవత్సరమునందు ప్రచురము చేసియుండు సెన్సస్‌మాన్యుయల్ 10-11 పుటలయందు రాయలు అని తమ్ము చెప్పుకొనువారు బ్రాహ్మణులుగానైనను,బలిజజాతిగానైనను నుండవచ్చునని కనబఱచియుండుటవలనను; ఈదిగువ కనబఱచిన దృష్టాంతములవలనను; వీరు ఆది పూర్వచంద్రకుల ఆంధ్రక్షత్రియులైన గౌరవబలిజవారనియే స్పష్టమగుచున్నది.

(2) ఈ గౌరవజాతివారికి ఈ ద్రవిడదేశమునందు గౌరవులనియును, జెంతు అనియునున్న దానినిగూర్చి ఆగమ వేదపురాణాదులను శోధించి

చూడగా పైన కనిన జాతివారు సదరు గ్రంథముల కనుకూలముగానుండ లేదు. ఆజాతిపేరు గౌరవులని శ్రేష్ఠవాచకముగా నున్నది. జెంతు అను నది పట్టపుపేరుగానున్నది. కనుక, ఈ రెండు పేర్లునుజాతివాచకము కాదు.

(3) దీనికి దృష్టాంతముగా ఆంధ్రదేశములోనుండు బలిజవారిలో గవర్నమెంటు పరీక్షలో 8,2,81 లో జనరల్ నెంబరు 1897సం॥ మిడిల్ స్కూలు పరీక్షలో తేరిన, కొడుముసెట్టి పద్మనాభస్వామినాయడు కుమారుడు కొడుముసెట్టి అప్పలనరసింహారావు అనియును, (ఇవ్విధముగా నాయడుగారి కొడుకు రావు అని వచ్చు పేర్లు చాలా యున్నవి). 5-2-84లో 82సం॥ మిడిల్‌స్కూల్ పరీక్షలో తేరిన జనరల్ నెంబరు 83 లో ప్రచురము చేసియుండు కే-వేంకటరెడ్డినాయడు కుమారుఁడు కే-శేషగిరిరావు అనియునున్నది. (ఇట్టిపేర్లుచాలాగలవు.) వీరందఱును తమ యొక్క పూర్వవంశ అనుష్ఠానమును చక్కగా ననుష్ఠించు చున్నారు.

(4) ఇఁకనైనను తమజాతియొక్క పూర్వ అనుష్ఠానమును అనుష్ఠించుటకు మంచిమార్గ మేర్పడుటవలన, అనఁగా,10-1-1901 మొదలు సెన్సస్సు ప్రారంభించుటవలన, బలిజవాండ్రందఱును (రావ్) లేక (రావు నాయడు) అని పట్టపుపేర్లును; (గౌరవులు) లేక (గౌరవబలిజలు) అని జాతిపేరును వ్రాయునట్లుగా ఎన్యూమరేటర్లకుచెప్పి వ్రాయించినయెడల ఇదిమొదలుగానైనను అనుష్ఠానమునందు సరిగా వచ్చును.

(5) ఇదివరకు నేలపట్టాలలోను, పత్త్రములలోను, సర్కారు ఉద్యోగస్థులుగా నుండువారు తమ సర్వీసు.పుస్తకములలోను వ్రాసియుంచినపేర్లకు, 4వ పారాలో చెప్పినట్లు వ్రాసినయెడల ఆక్షేపణ కలుగునేమోయని చింతింపబనిలేదు. ఇప్పుడు పుట్టియుండుబిడ్డలకును,పత్త్రము మొదలగువానియందు అనుష్ఠానమున రాకయుండుబాలురకును, రావ్ లేక రావ్‌నాయడు అను పట్టపుపేరును సాధారణముగా వ్రాసి పెట్టవలయును.

(6) ఈ దక్షిణదేశమునందు తఱుచుగా వారివారి యింటి పేర్లు వ్రాయఁబడుటలేదు. కనుక, ఇంటిపేరులనుచెప్పి వ్రాయించవలయును.



(7) ఈ యింటి పేర్లను వారివారియొక్క శుభాశుభకాలములందు వారివారిపేర్లకుముందుగా చెప్పవలయును. సకల వ్యవహారములయందును, పత్త్రములు మొదలైనవానియందును అనుష్ఠానమునకు గొనివచ్చినయెడల వారివారి గృహనామము వంశము గోత్రము మొదలగునవి చక్కగా ప్రకాశించును.

తెౕకల స్వాములు.

అద్దంకి, తిరుమల, వటపత్త్రశాయి తాతాచార్యులు.

కందాడ-వి-శ్రీ-అళగరాచార్యులు.

వడకల స్వాములు.

రాజగురు, కోటికన్యాదానం, కీల్ తిరుమాళిగై,

చిన్న గోపాలస్వామి తాతాచార్యులు.

రాజగురు, కోటికన్యకాదానం, శ్రీనివాస తాతాచార్యులు.

తెౕకల వడకల గురుస్వాములు. శ్రీవిల్లిపుత్తూరు.

---

ఈ మహజరును శ్రీముఖమును మాకు వచ్చినపుడు, చెన్నపురి గవర్నమెంటువారు 1901 సం॥ జనగణితజాతిలెక్కతో, ఈ రాజధానియందు వసించు పలుజాతివారియొక్క జాతి అంతస్థులను తెలిసి చరిత్రము వ్రాయందలంచి, ఒక్కొక జిల్లాయొక్క కలెక్టర్లకును, మఱియు తెలిసినవారికిని పంపించిరి. ఆయుత్తరవుల ననుసరించి కోయముత్తూరు కలెక్టరుగారు, అచ్చటి గొప్ప ఉద్యోగస్థులను, పండితులను, వారితో నన్నును రావించి సభ చేర్చి, ఆ సభయందు జాతి అంతస్థులను గూర్చి చర్చ జరిగించి, సభ్యులయొక్క తీర్మానములను తెలియచేయునట్లు నియమించినప్రకారముగా, కోయముత్తూరు తాలూకా కచ్చేరియందు రెండుమాళ్లు సభగూడి తీర్మానించిన విషయములను ఈదిగువ కనఁబఱచబడి యున్నది.

## OUR CASTE CLASSIFICATIONS AND CENSUS OPERATIONS

" With reference to the letter dated 25th May 1901 of the Superintendent of Census Operations, Madras, our Collector has appointed the following gentlemen, Messrs E. T. Vedanayagam Pillay, Avl, Tahsildar, Coimbatore Viz. 'President,' H. Rama Row Avl. 1st Grade Pleader, C. Bujanga Row Avl. B. A., Asst. Master Coimbatore College, Rajapurohitham Venkatasubba Sastrilu and S.P. Narasimmulu Naidu, Editor of the Coimbatore Crescent as members of the District Committee to discuss and criticize this scheme in so far as it relates to the Castes and tribes commonly found in Coimbatore District. The members met twice on Saturday the 6th and on Wednesday the 10th Instant, at the Taluk Office and carefully scrutinized the existing Clasification. With regard to the *Balija* Caste which was placed in the 4th Class of the Classification the members recorded that they (Balija Caste) have good claim to be classed as Kshatriyas. One of the members (S. P. Narasimmulu Naidu) filed a pamphlet containing the following letter &c. to the Superintendent of Census Operations, Madras.

"THE CRESCENT" OFFICE,

COIMBATORE,

*10th July 1904*,

To

*M. FRANCIS Esq.* I. C. S.

*Superintendent of Census Operations*,

MADRAS.

SIR,

In reference to your letter No. 1018 of the 25th May 1901, enclosing a 'Classification of Castes and tribes',forwarded to all collectors with a view to have the Classification carefully scrutinized, I have the honour to bring to your notice that the Balija Caste mentioned in the 4th page of the said classification is given a wrong place inasmuch as it ought to be placed in Group 11 under the head of Kshatriyas.

The Balija caste people are Kshatriyas of the Lunar Race as can be proved by a reference to the Bhagavatham, Vishnupuranam and Brahmmandapuranam &c. (Vide XXIII Chap. of the IX Scanda of Bhagavatham. Journal of the Asiatic Society and District Manuals of Tanjore, Madura, Nellore &c.)



In this connection, it will be interesting to note that one Sevappa Naidu married Murthiammal, sister-in-law to Achutha Deva Rayulu of Narapathi Samasthanam of Vijianagar and, as a marriage portion or dowry, received the territory of Tanjore over which he ruled as king for a long period. It was at this time that the celebrated Tirumalay Naidu of Madura took as wife one of the daughters of Sevappa Naidu's family. Tirumalay Naidu's grandson, one Chockalinga Naidu, married Mangammal daughter of Vijiaragavalu Naidu, a grandson of the said Tanjore Sevappa Naidu. It will thus be seen that the Naidu rulers of Tanjore, Trichy and Madura were all relations of Narapathi Samasthanam of Vijianagaram. (Vide Pages 502, 503, 504, 505- Vol VI Part II. The Journal of Asiatic Society, &c. The District Manuals of Madura, Tanjore &c.)

That these Narapathies of Vijianagaram were Kshatriyas of the Lunar Race can be seen clearly by a reference to Manucharithra, Parijathapaharanam, Prouda Prabanda Kavi Cheritra &c. (Page 521, Vol VI The Journal of Asiatic Society of 1838), and that they were direct descendants of the great Andra kings can be proved with equal satisfaction by refering to Col. Mackenzie's M. S. S. in the introduction of A. D. Campbell's Telugu Grammer and James Prinsep's Indian Antiquities. Useful tables on Andra kings, Pages 241 and 242 will shew that the Andras were immediate descendants of the well-known Yayathi Raja of the Lunar Race.

I have also the honour to state that,in 1896, a Tamil book called Balijavaru Puranum was published by me proving the above facts in the most incontestable manner. The book was circulated among learned Pundits and Brahmins, among whom may be mentioned M. R. Ry. Sabapathy Pillai Avl, Hd. Tamil Pundit of the Coimbatore College, M. R. Ry. Tiruchittrambalam Pillai Avl, Tamil Pundit, L. M. High School, and Samakulam Venkataramana Iyengar, a well known Brahmin pundit. These have not only commended the arguments in the book and acknowledged the truth of the line of reasoning but have also furnished me with சாற்றுக்கவிகள் (కృతిప్రశంసలు) to shew their appreciation of the work.

Besides the above mentioned gentlemen, the great Vaishnava Iyengar Brahmin priests (Addangi Thirumalay Vatapatrasayie Thata Chariar, V. S. Kandadai Alaga Chariar of Y Marks, and Raiguru, Koti Kannikathanam, Keel Thirumaligai, Chinna Gopalasamy Thatha Chariar, Raiguru; Koti Kannikathanam, Sreenivasa Thatha Chariar of U Marks) of Srivilliputhur have also approved of it as authroritative

history and sent in a ஸ்ரீமுகம் to all Balija Caste people advising them how to fill up the names, titles, castes &c. in the recent Census Forms. A copy of the book nnd the authentication ஸ்ரீமுகம் (శ్రీముఖము) and a geneological chart of the Balija Caste are herewith submitted for your perusal.

Under these circumstances, I think it will only be just and reasonable that the Balija caste should be spared the ignominy of being placed lower than the Komitees and other similar classes when their (Balija's) real status is that of Kshatriyas.

I have the honour to be
Sir,
Your most obedient servant,
S. P. NARASIMMULU NAIDU,
*Editor of the Coimbatore Crescent,*

---

"The Coimbatore Crescent" 12th July 1901.

---

హిందూజాతి నియమనము.

మనదేశమునందు సమీపకాలములో జన సంఖ్య యెత్తినదాని వలన, జనులయొక్క జాతి వర్ణభేద అంతస్థులను, ఆ జనగణితీ పుస్తకము నందు వ్రాయనెంచి, ఒక్కొక జిల్లాలోనుండు పెద్దమనుష్యులు కొందఱిని సభచేర్చి, తెలిపించవలయునని ఆ యిలాకా సూప్రెండెంటువారి ఉత్తరము ప్రకారముగా కోయముత్తూరిలో జల్లా కలెక్టరువారు తాసీల్దారు మొదలగు గొప్ప ఉద్యోగస్థులను, మఱికొందఱు పెద్ద మనుష్యులను ఒక కమిటిగా జేర్చిరి. వారు రెండుమాఱ్లు సభ చేసిరి. వారందఱును దీర్ఘాలోచనజేసి, జాతిపట్టికలో కనినపేర్లను బహు జాగ్రత్తగా తగిన చోట్లకు మార్చిరి. ఆ జాతిపట్టికలో బలిజవారిని శూద్రులని కనియుండుటను ఆలోచించి, ఆజాతివారిని క్షత్రియ తరగతిలో చేర్చుటకు తగిన ఆధారము లున్నదని రికార్డుచేసిరి. ఆమీద ఆ సభ్యులలో నొకరైన S. P. నరసింహులు నాయడు ఆ విషయమును గూర్చి దృఢపఱచగా, దిగువ కనబఱచిన కాగితమును, దానికిం దగిన ఆధారములను ఒక చిన్న గ్రంథముగా ముద్రించి సూప్రెండెంటుగారికి పంపునట్లు దాఖల్ చేసిరి. అదే యిది.



చెన్నపురి సెన్సస్‌కానిష్‌వారి యిలాకా సూప్రెండెంటు ఘనత వహించిన W. ఫ్రాన్సిస్ దొరగారి సమ్ముఖమునకు,

అయ్యా,

కోయముత్తూరు కలెక్టర్ దొరవారి 1-6-01 తేదియొక్క 206 నెంబరు కాగితముతోఁగూడ పంపించిన తనుయొక్క 1901 సం॥ మేనెల 25 తేది 1018 నెంబరు కాగితమును, జాతి వర్ణతరగతియొక్క తరాతర అంతస్థును కనబఱచుపట్టికయును చదివిచూచితిని.

1. ఆజాతితరగతి పట్టియందు 4వ పుటలో బలిజవారిని వారియొక్క సరియైన 2వ తరగతి క్షత్రియతరగతిలో చేర్చక, 4వ తరగతిలో సచ్ఛూద్రులనివ్రాసి, తక్కువదైనదియును తప్పిదమైనదియు నగు స్థలమున చేర్చినది సరికాదని తోచుచున్నది. ఏలన,—

2. బలిజవారు చంద్రకుల క్షత్రియవంశమునుజేరిన యయాతి యొక్క సంతతివారని భాగవతము 9 స్కంధము 23వ అధ్యాయము వలనను; విష్ణుపురాణము, వాయుపురాణము, బ్రహ్మాండాదిపురాణముల వలనను; ఏష్యాటిక్ జర్నల్సులు; మధుర, తంజావూరు మొదలగు డిస్ట్రిక్టుకోర్టు మాన్యుయలులు; కర్నల్ మెకంజి, టెయిలర్, రాబర్టు స్యూయల్ మొదలగువారి గ్రంథములవలనను స్పష్టమగుచున్నది.

3. ఎట్లనగా,—విజయనగరము సంస్థానముతోఁజేరిన అచ్యుత దేవరాయలుయొక్క భార్య తిరుమలమ్మగారి సోదరి మూర్తియమ్మను వారికులస్థులైన చేవప్పనాయుడుగారు వివాహముచేసికొన్నందులకై, తంజావూరు సంస్థానమును వారికి స్త్రీధనముగా నిప్పించి దానిని పాలించి యనుభవించునట్లు అధికారమిప్పించినసంగతి తంజావూరు చరిత్రము 112 నెంబరు, కపుంటల్ మార్కు 325లోను, ఏష్యాటిక్ జర్నల్ 6వ వాల్యూం 502-506 పుటలయందును, ఇతరగ్రంథములయందును స్పష్టమగుచున్నది.

4. తంజావూరు చేవప్పనాయుడుగారియొక్క కుటుంబముతో జేరిన ఒక కన్యకను మధుర తిరుమలనాయుడుగారు వివాహముచేసి కొన్నదేగాక, ఆ తిరుమలనాయుడుగారియొక్క మనుమడైన చొక్కలింగనాయుడుగారు, తంజావూరు సంస్థానము చేవప్పనాయుడుగారిమనుమడైన విజయరాఘవులునాయుడుగారి కుమార్తెయైన మంగమ్మను వివాహముచేసికొన్నట్లుగా తంజావూరుచరిత్రము 122 నెంబరు కవుంటర్ మార్కు 325లోను, ఏషియాటిక్ జర్నల్ 6వ వాల్యూం 502-503 పుటలయందును, మధుర, తంజావూరుజిల్లాల మాన్యుయలులు మొదలగు గ్రంథములయందును స్పష్టమగుటవలనను, తంజావూరు, తిరిచినాపల్లి, మధుర ఈ సంస్థానములను పాలించినట్టి విశ్వనాథనాయుడు, తిరుమలనాయుడు విజయరంగ చొక్కనాథనాయుడుగార్లును; తంజావూరునేలిన చేవప్పనాయుడు, అచ్యుత విజయరాఘవనాయుడుగార్లును; విజయనగర నరపతిసంస్థానముతోఁజేరిన నరసింహ, కృష్ణదేవ, అచ్యుత దేవరాయలయొక్క సంతతివార్లని స్పష్టమగుచున్నది.

5. విజయనగర నరపతిసంస్థానమువారు చంద్రవంశ క్షత్రియులని మనుచరిత్రము, పారిజాతాపహరణము, కృష్ణరాయవిజయము, ప్రౌఢప్రబంధ కవిచరిత్రము మొదలగు గ్రంథములవలనను; కర్నల్ మెకంజీ ఇండియన్ రివ్యూ, సదాశివమహారాయలవారి తామ్రశాసనము నెంబరు 17లోను, ఏషియాటిక్ జర్నల్ 6వ వాల్యూం 521 పుటయందును ఇతరగ్రంథములవలనను స్పష్టమగుచున్నది.

6. ఈ విజయనగరనరపతులు, విక్రమార్కునియొక్క కుటుంబమును జేరినవారనియును, విక్రమార్కుడు ఆంధ్రవంశ క్షత్రియుడనియును; ఆయాంధ్రులు యయాతివంశ సంతతివారనియును; చెప్పఁబడియుండుటచేత బలిజవారు యయాతిసంతతిలోజేరిన చంద్రవంశక్షత్రియులని స్పష్టమగుచున్నది.



7. ఇత్యాది ఆధారములచేత 1896 సం॥ ద్రవిడమున బలిజవారిపురాణమను పేర నేనొకగ్రంథమును ముద్రించితిని. బ్రాహ్మణాది పలు జాతులవారికిని పంపించితిని. ఆది సరియైన గ్రంథమని కోయముత్తూరు కాలేజి ద్రవిడపండితులు శ్రీ సభాపతిపిళ్లగారును, లండన్ మిషన్ హైస్కూల్ పండితులు శ్రీ తిరుచ్చిత్తంబలంపిళ్లగారును, శైవవైష్ణవ మతములు చక్కగా నెఱింగిన శ్రీవైష్ణవ బ్రాహ్మణులైన శాముక్కుళం వెంకటరమణదాసులుగారును, ఇంకను అనేకులును కృతి ప్రశంసపద్యముల నొసంగిరి.

తిరునెల్వేలిజిల్లా శ్రీవిల్లిపుత్తూరులోనుండు వైష్ణవులగు తెన్కల వడకల ఆచార్యస్వాములైన, 1 శ్రీ అద్దంకి తిరుమల వటపత్రశాయి తాతాచార్యులును, 2 కందాడ వి. శ్రీ అళగరాచార్యులును, 3 రాజగురు కోటికన్యాదానం కీళ్ తిరుమాళిగై చిన్నగోపాలస్వామి తాతాచార్యులును, 4 రాజగురు కోటికన్యాదానం శ్రీనివాస తాతాచార్యులును శ్రీముఖమునందు చేవ్రాళ్లుచేసియున్నారు.

☞ ఈ శ్రీముఖమును (7) పుటయందు చూడఁదగును.

కనుక ఇత్యాది గ్రంథశాసనాధారములననుసరించి బలిజవారిని క్షత్రియులతో జేర్చుటయే సరియైనదియును న్యాయమైనదియునుగా నున్నదని తెలియపఱచుచున్నాఁడను.

ఇట్లు
తమ విధేయుడు
సే - ప - నరసింహులునాయుడు,
కలానిధి పత్రికాధిపతి.

ఈప్రకారముగా బలిజవారియొక్క చరిత్రవివరణములను అనేక పురాతనగ్రంథములలోనుండి ఉదాహరణముగాఁ గనఁబఱచి వ్రాసియిచ్చిన గ్రంథమునుజూచి కోయముత్తూరు కలెక్టర్ దొరగారు నాకు బంపిన ఉత్తరమును, ఈ దిగువ వ్రాయఁబడుచున్నది.

To

M, R, Ry. S. P. Narasimmalu Naidu Garu,
*Editor of the Crescent, Coimbatore.*

Sir,

In acknowledging the receipt of your letter dated 28th current and the enclosures thereto- I have the honour to thank you much for the interesting information furnished by you regarding the Balija Caste. * * * * *

I have the honour to be, Sir,
Your most obedient servant,
(Sd.) C. W. T. COTTON,
*For Collector.*

దీనితాత్పర్యమేమనఁగా,— బలిజజాతియొక్క మనోహరమైన చరిత్రమునుగూర్చి వ్రాసిపంపినదానికై మిక్కిలి వందనములు చేయుచున్నాను. అని.

---

బలిజవారిచరిత్రమునుగూర్చి 1901 సం॥ చెన్నపురి గవర్నమెంటువారు జనగణితీరిపోర్టులో దిగువ కనఁబఱిచినరీతిగా ముద్రించియున్నారు.

(Vide Gloassary of Castes &c. Page 144-Census of India 1901 Vol. XV Madras Part 1 Report by W. Francis Esq I C. S.)

Balija (10,08,036,) m. 10) This is the Chief Telugu trading Caste and it is scattered throughout all the Districts of the Presidency. It is said to have two main Sub divisions, Desa (or Kota) and Peta. The first of these includes those whose ancestors are supposed to have been the Balija (Nayak) Kings of Madura, Tanjore, and Vijianagar, or Provincial Governors in those Kingdoms, and to the second belong those like the Gazulu (bangle sellers) and Perikai (salt sellers) who live by trade. In the Tamil districts Balijas are known as Vadugans ("Telugu People) and Kavarais. The descendants of the Nayuk or Balija Kings of Madura and Tanjore claim to be Kshatriyas and of the Kasyapa Gotra while Vijeanagar Rais say they are lineal descendants of the Baradwaja. Others trace thier ancestry to the Kawrawas of the Mahabharata. This Kshatriya descent is not however admitted by other castes who say that Balijas are an off shoot of the Kammas, or Kapus or that they are a mixed Community recruited from these and other Telugu castes. None of the members of the Caste wear the sacred thread or follow the Vedic ritual. (L. R. 1891 Para 458, Kurnool man. P. 137 Buchanan's Mysore &c. Vol. P. O. 168170:— Madura Manual Part II Page 86 North arcot Manual Vol. 1. P. P. 202—202.)



## ఇంగ్లీషు రిపోర్టుయొక్క తాత్పర్యము.

---

1901-సం॥ చెన్నపురి రాజధానియందుండిన బలిజవారు 1008036. M-107.

"వీరు (బలిజవారు) విశేషముగా వర్తకముచేయు తెనుఁగు జాతివారు. వీరు ఈ చెన్నపురిరాజధానియందుగల అన్ని జిల్లాలలో నున్నారు. వీరిలో దేశ (కోట) బలిజవారనియును, పేటబలిజ వారనియును ఇరు తెగలవారుముఖ్యులు. ఈయిరు తెగలవారిలోను కోటబలిజవారు మధుర, తంజావూరు విజయనగరము నేలిన బలిజ (నాయక) రాజసంతతితో జేరినవారు. గాజులబలిజవారును ఉప్పమ్ము పెరికబలిజవారును పేటబలిజ తెగవారిలో జేరినవారు.

అఱవజిల్లాలలో బలిజవారిని వడుగర్ (అనఁగా తెనుఁగువారు) అనియును, గౌరవులు (கவரைகள்) అనియునుచెప్పదురు. మధుర, తంజావూరు సంస్థానాధిపతులగు నాయకులు, లేక బలిజరాజులయొక్క సంతతి క్షత్రియజాతిలో జేరిన కాశ్యపగోత్రస్థులనియును ; విజయనగర సింహాసనస్థులైన రాయలువారు భారద్వాజగోత్రస్థులనియును చెప్పుచున్నారు. తక్కినబలిజవారు మహాభారతములోఁ జెప్పఁబడిన కౌరవుల సంతతిలో జేరినవారనిచెప్పెదరు. ఇట్లుచెప్పినను ఇతరులు వీరిని క్షత్రియులుకారని చెప్పెదరు. బలిజవారు కమ్మ, కాపు, జాతులలోనుండికల్గినవారు. లేక పై జాతులలోనుండియు ఇతరజాతులలోనుండియు కల్గిన మిశ్రమజాతి వారని చెప్పెదరు. ఈజాతిలోఁజేరిన వారెవరును ఇపుడు యజ్ఞోపవీతధారణము చేయుటలేదు. వేదోక్తకర్మయు చేయుటలేదు."

"చక్కఁగాఁ దెలియఁగోరువారు 1891 సం॥ జనగణితీ రిపోర్టును, కర్నూల్ చరిత్రము 137 వ పుటయందును, బక్యానన్ దొరగారు వ్రాసిన మైసూరు చరిత్ర 1 వాల్యము 168-170 పుటలలోను, మధుర

చరిత్రము 2 భాగము 86 పుటలలోను, ఉత్తరఆర్కాడుజిల్లాచరిత్రము 1 వాల్యము 20 - 23 పుటలలోను చదివి చూడవచ్చును. అని వ్రాసియున్నారు.

నేను అనేక గ్రంథశోధనచేసి వ్రాసిన దానియొక్క సారాంశమును కోయముత్తూరుజిల్లా కలెక్టరు దొరవారు పంపించియుండియు, సెన్సస్ సూప్రెండెంటువారైన మిస్టర్ డబ్లియు, ఫ్రాన్సిస్, ఐ-సి-యస్ దొరగారు పైనకనబఱచిన విధముగా ప్రచురించియుండుటను జూచు బలిజవారికి అతృప్తి నొసంగకమానదు. అయినను ఈ సూప్రెండెంటు దొరగారే 1901 సం॥ సెన్సస్ రిపోర్టు 15 వాల్యము మొదటి భాగము 130 పుటలో 22 వ విషయముయొక్క దిగువ ఇట్లు వ్రాసియున్నారు.

"Even as it is, there will be several castes which will be dissatisfied with the position accorded them. I drew up the table in accordance with the information available, neither extenuating anything nor setting down aught in malice, and committees of native gentlemen formed for the purpose in every district have criticised and amended the original draft, but I am well aware that the task has been a most delicate one"

*Trichur, 14th January 1903.*

దీనితాత్పర్యము.

" జాతి అంతస్థులనుగూర్చి ఇప్పుడునియమించియుండు స్థితిలో కూడ అనేక జాతులకు అతృప్తినియ్యనగును. దీనికొఱకు ప్రతిజిల్లాలలోనుండి స్వదేశపు పెద్దమనుష్యులను సభచేర్పించియును, వారిసమ్ముఖమునకు జాతిమూల వృత్తాంతపట్టికలను బంపిచర్చజరిగించియును, ఆసభవార్లు నాకు బంపించిన సంగతులననుసరించి దీనిని తయారు చేయఁబడినదేగాని, చెడ్డతలంపుతో ఒకజాతివారికిగల గౌరవమును మట్టుపఱచియును, లేనిదానిని చేర్చుటయునుగాను. అయినను ఈకార్యము అతిసూక్ష్మమును ధర్మసంకటమునైన పనియని తెలిసిన విషయమే."

అనివ్రాసియుండుటచేత గూడినంతశ్రద్ధను సూప్రెండెంటు దొరగారువహించిరని స్పష్టమగుచున్నది. ఇట్టి ఘనకార్యమును సాధించి



యొనర్చిన సూప్రెండెంటుగారికిని సకలజనులయందును సమభావము వహించి పనిపూర్తిచేయవలయునని నియమించిన మనఆంగ్లేయ గవర్నమెంటువారికిని మనముకృతజ్ఞులమై యుండవలయును.

ఇవ్విధముగా అన్యదేశీయులు మనవిషయములో ఇంత శ్రద్ధ వహించి వారివారి అంతస్థుకుతగినట్లు మర్యాదచేయుచుండగా, ఈ దేశమునందేపుట్టి, ఈదేశమునందే పెరిగి, ఈదేశమనుష్యులలోనే మెలగిన మనవారిలోనే ఒకరికొకరికి సరిపడక మనలోమనమే ఐకమత్యములేనివారమైయుండుట హాస్యాస్పదమేకదా? దీనికొకదృష్టాన్తమగపఱచెదను కనుడు.

To

S. P. Narasimmalu Naidu Esqr.

Coimbatore.

Sir,

We, the undersigned Nayudus are residents of Trichur, a District under His Highness the Rajah of Cochin.

We sorrowfully narrate our grievances to you in a few lines to find out a way for redress.

(1) It is nearly a century since we landed here from Tanjore and other places.

(2) Our forefathers and some of us were given full privilege of entering the Temples here, but after a certain time at the instigation of Nayars who are quite ignorant of our castes we were prohibited from entering on the ground that we are not Sudras and if at all, we were not of good caste. Some time hence bathing in Tanks also were prohibited.

(3) Ever since that prohibition we fought with utmost energy to establish our caste system, but in vain. What amount of evidence and what amount of facts submitted by us are of no avail, as almost all the offices in the state are occupied by Nayars who are quite ignorant oj Nayudus.

(4) After several years' fight we succeeded in getting a permission to bathe in the Tanks.

(5) We produced certificates from Namboori Vydeekas (Malayali Brahmins) to show that we belong to High caste. But they also go without any use.

(6) After all we received an order from His Highness to produce a certificate from a Vydeeka of our parts (beyond the Cochin State) to show that we are High Caste Sudras.

(7) When we received this order we searched for a patron who will kindly and benevolently come forward and establish the Nayudu caste in this dark country where Malayalis alone are held in great respect although their caste system. * * * * * * * At last we came to know from a friend of ours that you have been taking the greatest effort in connection with the same thing, to let our Nayudu brethren know to what caste they really belong and that you have also published a volume describing it after a thorough search of Shastras & Vedas.

(8) We therefore humbly and respectfully approach you and beg you to be gracious enough to extend your trials to these parts also and to establish our castes as it is and to give us that privilege to which we are justly entitled. Further, we request you to be kind enough to furnish us with a detailed certificate from a Brahmin Vydeeka so that we may forward the same to His Highness with a petition (a copy of which should be kindly sent by you in English describing all that we have to say supported by facts and figures). &c., &c., &c.

We beg to remain, Sir,—your obedient brethren (signed)

1. T. S. Veeraswamy Naidu
   *Pensd. Post Master.*
2. S. A. Raghavaloo Naidu
3. P. Venkataswamy Naidu
4. V. Peddoo Naidu
5. V. Perumal Naidu
6. S. P. Ramaswamy Naidu
7. T. P. Gopalakrishna Naidu
8. V. Doraswamy Naidu
9. M. Venkatasubbia Naidu &c.

దీని భావము.

మ-రా-రా-శ్రీ, సే - ప - నరసింహులునాయుడుగారికి,

అయ్యా,

మహాఘనతవహించిన కొచ్చిరాజాగారి సంస్థానముతోఁ జేరిన



తిరుచ్చూరిలోనుండు నాయుడుజాతివారైన మాయొక్క కష్టనిష్ఠూరములనుగుఱించి అధికవ్యసనముతో వ్రాసికొన్న విజ్ఞాపనయేమనఁగా,

1. సుమారు 100 సంవత్సరములకుముందు తంజావూరు మొదలగుస్థలములలోనుండి మాయొక్క పెద్దలు ఇచ్చటికివచ్చి చేరిరి.

2. అట్లువచ్చిన మాపెద్దలు ఇచ్చటగలగుళ్లకు పోవునట్టి స్వాతంత్రమును వహించియుండిరి. తర్వాత మనజాతియొక్క గౌరవము నెఱుంగని నాయరుజాతివారియొక్క ప్రేరేపణచేత మనలను శూద్రులు కారనియును, మంచికులస్థులు కారనియును, గుడిలో ప్రవేశింప గూడదనియును అడ్డగించినదేగాక, గుంటలలో స్నానమును జేయఁగూడదనియును నిగ్రహించిరి.

3. అట్లుచేసినదేగాక, మనయొక్క జాతి గౌరవవివరణములను గూర్చి ప్రబలన్యాయ్యములతో నెత్తిచెప్పియును, ఈసంస్థాన ఉద్యోగస్థలలోననేకులు మనజాతియొక్క గౌరవమునుగూర్చి తెలియని నాయర్లుగానుండుటవలన కార్యసిద్ధికాకపోయెను.

4. ఇట్లుచాలాదినములుగడచినమీఁద, గుంటలలోమాత్రము స్నానము చేయవచ్చుననెడి స్వతంత్రమును వహించితిమి.

5. మేము(మంచి) శూద్రజాతిలో జేరినవారమని మలయాళ నంబూద్రివైదిక బ్రాహ్మణులవలన సాక్షిపత్రములను గ్రహించి యిప్పించియును ప్రయోజనము కాక పోయెను.

6. తుదకు కొచ్చిసంస్థానమునకు బైటనుండు ఇతర దేశవైదిక బ్రాహ్మణులవలన, మేముశ్రేష్ఠకులస్థులైనశూద్రజాతివారని సాక్షిపత్రమును గ్రహించి చూపవలసినదిగా ఘనత వహించిన కొచ్చి మహారాజాగారియొక్క ఉత్తరవును పొందితిమి.

7. ఆ ఉత్తరవును పొంది తోడనే, మలయాళమువారే శ్రేష్ఠజాతివారనియును, ఇతరులు హీనులనియును తలంచియుండు ఈ అంధకారరాజ్యములో మనయొక్కజాతి గౌరవమును ప్రసిద్ధము చేయుటకు

ఏపుణ్యాత్ముడు ముందువచ్చునోయని వెదకుచుండగా, తాము ఈవిషయముగా అనేకగ్రంథములను పరిశీలించి పురాణమువ్రాసి ఈ జాతివారియొక్క గౌరవమును ముందుకు తెచ్చుటకై పాటుపడుచున్నారనియును యొకమిత్రునివలన వింటిమి.

8. కనుక తాము దయచేసి మనజాతికిగల ఆది గౌరవ వివరణములనుగూర్చి ఆప్రాంతములలోనుండు వైదికబ్రాహ్మణులవలన సాక్షిపత్రములను, వానికి ఆధారమయిన న్యాయములను చేర్చి ఇంగ్లీషులో నొకవిన్నపమును ఘనతవహించిన మహారాజాగారికి పంపునట్లుగా చేసియును, వానివలన మనజాతికిగల స్వతంత్రములు ఈ ప్రాంతములయందు పంపుటకును ప్రార్థించుచున్నాము. ఇట్లు,

తమప్రియముగలసోదరులు,

1. టి- యస్- వీరాస్వామినాయడు, పెన్షన్ పోష్టుమాస్టర్.
2. యస్ - రాఘవులునాయడు.
3. పి. వెంకటస్వామినాయడు.
4. వి. పెద్దునాయడు.
5. వి. పెరుమాళ్ నాయడు.
6. యస్. పి. రామస్వామినాయడు.
7. టి. పి. గోపాలకృష్ణనాయడు.
8. వి. దొరస్వామినాయడు.
9. యం. వెంకటసుబ్బయ్యనాయడు. మొదలగువారు.

ఇవ్విధముగనే మఱికొండఱును వ్రాసిపంపిరి. అంతయు ముద్రించుటకు అవకాశము లేనందున విరమించితిమి. అనేకులు తమ కష్టములనుగూర్చి విన్నపించు ఈసమయములో నెట్లుగా పురాణమునువ్రాయవచ్చునని యాలోచించుచుంటిని. ఇట్టిసమయములో బలిజవారియొక్క పూర్వసంతతులు, లేక నరపతి రాజులచరిత్రములుఅను గ్రంథము చెన్న



పురి సర్వకలాశాలాసంస్కృతభాషాపండితులును, గవర్నమెంటు తెనుగు ద్విభాషయునైన డాక్టర్ ఆపర్టుశాస్త్రిగారిచే ముద్రింపఁబడినది నాకు లభించెను. అందు వ్రాసియుండుదానిని యీక్రింద నుదహరింపఁబడుచున్నది.

## THE ORIGIN OF NARAPATIS.

"In the preface to the Balabhagavatam, Konerinatha gives an accurate account of the family of his patron, which family is known as the dynasty of the Narapatis. As Konerinatha, who hailed from Duvvuru, was a son of a former Minister, he enjoyed as such a peculiarly favourable position for being well informed about the family history of his protector. The genealogical information about the Narapatis supplied by Konerinatha coincides with the statements contained in the Vasucaritram of Ramabhusana, in the Narasabhupaliyam of Saradamurti, in the Narapativijayam or Ramarajiyam, the family chronicle of the younger line of the Narapatis and with those furnished by inscriptions.

The origin of the Narapatis is, in all the above four works and in the *Devanhalli inscription* traced back to *Arjuna* and thence to *Chandra.* The Narapatis are moreover styled Calukyas. According to the Narapativijayam and to the Devanhalli inscription Nandaraja is the eighty-third descendant of the *Pandava Arjuna,* and Calukya the ninth descendant of Nanda. From Calukya descended in course of time the well known Vijala or Bijjala of Kalyana. This Vijala, who belonged to the family of the Kalacuryas, though he usurped the throne of the Calukyas of Kalyana, is himself called Calukya Narayana, he is also known as Venga Tribhuvana Malla.

The son of Vijala, generally known as the Yuvaraja was, according to the Narapativijayam, the father of Hemmaliraja, who in his turn became the father of Tatapinnaraja, who in the Balabhagavatam, Vasucaritram, and Narasabhupaliyam heads the list of the Narapati dynasty.

The Narapatis are, therefore, acording to the Narapativijayam, the representatives of Vijala, and, like him, they are repeatedly called

Calukyas. The Narapatis themselves rose to great power especially in the territories of the Nizam, the Northern Circars and Ceded Districts.

### Inscriptions.

From Narayana,—Brahma, Atri, Chandra, Budha, Pururavas, Ayu, Nahusa, Yayati, Puru, &c., are descended the Bharatas, and as the 83rd in descent from *Arjuna* is given in the Narapativijayam—Nanda, his 9th descendant is Calukya and from him is descended Vijala or Bijjala of Kalyana. His grandson is Vira Hemmaliraya, Hemmaliraya's son is Tatapinna. &c., &c.

### Genealogical tree of the Narapatis.




Vide Pages 25,e26 and 73. A Contribution to the History of Southern India. Part I. Inscriptions. By Dr. Gusta Oppert, Ph. Dr. Professor of Sanskrit, Presidency College; Telugu Translator to Government, Madras &c.,



## ముందువ్రాసిన ఇంగ్లీషువాచకముయొక్క అభిప్రాయము.

———:o:———

## నరపతిరాజులయొక్క ఆదియుత్పత్తివివరణము.

———:o:———

బాలభాగవతముయొక్క ఉపోద్ఘాతములో కోనేరినాథుఁడు తన గ్రంథములో నరపతుల సంతతినిగూర్చి క్రమముగావ్రాసి యున్నాఁడు. ఆకోనేరి నాథుఁడుస్వగ్రామనివాసియును, పురాతననరపతిసంస్థాన మంత్రి కుమారుఁడును నై నందువలన, ఆనరపతుల యొక్క ఆదిఉత్పత్తి వివరణ ములను దెలియచేయు రాజవంశావళిని చదివి జూచి చరిత్రము వ్రాయు టకు అనుకూలము కల్గి యుండెను. ఆకోనేరినాథుఁడు వ్రాసినవంశావళి రామభూషణుఁడు వ్రాసిన వసుచరిత్రమునకును, మూర్తికవి వ్రాసిన నరసభూపాలీయమునకును, ఇదిగాక నరపతి విజయ, రామరాజీయ గ్రంథములకును, నరపతిరాజుల సంతతిని గూర్చిన శిలాశాసనములకును అనుగుణముగానే యున్నది.

పైనజెప్పిన నాలుగు గ్రంథముల వలనను దేవనహల్లిలో దొరకిన శాసనములవలనను,నరపతులు చంద్రవంశ తిలకుఁడైన అర్జునునికి సరైన సంతతియని స్పష్టమగుచున్నది. నరపతులకు చళుక్యులనెడి పేరును గలదు. నరపతి విజయ ప్రకారముగను దేవనహల్లి శాసనముల ప్రకా రముగను పాండవ వంశీయ అర్జునునకు (8౩) వసంతతి నందమహారాజు పుట్టినట్లును ఆ నంద మహారాజునకు చాళుక్యుఁడు తొమ్మిదవ సంతతి యనియును ఆ చాళుక్యుని సంతతిలో విజ్జలరాజుపుట్టి, కాలచూర్య రాజు లను స్థాపించి కల్యాణనగరమునుపాలించినట్లును ఆవిజ్జలునికి, యువ రాజును (నరపతివిజయప్రకారము) వానికి హెమ్మలరాజును,వానికి తాత పిన్నమరాజునుపుట్టినట్లును,ఆ తాతపిన్నమరాజు (బాలభాగవతము,వసు చరిత్రము,నరసభూపాలీయము, మొదలగు గ్రంథముల ప్రకారము) నరప తులకు ముఖ్యుడగుటవలనను నరపతులు చంద్రవంశక్షత్రియులే యగు చున్నారు. దానికి సరైన వంశవృక్ష మెట్లనఁగా:—

శ్రీమన్నారాయణునకు బ్రహ్మయును, ఆతనివలన అత్రియును, వారివలన చంద్రుఁడును,ఆయనవలన బుధుఁడును ఇట్లుగా పురూరవుఁడు ఆయువు, నహుషుండు, యయాతి, పురు మొదలగువారు పుట్టిరి. పురు వంశీయులైన పాండవులలో నొకడైన అర్జునునియొక్క 83 వ సంతతి నందమహారాజును, ఆనందునియొక్క 9వ సంతతి చాళుక్యుఁడును, వీని వలన విజ్జలుఁడును జనించిరి.

విజ్జలునియొక్క సంతతిలో
|
హెమ్మలరాయలు
|
తాతపిన్నమరాయలు
|
రాఘవదేవరాయలు
|
పిన్నశౌరి
|
ఆర్వీటి బుక్కరాయలు
|
సింగరాయలు
|
*రామరాయలు
|
తిమ్మరాయలు
|
కోదండరాయలు
|
శ్రీరంగరాయలు
|
కోనరాయలు, తిమ్మరాయలు, పుట్టి రాజ్యమేలిరి.

* ఈరామరాయలే శ్రీ నరపతి కృష్ణదేవరాయలవారి అల్లుఁడు. కృష్ణదేవరాయల తమ్ముఁడు అచ్యుతదేవరాయలు, ఈ అచ్యుత దేవరాయల సంతతిలో జేరినవారే తంజావూరి చేవప్పనాయుడు, అచ్యుతప్ప నాయుడు, విజయరాఘవులునాయుడు మొదలగువారు.



ఈచరిత్రవంశావళి శాసనమువలన నరపతులు ఆదిచంద్రవంశ క్షత్రియులు కావున, ఆనరపతిసంతతిలో జేరిన తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, మొదలగుస్థలములను పాలించినట్టి బలిజవంశనాయుడు గార్లందఱును చంద్రవంశ క్షత్రియులని స్పష్టమగుచున్నది.

పైన వివరించిన శాసనమును జదివిచూచువారు, అది నరపతులయొక్క స్త్రీసంతతిని కనఁబఱచు వంశావళియనితలంతురు. ఆ శొఙ్కతను నివారింపఁబూనియే ఆ నరపతులయొక్క ఆదిపురుషసంతతి వంశావళి శాసనమును ముద్రించుటకై ప్రయత్నించుచుండఁగా, దైవానుకూలముగా ప్రకృతమున ఆనెగొంది (విజయనగర) నరపతి సంస్థానమును, పాలించుచుండు శ్రీమాన్ శ్రీరంగ దేవరాయలురావు సాహేబుగారు సంస్థానరికార్డులోనున్న పురాతన శాసనమును తత్కాలము విజయనగరసంస్థాన చరిత్రమును వ్రాయుచుండు బ్రహ్మశ్రీ, బెంగుళూరు సూర్యనారాయణరావు, బి.యే, యం. ఆర్. ఏ. యస్. వారియొక్క సహాయమువలన నేను గ్రహించి దాని తాత్పర్యమును మాత్రము దిగువ నుదహరించుచున్నాఁడను.

---

శాసనప్రకార విజయనగర పురుషసంతతి

వంశావళి సంగ్రహము.

శ్రీమన్నారాయణ మూర్తివలన
1 బ్రహ్మ
2 అత్రి
3 చంద్రుఁడు
4 బుధుఁడు
5 పురూరవుఁడు
6 ఆయువు
7 నహుషుఁడు
8 యయాతి
9 పురు
10 జనమేజయుఁడు
11 ప్రాచీనవాక్
12 శర్యాతి
13 అహంయాతి
14 సార్వభౌముఁడు
15 జయత్సేనుడు
16 అరాజ
17 మహాబాహు

18 అయుతాన్యథా
19 అక్రోధనుఁడు
20 దేవాతిథి
21 రుచకుఁడు
22 రుక్షరాజు
23 అనరణ్యుఁడు
24 దృష్టుఁడు
25 జనమేజయుఁడు
26 దుష్యంతుఁడు
27 పృథుఁడు
28 భూమన్యు
29 సుహోత్రుఁడు
30 అస్తి
31 నికుంభుఁడు
32 అజమీఢుఁడు
33 సంవరుఁడు
34 కురు
35 విదూరథుఁడు
36 అనశ్వుఁడు
37 పరీక్షిత్తు
38 భీమసేనుఁడు
39 ప్రతీపుఁడు
40 శంతనుఁడు
41 విచిత్రవీర్యుఁడు
42 పాండురాజు
43 అర్జునుఁడు
44 అభిమన్యువు
45 పరీక్షిత్తు
46 జనమేజయుఁడు
47 శతానీకుఁడు
48 సహస్తుఁడు
49 అశ్వమేధజయుఁడు
50 నిజక్రతువు
51 ఉద్ధరుఁడు
52 సిద్ధరథుఁడు
53 శుచిరథుఁడు
54 సుషేణుఁడు
55 సునీతి
56 నృచక్షు
57 నలుఁడు
58 పారిప్లవుఁడు
59 ఖనయువు
60 మేధావి
61 నృపుంజయుఁడు
62 తుర్వసు
63 బృహద్రథుఁడు
64 సుదర్శనుఁడు
65 శతానీకుఁడు
66 దుర్దముఁడు
67 విహీనరుఁడు
68 దండపాణి
69 నిమి
70 క్షేమకుఁడు
71 రిపుంజయుఁడు
72 ప్రద్యోతనుఁడు
73 పాలకుఁడు
74 విశాఖయూపుఁడు
75 అజకుఁడు



76 నందివర్ధనుఁడు
77 శిశునాగుఁడు
78 కాకవర్ణుఁడు
79 క్షేమధర్ముఁడు
80 క్షేత్రకుఁడు
81 విదారకుఁడు
82 ధర్మకుఁడు
83 అజయుఁడు
84 నందివర్ధనుఁడు
85 మహానంది
86 శిశునాగుఁడు
87 మహాపద్ముఁడు
88 మౌర్వి
89 చంద్రగుప్తుఁడు
90 వారిరాజు
91 అశోకవర్ధనుఁడు
92 సుయశుఁడు
93 సంగీతుఁడు
94 శాలీశుకుఁడు
95 సోమశర్మ
96 సంతానవాహి
97 బృహద్రథుడు
98 పుష్యమిత్రుఁడు
99 అగ్నిమిత్రుఁడు
100 దేవభూతి
101 కణ్వుఁడు
102 వసుదేవుఁడు
103 భూమిమిత్రుఁడు
104 నారాయణుఁడు
105 సుదక్ష్నుఁడు
106 కృష్ణుఁడు = ఆంధ్రుడు
107 శాంతకర్ణి
108 పౌర్ణమాసి
109 లంబోదరుఁడు
110 శిబిలికుఁడు
111 మేఘస్వాతి
112 అంశుమంతుఁడు
113 అనిష్టకర్మ
114 అలేయ
115 సతలకుఁడు
116 ప్రబలసేనుఁడు
117 సునందుఁడు
118 చకోరుఁడు
119 శివఖ్యాతి
120 పురీమాన్
121 శివశ్రవ
122 శివస్కంధుఁడు
123 యజ్ఞుఁడు
124 విజయుఁడు
125 చంద్రబీజుడు
126 సుబలుఁడు
127 ద్రుషుఁడు
128 శిశునంది
129 సుయశోనంది
130 ప్రవీరకుఁడు
131 పుష్పమిత్రుఁడు

132 నందమహారాజు
133 చాళుక్యుఁడు

134 విజ్జలరాజు
135 విజయదేవుఁడు
136 విష్ణువర్ధనుఁడు
} చాళుక్యుని కొడుకులు

---

చాళుక్యుని కొడుకులలో నొకఁడైన విజ్జలరాజు సంతితి.

1 వీరహెమ్మలుఁడు
2 తాతపిన్నమరాజు
3 సోమదేవుఁడు
4 రాఘవదేవుడు
5 పిన్నశౌరి
6 బుక్కరాజు
7 రామభద్రుఁడు
8 కోదండరాముఁడు
9 శ్రీరాముఁడు
10 రామరాజు. (కృష్ణదేవరాయల అల్లుఁడు)

చాళుక్యునికొడుకులలో నొకఁడైన విష్ణువర్ధనుని సంతతి.

1 అణుమహారాజు
2 నృసింహదేవుఁడు
3 రామదేవరాయలు
4 ప్రతాపరాయలు
5 జంబుకేశ్వరరాయలు (ఇతనికి సంతతిలేనందున ఇతనితమ్ముడు తిమ్మరాయలు పట్టమునకువచ్చెను.)
6 తిమ్మరాయలు
(తిమ్మరాయలసంతతి)
7 ఈశ్వరరాయలు.
8 నరసింహరాయలు 9 తిమ్మరాయలు 10 వీరనరసింహరాయలు 11 కృష్ణదేవరాయలు 12 అచ్యుతదేవరాయలు. 13 రంగదేవరాయలు. (7వ అధ్యాయమునుచూడుడు)

---



శ్రీకృష్ణదేవరాయ అచ్యుత దేవరాయలయొక్క సంతతిలోఁ జేరినవారే తంజావూరినేలిన చేవప్పనాయడు, అచ్యుతప్పనాయడు, రఘునాథనాయడు, విజయరాఘవులునాయడు, మన్నారునాయడు, చెంగమలదాసనాయడు. వీరియొక్క సంబంధులే, మధుర, తిరుచినాపల్లిలోనేలిన విశ్వనాథనాయడు, 2 కుమార కృష్ణప్పనాయడు, 3 పెద్దివీరప్పనాయడు, 4 విశ్వనాథనాయడు, 5 లింగప్పనాయడు, 6 విశ్వనాథనాయడు, 7 ముద్దుకృష్ణప్పనాయడు, 8 ముద్దువీరప్పనాయడు, 9 తిరుమలనాయడు, 10 ముద్దు అళగిరినాయడు, 11 చొక్కనాథనాయడు, 12 ముద్దులింగప్పనాయడు, 13 రంగకృష్ణముద్దువీరప్పనాయడు, 14 మంగమ్మగారు, 15 విజయరఘునాథ చొక్కలింగనాయడు, 16 మీనాక్షిఅమ్మగారు, 17 బంగారు తిరుమలనాయడు, 18 విజయరఘునాథనాయడుగారు.

ఈజెప్పిన నాయడుగార్ల సంబంధులే లంకయనెడి సిలోను ద్వీపములోని ఖండియందు పాలించిన మధుర పెద్ది కృష్ణప్పనాయడుగారియొక్క బావమరిదియైన 1 విజయభూపాల మహారాజుగారు, 2 కొండల మహారాజుగారు, 3 అంగదాంకితమహారాజుగారు, 4 రాజాధిరాజ మహారాజుగారు, 5 విక్రమ లేక కీర్తిసింహమహారాజుగారు.

ప్రకృతమున తిరువాదిలో సబ్ రిజిస్ట్రారుగను, రాజపేషగా దారుగనునుండు శ్రీ మహారాజా త్యాగసింహళ మహారాజుగారును ఖండిరాజసంతతిలోఁ జేరినవారని తెలిసెడిని. కావున,

ఈ రెండు శాసనములవలనను, ఈ ఉపోద్ఘాతము 7-8 పుటలయందు ముద్రించియుండు శ్రీవిల్లిపుత్తూరు శ్రీ వైష్ణవ వడకల తెంకల ఆచార్యస్వాములయొక్క తాత్కాలిక శ్రీముఖపత్రికవలనను, నరపతులును, వారియొక్క తర్వాతి సంతతివారైన బలిజనాయడుగార్లును ఆదిచంద్రవంశ క్షత్రియపాండవులయొక్క పరంపరలో వచ్చినవారని స్పష్టమగును. అయినను ఈ బలిజవారియొక్క ఆది అంతస్థు,

మధ్యకాలమహిమ, తత్కాలస్థితులను సాంగోపాంగముగా తెలియ పఱచు శాసనచరిత్రములు లభించనిహేతువువలనను, ఈగ్రంథమును వ్రాయుటకువలయు విషయములకు పలుచోట్లకుపోయియు, పలుభాషల గ్రంథములను బహుదినములుగా చదివియును తృప్తికరముగా చరిత్ర సంబంధవిషయములు నేకోరినప్రకారముగా లభ్యములేక వంతనొందు చుంటిని.

ఇట్టికాలములో ఈచరిత్రమునకు అనుకూలమైన కొన్ని శాసనాదిగ్రంథములను ఈదిగువ కనబఱచిన ఘనవంతులును స్నేహితులును నాకొసంగి సాయపడిరి. వారిలో ముఖ్యులెవరనఁగా, చెన్నపురి గవర్నమెంటువారును, కోయముత్తూరు డిస్ట్రిక్టుకోర్టు కలెక్టర్ మిస్టర్. సి. మవున్సి, ఐ. సి. యస్ దొరగారును, చిత్తూరు డిస్ట్రిక్టుజడ్జి మిస్టర్. జే. జే. కాట్టర్. ఐ. సి. యస్ దొరగారును, విజయనగర (అనెగొంది) సంస్థానచరిత్ర గ్రంథకర్తయైన బ్రహ్మశ్రీ సూర్యనారాయణరావుగారును, బ్రహ్మచారిస్వామి నారాయణదాసుగారును, మధుర ద్రావిడసంఘము శెందమిళ్ పత్త్రికాధిపతులైన మహావిద్వాన్ శ్రీమాన్ రాఘవయ్యంగారువారును, చెన్నపురి సెంటుథోమ్ కాలేజ్ ద్రావిడపండితులు శ్రీమాన్ వేంకటరామయ్యంగారువారును, చెన్నపురి విద్యావతిఆఫీసు సొంతదారు శ్రీమాన్ సి. దొరసామయ్యగారును, చెన్నపురి టెలిగ్రాప్ ఆఫీస్ శ్రీమాన్ విజయరాఘవులునాయడుగారును, చెన్నపురి హైకోర్టు వకీల్ శ్రీమాన్ పమ్మల సంబంధమొదలారుగారును, చెన్నపురి అక్కౌంటాంటు జనరల్ ఆఫీసు మ-రా-రా-శ్రీ కనకసభైపిళ్లగారును, హైదరాబాదు మ-రా-రా-శ్రీ భోజరాజునాయడుగారును, మ-రా-రా-శ్రీ రంగసామిరాజుగారును, కోయముత్తూర్ తాశీల్‌దార్ మ-రా-రా-శ్రీ బి. యే, చెన్నకేశవులు నాయగారును ధారాపురము సాహుకార్ మ-రా-రా-శ్రీ అళగిరిసామినాయడుగారును, పొళ్లాచ్చి ఓవర్సీయర్ మ-రా-రా-శ్రీ గోవిందసామినాయడుగారును, చెన్నపురి మ-రా-రా-శ్రీ భగవద్గీత అబ్బాయినాయడు



గారును, పాళయంకోట కలెక్టరాఫీసు యతిరాజులు నాయడుగారును, గూడలూరు (తిరుపాపులియూర్) మ-రా-రా-శ్రీ రంగస్వామినాయడుగారును, చాపట్ల మ-రా-రా-శ్రీ సీతారామనాయడుగారు నీ మొదలగువారు. వీరందఱికిని కృతజ్ఞతతో వందనములు చేయుచున్నాఁడను.

ఈ బలిజపురాణమును ప్రథమమున ద్రావిడభాషయందు ముద్రించితిని. ద్రావిడము తెలియని ఆంధ్రదేశీయులు తమయొక్క స్వభాషయైన ఆంధ్రమున ప్రచురింపవలయునని పలువురు పలుమాఱు మొఱబెట్టుకొనిరి. వారికోర్కెను నెఱవేర్ప పమకట్టి ఈగ్రంథమును సంగ్రహముగా ఆంధ్రీకరించితిని. ఈకార్యమునకు చెన్నపురి విద్యావతిఆఫీసు ప్రొప్రయిటరును, అనేక లౌకిక వైదిక గ్రంథకర్తలునగు శ్రీమాన్, సి. దొరసామయ్యగారు నాకు విశేష సహాయముచేసిరి.

ఈగ్రంథమును పఠించు పెద్దలు దీనియందుగల దోషములను క్షమించి యింకను ఇందు చేర్చవలసిన విషయము లిట్టివని తెలియ పఱచినయెడల రెండవకూర్పునందు చేర్చి ముద్రించుటకు సిద్ధముగా నున్నాఁడను.

ఇట్లు

కోయముత్తూరు
11 - 1 - 05.

సేలం. పగడాల,
నరసింహులునాయడు.



శ్రీ.
జగదీశాయనమః.

# బలిజవంశ పురాణము.

## మొదటి అధ్యాయము.

బలిజవారు ఆంధ్రులనియును, గౌరవులనియును, చంద్రవంశ క్షత్రియులనియును పేర్కొనఁబడుదురు.

---

### బలిజ వంశోత్పత్తి వివరణము.

**శ్రీమద్భాగవతము, నవమస్కంధము 22 అధ్యాయము, 45 శ్లోకము.**

శ్లో. క్షేమకం ప్రాప్య రాజానం సంస్థా ప్రాప్స్యతివై కలౌ,
అథ మాగధ రాజానో భవితారో వదామి తే.

**భాగవతము నవమస్కంధము 23 వ అధ్యాయమునందు.**

శ్రీ శుక ఉవాచ.

శ్లో. అనోఃసభానరశ్చక్షుః పరోక్షశ్చత్రయ స్సుతాః,
సభానరాత్ కాలనరః సృఞ్జయస్త త్సుత స్తతః. ౧.
జనమేజయ స్తస్యపుత్రో మహాశీలో మహామనాః,
ఉశీనర స్తితిక్షుశ్చ మహామనస ఆత్మజౌ. ౨.
శిబిర్వన శ్శమిర్దక్ష శ్చత్వారోశీనరాత్మజాః,
వృషాదర్భః సువీరశ్చ మద్రః కైకయ ఆత్మజాః. ౩.
శిబే శ్చత్వార ఏవా సం స్తితిక్షోశ్చరుశద్రథః,
తతో హేమో ౽థసుతపా బలిః సుతపసో ౽భవత్. ౪.
అంగ వంగ కళింగాద్యాః సింహపుండ్రాంధ్ర సంజ్ఞితాః,
జజ్ఞిరే దీర్ఘ తమసో బలేః క్షేత్రే మహీక్షితః. ౫.
చక్రుః స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యకాంశ్చ తే.

తా. యయాతి కొడుకైన అనువునకు సభానరుఁడు, చక్షుస్సు, పరోక్షుఁడు అను ముప్వురు పుట్టిరి. సభానరునికి కాలనరుఁడును, కాలనరునకు సృంజయుఁడును, సృంజయునకు పురంజయుఁడును, పురంజయునకు జనమేజయుఁడును, జనమేజయునకు మహాశీలుఁడును, మహాశీలునకు మహామనస్సును పుట్టిరి. మహామనస్సునకు ఉశీనరుఁడు, తితిక్షువు అని యిర్వురు కొడుకులు పుట్టిరి. ఉశీనరునకు శిబి, వన, శమి, దక్షుఁడు అని నల్వురు పుట్టిరి. శిబికి వృషాదర్భ, సువీర, మద్ర, కేకయులని నల్వురు కలిరి. తితిక్షువునకు రుశద్రథుఁడును, వానికి హేముఁడును, వానికి సుతపుఁడును, వానికి బలి యును పుట్టిరి. బలి యొక్క క్షేత్రమునందు దీర్ఘతముఁడను ఋషివలన అంగ, వంగ, కళింగ, సింహళ, పుండ్ర, ఆంధ్ర, అను పేర్లుగలవా రాఱుగురు జన్మించి, ఈ భూమిని భాగించుకొని వారి వారి దేశములకు వారి వారి పేరుల నుంచిరి. అదిమొదలు అంగాది దేశము లాఱయ్యెను.

సుతపుఁడను మహారాజునకు బహుకాలము సంతానము లేనందున అనేకములైన బలులను యాగములను చేయఁగా నొక్క కుమారుఁడు కల్గెను. ఆ బలివలన పుట్టినవారైన అంగ వంగ కళింగ సింహళ పుండ్ర ఆంధ్రులు అనువారు బలిజవారైరి. అనఁగా, బలిః = బలియనువానికి, జ = పుట్టినవారు అని వ్యుత్పత్తి.

బలి కొడుకైన ఆంధ్రుఁడు మగధదేశమునకు రాజైనాఁడు. వీని వంశీయులు మహా పరాక్రమశాలురై 460 సంవత్సరములు హిమాచలము ఉజ్జయిని వంగదేశము ఆనెగొంది ఈ సరిహద్దులలోఁగల దేశమును పాలించుచుండిరి.

మిస్టర్ రాబర్టు స్యూయల్ దొరగారు అనేక శాసనములను
పరిశీలించి వ్రాసినదాని సారాంశ మేమనగా:—

ఉత్తరదేశమును ఆంధ్రవంశీయు లేలిరి. మధ్యకాలమున ఆంధ్రులను జయించి యితర రాజులు కొందఱేలిరిగాని, క్షిప్రకుఁడను ఆంధ్రరాజు అన్యమతస్థులను జయించి ఆంధ్రరాజ్యమును మరల స్థాపించినాఁడు. ఈ ఆంధ్రులనే గ్రీకులు “ఆంద్రియా” అని చెప్పుచుండిరి. ఈ ఆంధ్రరాజులలో రాజ్యములేలినట్టి వంశస్థులు “బంధువు” లనియును, ఆంధ్రులయొక్క ఉద్యోగీయులును సేవకులును “ఆంధ్ర భృత్యులు” అనియును, పేర్కొనబడియుండిరి. ఆంధ్రరాజులు తమ దేశములను విభాగించి అచ్చటచ్చట ప్రతినిధులుగా తమ బంధువులను నియమించిరి. చెన్నపురి రాజధానియొక్క ఉత్తర ప్రాంతమంతయును కృష్ణానదికి దక్షిణము బహుదూరమువఱకును గల దేశము ఆంధ్రులకు స్వాధీనమైయుండెను. ఆంధ్రరాజుల నాణెము లిప్పుడును కనఁబడుచున్నవి. ఈ ఆంధ్రులు బౌద్ధులై యుండిరి. క్రీస్తుశకాబ్దారంభకాలమునందు ఆంధ్రులు మహా పరాక్రమశాలురై యుండిరనియును, కళింగ దేశమంతయు ఆంధ్రుల అధికారమునకు లోఁబడియుండెనియును “ప్లిని” అనెడి యాత్రికుడు చెప్పుచున్నాఁడు.

మిస్టర్ జేమ్సు ప్రిన్సిప్ దొరగారు వ్రాసినదాని సారాంశ మేమనగా:—

ఆంధ్రరాజులు 800 ఏండ్లు గంగానదీతీరమునందు మహా పరాక్రమశాలురుగా పాలించుచుండిరి. కోసలరాజులును ఆంధ్రులే. క్రీస్తు పుట్టిన 3 వ శతాబ్దములో ఆంధ్రరాజులయొక్క కడపటి వంశీయుఁడైన పులోమార్ కాలమునందు ఆంధ్రులు ప్రబలముగా నుండిరని “విల్పర్డు” దొరగారును చెప్పుచున్నారు. ఆంధ్రుల కాకాలమున లక్ష సైన్యమును, వెయ్యియేనుఁగులు నున్నట్లు “ప్లిని” చెప్పుచున్నాఁడు. కనుక ఆంధ్రులు క్రీస్తుకంటె ముందే మహోన్నత దశయందుండిరని వేద్యమగుచున్నది.

ఆంధ్రరాజులయొక్క మూలపురుషుఁడైన బలియొక్క సంతతిని గూర్చియును, ఆంధ్రరాజ్య స్థాపకుఁడైన క్షిప్రకుని సంతతినిగూర్చియును, భాగవతము, విష్ణుపురాణము, వాయుపురాణము, బ్రహ్మాండ పురాణము, మత్స్యపురాణము, బృహత్సంహిత మొదలగు గ్రంథము

లయందు విస్తారముగాఁ జెప్పఁబడియున్నను, అవి యొకదానికొకటి సంబంధములేకయే యున్నవి. ఇపుడుశాసనాధారములను అనుసరించియు, మిస్టర్ "పెర్గూసన్" మిస్టర్ రాబర్టు "స్యూయల్" మిస్టర్ "విల్ఫర్డు" మొదలగు ఏష్యాటిక్ చరిత్రకారులు వ్రాసిన గ్రంథాధారముల ననుసరించియు నుదహరింపఁబడుచున్నది.

మగధదేశరాజ వంశపరంపర.

| రాజులనామములు. | రాజ్యకాలసంవత్సరములు. | |
|---|---|---|
| 1. బలి, లేకబలిజ, లేక శుభకరుఁడు. వీఁడు క్రీస్తు పుట్టుటకుముందు 31 మొదలు క్రీస్తుపుట్టిన 8 వఱకు రాజ్యమేలినాడు. తక్కినరాజులందఱుపాలించినసంవత్సరములు క్రీస్తుపుట్టిన తర్వాతయని తెలియఁదగినది. | | |
| 2. కృష్ణరాజు ... ... | 8 ... | 10. |
| 3. సత్కారుణ్యుఁడు ... | 10 ... | 28. |
| 4. ప్రణోదసంహారుఁడు ... | 28 ... | 46. |
| 5. శివస్వాతి ... ... | 46 ... | 64. |
| 6. సత్కారుణ్యుఁడు 2 ... ... | 64 ... | 120. |
| 7. లంబోదరుఁడు ... ... | 120 ... | 138. |
| 8. అభిదాఘుఁడు ... ... | 138 ... | 150. |
| 9. శంకరుఁడు ... ... | 150 ... | 168. |
| 10. సత్కారుణ్యుఁడు 3. ... | 168 ... | 186. |
| 11. స్కంధస్వాతి ... ... | 186 ... | 193. |
| 12. మృగేంద్రుఁడు ... ... | 193 ... | 196. |
| 13. కుండలస్వాతి ... ... | 196 ... | 204. |
| 14. స్వాతీకరుఁడు ... ... | 204 ... | 205. |
| 15. పులోమవిదురుఁడు ... ... | 205 ... | 241. |



| | | |
|---|---|---|
| 16. గోరశ్వసువు ... ... | 241 ... | 266. |
| 17. హాలరాజు ... ... | 266 ... | 271. |
| 18. మండలాకారుఁడు ... | 271 ... | 276. |
| 19. పురందరసేనుఁడు ... | 276 ... | 281. |
| 20. సుందరుఁడు ... ... | 281 ... | 284. |
| 21. రాజస్వాతి ... ... | 284 ... | 284½. |
| 22. శివస్వాతి 2. ... ... | 284½ ... | 312. |
| 23. గౌతమీపుత్త్రుఁడు ... | 312 ... | 333. |
| 24. వసిష్ఠపుత్త్రుఁడు ... | 333 ... | 335. |
| 25. పులోమదుఁడు ... ... | 335 ... | 363. |
| 26. శివశ్రీ ... ... | 363 ... | 370. |
| 27. స్కంధస్వాతి 2. ... | 370 ... | 377. |
| 28. యజనుఁడు ... ... | 377 ... | 406. |
| 29. విజయుఁడు ... ... | 406 ... | 412. |
| 30. చంద్రకేశుఁడు ... | 412 ... | 422. |
| 31. పులోమాన్ ... ... | 422 ... | 429. |

ఇట్లు శిలాలిఖితములవలనఁ దెలియవచ్చినను, ఆంధ్రరాజులేలిన దేశములలోని నాణెములలో మాత్రము కొన్నిటియందు వసిష్ఠకుమారవాలిబాహువనియును, కొన్నిఁటియందు మహీధరకుమార శివాలయఅనియును, మఱిఁగొన్నిటియందు గౌతమీపుత్త్ర విద్యావాన్ అనియును, వేఱుకొన్నిఁటియందు ఇతరనామములును కన్పట్టుచున్నవి.

## మతము.

ఆంధ్రరాజులు ఆదికాలమున బౌద్ధమతస్థులైనను తర్వాత శాక్తి శైవ వైష్ణవ మతస్థులైనట్లు స్పష్టముగాఁ గనఁబడుచున్నది.

ఆంధ్రరాజులు బుద్ధమతస్థులై యున్నందున అప్పుడప్పుడు బ్రాహ్మణులకును వీరికిని కలహములు జరుగుచుండెను. దీనిచే దేశము

నందు ఐకమత్యములేకపోయెను. ఇట్టిసమయమునందు గ్రీకులు పారసీకులు మహమ్మదీయులు మొదలగువారు ఆంధ్రరాజులపై దండెత్తివచ్చిరి. అప్పుడు 30 వ తరమువాఁడైన చంద్రకేశుఁడు రాజ్యముచేయుచుండినాఁడు. ఈ కాలముననే ఈ దేశములోని ముఖ్య గ్రంథములును, అనేక పట్టణములును, గుళ్లు, గోపురములును ఇతరమతస్థులవలన నిర్మూలముచేయఁబడెను. అవాంతర రోగములుగలిగి జనులను యమపురికింబంపుచుండెను. సత్కులమునం బుట్టినవారందఱును పరదేశీయులగు దుష్టులకుభయపడి అడవులకు వెడలిపోయిరి. అందుచే సుమారు ౨౦౦ ఏండ్లదాఁక దేశములో సరైన రాజులేకపోయినాఁడు.

అయినను పులోమార్క తర్వాతి ఆంధ్రరాజుల పేరులు తెలియకపోయినను, ఆంధ్రవంశీయ మారుతిరాజుయొక్క సంతతివారైన ఏడ్గురురాజులు మగధదేశమునుండివచ్చి యితరదేశముల నాక్రమించికొని రాజ్యమేలినట్లుగా అనేక శిలాశాసనములు కన్పట్టుచున్నవి.

ఆ యేడుగురురాజులు వసించిన స్థానములు.

1. ఉజ్జయినియందు విక్రమార్కుని సంతతివారు.
2. పశ్చిమసముద్రతీరములలో కాలచూర్యులసంతతివారు.
3. కల్యాణనగరమున చాలుక్యసంతతివారు.
4. ఓరుగల్లునందు కాకతీయగణపతిరాయసంతతివారు.
5. కొండవీటియందు గజపతిరాయ సంతతివారు.
6. ఆనెగొందియందు నరపతిరాయ వంశమువారు.
7. ఓఢ్రదేశములోని కళింగనగరస్థకళింగరాజవంశమువారు.

ఇదిగాక ఆంధ్రదేశమునందు ఆంధ్రభాషను మాటలాడునట్టి అనేకరాజులును, రావు అనెడి బిరుదనామముగలరాజులును, ప్రకృతమున తెలగాలు అనియు, తెనుఁగువెలమలు అనియుచెప్పఁబడుచుండువారును, ఆంధ్రవంశ మాగధరాజ సంతతివారేయని తెలియుచున్నది.

---



## రెండవ అధ్యాయము.

---

### విక్రమార్కవంశ చరిత్రము.

మిస్టర్ "లిత్ బ్రడ్జి" అనువారు రచియించిన హిందూ దేశచరిత్రమువలనఁ దెలియునట్టిసారాంశమేమనఁగా, ఆంధ్రులలో ప్రసిద్ధుఁడైన విక్రమార్కమహారాజు మాళవదేశములోని ఉజ్జయినీ నగరమునేలుచుండినాఁడనియే.

విక్రమార్కునికథలనెడి ద్వాత్రింశత్సాలభంజిక కథలయందు విక్రమార్కుఁడు బ్రాహ్మణునకును రాజకన్యకకును పుట్టినట్లును, రెండువేలేండ్లు జీవించినట్లును వ్రాయంబడియున్నది. ఈవిషయముచాలా అసంగతము గనుక దీనిని బుద్ధిమంతులు నమ్మదగదు.

శాసనాధారములచేతను, ఇతర ప్రబంధాధారములచేతను విక్రముఁడు రాజపుత్త్రుఁడేయనియును, క్రమముగా మనుష్యాయువే కలిగియుండినాఁడనియును వేద్యమగుచున్నదే గాని అత్యాశ్చర్య కల్పనావిషయమేదియు కనంబడలేదు. అయినను విక్రమార్కులు పలువురు కలరని తెలిసెడిని.

1. పాటలీపురమునందున్న విక్రమార్కునకు విక్రమకేసరియని పేరు కలదు. వీఁడు శాలివాహనునిచేఁ జంపఁబడినాడని చెప్పఁబడియున్నది.
2. మాళవదేశమునందున్న విక్రమార్కుఁడు మ్లేచ్ఛులను జయించినాఁడనియును, వీనినేశాలివాహనుఁడు జయించినట్లును చెప్పఁబడియున్నది.
3. ఆగ్నేయ పురాణప్రకారముగా విక్రమార్కుఁడు చంద్రవంశీయ ఆంధ్ర క్షత్త్రియుఁడనియును, పాండవ కులస్థుఁడైన అర్జునునకు 785సంవత్సరములకుమీద జనించి ఉజ్జయినిని పాలించినాఁడనియును చెప్పఁబడియున్నది.

ఆగ్నేయ పురాణ ప్రకారము ఉజ్జయిని విక్రమార్క వంశీయ ఆంధ్ర క్షత్రియ పరంపర వివరణము.

| రాజుల నామములు. | | | పాలించిన సంవత్సరములు. |
|---|---|---|---|
| 1. ధనంజయుఁడు ... | క్రీ - ము. | ... | 840 |
| 2. జితచంద్రుఁడు | ,, | ... | 760 |
| 3. సముద్రపాలుఁడు | ,, | ... | 670 |
| 4. నరవాహనుఁడు ... | ,, | ... | 680 |
| 5. భూతిరాజు ... | ,, | ... | 580 |
| 6. ఆదిత్య భువనుఁడు | ,, | ... | 400 |
| 7. బ్రహ్మరాజు ... | ,, | ... | 390 |
| 8. ఆదిబ్రహ్మ ... | ,, | ... | 360 |
| 9. సదాశివసేనుఁడు | ,, | ... | 271 |
| 10. హేమరథుఁడు ... | ,, | ... | 191 |
| 11. గంధరూపుఁడు | ,, | ... | 91 |
| 12. విక్రమార్కుఁడు | ,, | ... | 56 |

విక్రమార్కుని తర్వాతి రాజులు.

| | | | |
|---|---|---|---|
| 1. చంద్రసేనుఁడు ... | క్రీ - పు. | ... | 44 |
| 2. సూర్యసేనుఁడు ... | ,, | ... | 135 |
| 3. చంద్రసేనుఁడు ... | ,, | ... | 215 |
| 4. కనకసేనుఁడు ... | ,, | ... | 216 |
| 5. చంద్రపాలుఁడు | ,, | ... | 302 |
| 6. మహేంద్రపాలుఁడు | ,, | ... | 402 |
| 7. కర్మచంద్రుడు ... | ,, | ... | 409 |
| 8. విజయనందుఁడు, సంతతిలేనందున వీని దత్తపుత్త్రుఁడు సింధులుఁడు... | ,, | ... | 410 |
| 9. ముంజుఁడు (సింధులుని సోదరుఁడు) | ,, | ... | 470 |
| 10. *భోజుఁడు (సింధులుని కొడుకు) | ,, | ... | 483 |

* భోజరాజు శాలివాహన శకాబ్దము 540 లో జన్మించినాఁడు.



భోజునకుతర్వాత 45 గురురాజులు క్రీస్తుపుట్టిన 1210 వఱకు ఉజ్జయినియందుండి దేశమునుపాలించుచుండిరి. విక్రమార్కరాజుయొక్క పూర్వులు బౌద్ధమతస్థులైనను విక్రమార్కుఁడు బ్రాహ్మణ మతమును అవలంబించి అనేక హిందూదేవాలయాది ధర్మకార్యములుచేసినాఁడు. ఈతఁడు ఆ కాలమునందువచ్చిన గ్రీకులు మొదలగు పరమతస్థులను కరూరు ప్రదేశమున జయించి హిమాచలమువఱకును తనరాజ్యమును స్థాపించెను. వీని సంస్థానమునందే ధన్వన్తరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు, శంకుకవి, బేతాళభట్టు, ఘటకర్పరుఁడు, కాళిదాసు, వరాహమిహిరుఁడు, వరరుచి, అను తొమ్మండ్రుగురుకవులుండిరి. వీనిశకమైనవిక్రమసంవత్సరము క్రీస్తునకుమున్ను 56 మార్చి నెలలో ప్రారంభమైనది. అయినను వీఁడు 130 సంవత్సరములుజీవించి, కలియుగము 3044 లో పరలోకమొందెను. కనుక ఈ విక్రముని శాలివాహనుఁడు జయించుట అసంగతము. ఏలన, శాలివాహనశకము క్రీస్తుపుట్టిన 79 వ సంవత్సరము ప్రారంభమగుటంజేసి వీఁడు విక్రముని సమకాలీనుఁడు కాఁడని తేటపడుచున్నది. శాలివాహనుఁడు మాళవదేశమును మహారాష్ట్ర దేశముతో జేర్చి 21 సంవత్సరములు పాలించుకాలమునందు మహమ్మదుగుజిని అనువాఁడు ఘూర్జర దేశముమీఁద దండెత్తినాఁడు. వీఁడే సోమనాథపురమును పాడుచేసినవాఁడు.

---

భోజమహారాజ చరిత్రము.

శిలాశాసన ప్రకారమునను, చరిత్రాదులవలనను దెలియఁబడిన ప్రకారముగా వ్రాయఁబడుచున్నది.

విక్రమార్కులెట్లు పలువురుగలరో, అట్లే భోజరాజులును పలువురుండిరని తెలియుచున్నది. వీరిలో నొక భోజునకు విక్రముఁడనేపేరు కలదు. అయినను మాళవ దేశములోని ధారానగరాధిపతియైన భోజుఁడే భోజరాజని తెలియు చున్నది. ఈ భోజునియొద్దనే కాళిదాసు,

భవభూతి, దండి, బాణుఁడు, సుబంధు మొదలగు కవులున్నట్లు భోజచరిత్రములో వ్రాయంబడి యున్నది. కొన్ని చరిత్రలవలన విక్రమార్కునియొద్దనున్న కాళిదాసు వేఱే యనియును, ఈకాళిదాసు వేఱేయనియును గానవచ్చెడిని. అయినను ఈ భోజరాజు విద్యాసంపన్నుఁడునైయుండి అనేక పండితులనాదరించి అనేక గ్రంథములను రచియించునట్లు చేసినాఁడు. భోజ ప్రబంధముచేత నీతఁడు 114సంవత్సరములు జీవించినట్లును, ఈతని కాలములో శస్త్ర వైద్యము విశేషముగా నుండె ననియును, సమ్మోహిని (క్లోరొఫారం) మొదలగునవియు కలవనియును విశదమగు చున్నది. ఈ భోజునికొడుకు జయానందుఁడు 21సంవత్సరములు రాజ్యము నేలినాడు. ఒకానొక శాసనమునందు భోజుని కుమార్తైయైన భానుమతిని జయానందుడు పరిణయ మయ్యెనని వ్రాయంబడియున్నది. అప్పుడు వీడు భోజునకు అల్లుఁడు కావలయును. లేదా ఆభోజుడైనవేఱే కావలయును.

---

## మూఁడవ అధ్యాయము.

---

### చాళుక్యవంశ పరంపర.

అనేక శాసనములచేతను గ్రంథాధారములచేతను దెలియవచ్చు విధముగా చాలుక్యపరంపర యెట్లున్నదనఁగా,— పాండవ వంశీయ అర్జునునియొక్క 83 వ సంతతివాఁడు నందరాజుఅనియును, ఆ నందరాజుయొక్క 9 వ సంతతివాఁడు చాళుక్యుఁడనియును, ఈ చాళుక్యులతోఁజేరిన విజ్జలరాజు అనువాఁడు బొంబాయితోఁజేరిన కల్యాణనగరమునందు పాలించుచుండెననియును, వీని మనుమడు హెమ్మలరాయఁడనియును, వీనికొడుకు దబీనుఁడనియును, ఈ దబీనునిసంతతివాఁడే రామరాజనియును, ఈ రామరాజే ఆనెగొందిలో ఆంధ్రభోజుడని ప్రఖ్యాతిగాంచిన కృష్ణదేవరాయని అల్లుఁడనియును దెలియుచున్నది.



చంద్రవంశ క్షత్రియ ఆంధ్రరాజులలో నొకతెగవారైనచాళుక్యులు క్రీస్తుపుట్టిన 6 వ శతమానము మొదలు 12 వ శతాబ్దమువఱకు ప్రబలముగా రాజ్యము నేలుచుండిరి. వీరిలో 59గురురాజులు అయోధ్యానగరమును రాజధానిగాఁజేసికొని రాజ్యమేలుచుండిరి. వీరిలో దక్షిణదేశమును జయించుటకై వచ్చిన విజయాదిత్యుఁడు పరరాజులచే చంపబడినాఁడు. అప్పు డీతనిపత్ని పూర్ణగర్భిణిగానుండినందున యొకబ్రాహ్మణునిశరణుసొచ్చెను. ఆతఁడామెను సంరక్షించుచుండగా నామెకొక పుత్త్రు డుదయించెను. వానికా బ్రాహ్మణుఁడు విష్ణువర్ధనుఁడని నామకరణముచేసెను. ఈ విష్ణువర్ధనుఁడు క్రమముగా వృద్ధినొంది కాంచీపురి నేలుచుండిన పల్లవరాజునుజయించి వాని కుమార్తెను పరిణయ మయ్యెను. వీనికి విజయాదిత్యుఁడును, వీనికి పులికేశియును జన్మించిరి. ఈ పులికేశి యొక్క మనుమలు ప్రబలి కొందఱు పశ్చిమమున కేగిరి. వారిలోకుబ్జవిష్ణువర్ధనుఁడు తూర్పునకేగి పల్లవరాజులను జయించి వేఁగీదేశమునకు రాజాయెను. అప్పుడు వేఁగీదేశమును పాలించుచున్న ఆంధ్రభృత్యులందఱును బౌద్ధ మతస్థులై యుండిరి. చాళుక్యులందఱును విష్ణు మతస్థులై యుండిరి.

---

#### చాళుక్యవంశావళినిగూర్చి అనేక శాసనముల ఆధారముచేనీదిగువ వారి పరంపర వ్రాయఁబడుచున్నది.

| | శా - శ - సం. | | క్రీ - పు - సం. | |
|---|---|---|---|---|
| 1. జయసింహుఁడు | ,, | ,, | ,, | ,, |
| 2. బుద్ధవర్మ | ,, | ,, | ,, | ,, |
| 3. విజయవర్మ (విజయరాజు) | ,, | 394 | ,, | 472 |
| 4. ఇరాణరాజు | ,, | ,, | ,, | ,, |
| 5. పులికేశివల్లభుఁడు | ,, | ,, | ,, | ,, |
| 6. కీర్తివర్మ | ,, | ,, | ,, | ,, |

7. పృథ్వీవల్లభుఁడు ,, 489 ,, 567
8. మంగళేశరాజు ,, ,, ... 567 610
9. సత్యాశ్రయేంద్రవర్మ ,, 532 ... ,, 610
10. వల్లభేంద్రుఁడు (పులికేశవల్లభుఁడు) ,, ,, ... 610 634
11. కుబ్జవిష్ణువర్ధనుఁడు.తూర్పుదేశరాజు ,, ,, ... 610 634
12. జయసింహుఁడు 2. ,, ,, ... 633 663
13. నాగవర్ధనుఁడు (ఇంద్రభట్టారకుఁడు) ,, ,, 663
14. ఆదిత్యవర్మ ,, ,, ,, ,,
15. విజయభద్రుఁడు ,, ,, ,, ,,
16. విక్రమాదిత్యుఁడు. ఇతఁడు అంబీరమహభర్త ,, ,, ,,
ఇదే ఆదిశంకరులకాలము 592 603 ... 670 681
17. వినయాదిత్యుఁడు 603 618 ... 681 696
18. విజయాదిత్యుఁడు 618 655 ... 696 733
19. విక్రమాదిత్యుఁడు 2. లోకమాదేవిభర్త. 655 669 ... 733 747
20. కీర్తివర్మ 2. 669 679 ... 747 757
21. భీమరాజు 1. ,, ,, ,, ,,
22. కీర్తివర్మ 3. ,, ,, ,, ,,
23. విక్రమాదిత్యుఁడు 3. ,, ,, ,, ,,
24. భీమరాజు 2. ,, ,, ,, ,,
25. జయానుఁడు ,, ,, ,, ,,
26. విక్రమాదిత్యుఁడు 4. భూదేవిభర్త 895 919 ... 973 997
27. విక్రమార్కుఁడు 5. ,, ,, ,, ,,
28. తైలపుఁడు ,, ,, ,, ,,
29. సత్యాశ్రయుడు.అంబికాదేవిభర్త 919 930 ... 997 1008



30. దాసవర్మ. భాగ్యవతిభర్త ,, ,, ,, ,,
31. విభువిక్రముఁడు 930 940 ... 1008 1018
32. జయానుఁడు ,, ,, ,, ,,
33. అక్కదేవి ,, ,, ,, ,,
34. జయసింహుఁడు 3. 940 964 ... 1018 1042
35. సోమేశ్వరుఁడు 964 990 ... 1042 1068
36. సోమేశ్వరుఁడు 2. 990 997 ... 1068 1075
37. విక్రమాదిత్యుఁడు 6. 997 1048 ... 1075 1126
38. జయసింహుఁడు 4. బనవాసియందుండిన రాజు. 1001 1003 ... 1079 1081
39. జయకారణుఁడు ,, ,, ,, ,,
40. సోమేశ్వరుఁడు 3. 1048 1060 ... 1126 1138
41. మైలాలదేవి. కదంబవంశీయజయకేసరిభార్య ,, ,,
42. జగత్కామలుఁడు 1060 1072 ... 1138 1150
43. త్రిలోకమల్లు 1072 1084 ... 1150 1162
44. వీరసోమేశ్వరుఁడు 1104 1111 ... 1182 1189

వీరిలో పులికేశివల్లభుఁడు కదంబులయొక్క రాజధానియైన బనవాసిని స్వాధీనము చేసికొని బాదామికోటను పట్టుకొన్నాఁడు. మొదటి కీర్తివర్మ కదంబులను, కాలచూర్యులను జయించినాఁడు. సత్యాశ్రయుఁడు రాష్ట్రకూట రాజులను, మౌర్యులను, ఘూర్జరులను, కళింగులను, పల్లవులను జయించినాఁడు. ఈ సత్యాశ్రయునికాలములో చీనాదేశమునుండి వచ్చిన హేవిఁతసాంగ్ అను యాత్రికుఁడు వీని పరాక్రమవిషయమై మంచి యభిప్రాయములతో తన గ్రంథమునందు వ్రాసి యున్నాఁడు. సత్యాశ్రయునకు తర్వాత పట్టమునకు వచ్చిన వారలలో విక్రమాదిత్యుఁడే శూరుఁడై యుండి కాంచీపురమును స్వాధీనము

చేసికొన్నాఁడు. అపుడు చంద్రకాసములో రాజ్య మేలుచున్న దేవశక్తిరాజు ఈవిక్రమార్కునకు కప్ప మిచ్చుచుండినాఁడు. వీని కొడుకు వినయాదిత్యుఁడు కేరళ,మాళవ,హాొయిసాల, చోళ, పాండ్యరాజులను జయించినట్లు శిలాశాసనములవలనఁ దెలియు చున్నది. వీని కొడుకు విజయాదిత్యుఁడును క్రమముగా రాజ్య మేలినాఁడు. వీని కొడుకు రెండవ విక్రమాదిత్యుఁడు పల్లవులను పలుమాఱు జయించి కాంచీ నగరమును స్వాధీనము చేసికొన్నాఁడు. రెండవ కీర్తివర్మయు, రెండవ త్రిలోకవల్లభుడును క్రమముగారాజ్యమేలిరి. మూఁడవ జయసింహుఁడు చోళులను జయించినాఁడు. రెండవ సోమేశ్వరుఁడు కులోత్తుంగచోళుని జయించినాఁడు. ఈ కులోత్తుంగచోళునకు భక్తలాదేవి,చంద్రికాదేవి, మైలాదేవి అని ముగ్గురు భార్యలుండిరి. ఈ రెండవ సోమేశ్వరుఁడే కదంబులను జయించినాఁడు. కనుక కదంబ రాజ్యములో సగముభాగమును ఆఱవ విక్రమాదిత్యుఁ డేలినాఁడు.

ఈ ఆఱవ విక్రమాదిత్యుఁడు చోళరాజు కుమార్తెను వరించినాఁడు. తన కుమార్తెను కదంబరాజు కిచ్చినాఁడు. ఇట్లు మహా పరాక్రమముతో రాజ్య మేలుచున్న కాలమునందు 1189 సం॥ బిజ్జలులు, కాలచూర్యులు, గణపతి రాయలు, బల్లాళరాజులు దండెత్తినందుచేత పశ్చిమ దేశ చాళుక్యుల కీర్తి మాసిపోయెను.

ప్రాగ్దేశములో ప్రబలులై యున్న చాళుక్యులలోని కుబ్జవిష్ణువర్ధనుఁడు వేఁగీ దేశాధిపతియైన సాలంకాయనుని జయించి ఒరిస్సా (ఓఢ్ర) దేశమువఱకును రాజ్యమును వ్యాపింపఁజేసి రాజమహేంద్రపురమును రాజధానిగాఁ జేసికొని, వీఁడును వీని సంతతివారును 400సంవత్సరములు పాలించిరి.

మిస్టర్ బర్నెల్ దొరగారు సంపాదించిన శాసన ప్రకారముగా
కుబ్జవిష్ణువర్ధనుని వంశపరంపర వ్రాయంబడుచున్నయది.

1. కుబ్జవిష్ణువర్ధనుఁడు ... 18 సం॥ పాలించెను.
2. జయసింహవల్లభుఁడు ... 30 ,, ,,



3. ఇంద్రరాజు ...
4. రాజనందనవిష్ణువర్ధనుఁడు2. ... 9 ,, ,,
5. మంగియువరాజు ... 25 ,, ,,
6. జయసింహవల్లభుఁడు 2. ... 13 ,, ,,
7. కొక్కిలిరాజు ... ½ ,, ,,
8. విష్ణువర్ధనుఁడు 3. ... 37 ,, ,,
9. శక్తివర్మ (విజయాదిత్య) ... 18 ,, ,,
10. విష్ణువర్ధనుఁడు 4. ... 30 ,, ,,
11. విజయనరేంద్రమృగరాజు 2. ... 48 ,, ,,
12. కలివిష్ణువర్ధనుఁడు 5. ... 1½ ,, ,,
13. గుణభూషణవిజయాదిత్యుఁడు 48 ,, ,,
14. విక్రమాదిత్యయువరాజు ...
15. చాళుక్యభీముఁడు ... 30 ,, ,,
16. యుద్ధమల్లు,దారప,యుద్ధమల్లు 7 ,, ,,
17. కొల్లభివిజయాదిత్యుఁడు ... ½ ,, ,,
18. విక్రమాదిత్యుఁడు ... 11 ,, ,,
19. అమ్మరాజవిష్ణువర్ధనుఁడు6. ... 7 ,, ,,
20. విజయాదిత్యుఁడు ...
21. రాజభీముఁడు 12 ,, ,,
22. అమ్మరాజు 2. ... 25 ,, ,,
23. దానరాజు ... 3 ,, ,,
24. చంద్రవర్మ ... 12 ,, ,,
25. విమలాదిత్యుఁడు ... 7 ,, ,,

ఈ విమలాదిత్యుఁడు సూర్య వంశ క్షత్రియుఁడైన రాజరాజేంద్రచోళుని చెల్లెలైన కుంతిదేవిని వరించెను. వీని కుమారుఁడు చంద్రవంశ క్షత్రియుఁడైన రాజరాజుయొక్క కుమార్తెను 1022 సం॥మున

వరించెను. వీరికి పుట్టిన రాజరాజేంద్రచోళుఁడు 1034 లో వేఁగీదేశమును పాలించునట్టి మొదటిచోళుఁడైనాఁడు. మొదటిరాజేంద్రకులోత్తుంగుని కుమారుఁడు చాళుక్యదేశమున ఒక సంవత్సరము ప్రతినిధిత్వము వహించి, అమీఁద తన పినతండ్రియైన విజయాదిత్యునికి అప్పగించివేసి తాను దక్షిణమునకు వచ్చెను. ఈ విజయాదిత్యుఁడు కళింగదేశమును 15 సంవత్సరములేలి గతించినమీఁద, కులోత్తుంగుఁడు తన ద్వితీయ కుమారుఁడు వీరనాథుని ప్రతినిధిగాఁ జేసెను. వీఁడు 1102 వఱ కేలినాఁడు. బర్నెల్ దొరగారు చోళులు 1228 వఱకును వేఁగీదేశ మేలినట్లు చెప్పుచున్నారు.

మంగియువరాజు తన సోదరుఁడైన కొక్కిలిరాజుతో జగడము చేసి పట్టము కట్టుకొన్నాఁడు. తర్వాత దారపుఁడును, విక్రమార్కుని కొడుకు అమ్మరాజును రాజ్యవిషయమై పోరాడిరిగాని, రాజ్యము రాజభీమునకే యైనది. ఈరాజభీముఁడు 12 ఏండ్లేలినాఁడు. 2వ అమ్మరాజు క్రి-పు-945 సం॥ పట్టమునకు వచ్చినపుడు రాజ్యములో కలహములు జరిగినందున సుమారు 30 ఏండ్లు రాజ్యము అనాయకముగా నుండెను. చాళుక్య కులస్థుఁడైన విష్ణువర్ధనుఁడు రాజమహేంద్రము నేలుచున్న కాలమునందే ఆంధ్రభారతమును నన్నయభట్టారకుఁడు రచియింపఁ దొడంగెను. చాళుక్యులు 400 ఏండ్లు ప్రఖ్యాతిగా పాలించుకాలంబున అన్యరాష్ట్రరాజులు క్రి-పు. 1228లో వచ్చి రాజ్యమును పాడుచేసిరి.

ఈ చాళుక్యులలో నొకకొందఱు పశ్చిమమునందు కల్యాణనగరములో నేలుచుండిరి. ఆనెగొంది కృష్ణదేవరాయల వారి అల్లుఁడు రామరాజుకూడ ఆ పశ్చిమచాళుక్య వంశీయుఁడే యని స్పష్టమగుచున్నది.

## నాల్గవ అధ్యాయము.

### కాలచూర్య వంశము.

కల్యాణపురమునం దేలుచున్న విజ్జలరాజు మొదటకాలచూర్యవంశీయుఁడనియును, తర్వాత చాళుక్య వంశీయుఁడైనట్లును దెలియుచున్నది.



### కాలచూర్య వంశావళి.

| | | | క్రీ - పు - సం. | |
|---|---|---|---|---|
| 1. | బుద్ధమహారాజు | ... | ... | ... |
| 2. | శంకరుఁడు | ... | ... | ... |
| 3. | కానుఁడు | ... | ... | ... |
| 4. | జ్యోతిస్సింహుఁడు | ... | ... | ... |
| 5. | ప్రమాది | ... | 1128 | ... |
| 6. | విజ్జలుఁడు | ... | 1161 | 1162 |
| 7. | వసుదేవి | ... | 1164 | ... |
| 8. | గోమేశ్వరుఁడు | ... | 1167 | 1175 |
| 9. | సంగమదేవి | ... | 1175 | 1180 |
| 10. | ఆహవమల్లుఁడు | ... | 1186 | 1188 |
| 11. | సింగణుఁడు | ... | 1189 | ... |

ఆంధ్రవంశీయులైన కాలచూర్యులు క్రీ - పు - 567 మొదలు 660 వఱకు పాలించిన పరాక్రమవంతులని, మిస్టర్-ఫ్లీటర్ దొరచెప్పుచున్నారు. ఈ వంశమున కాదిపురుషుఁడు బుద్ధమహారాజు, వానికి శంకరుఁడు, కానుఁడు, అని యిర్వురు కుమారు లుదయించిరి. వీరిలో నొకఁడు ఉత్తరమును, మరొకఁడు దక్షిణమును పాలించిరి. శంకరునకు జ్యోతిస్సింహుఁడు, వానికి ప్రమాదియుపుట్టి 1128వ సం॥ పశ్చిమ చాళుక్యులకు లోఁబడి రాజ్యపాలనము చేయుచుండిరి. వీని కొడుకు విజ్జలుఁడు 1161 మొదలు 1162 వఱకును, తర్వాత వసుదేవియును, ఆవల గోమేశ్వరుఁడు 1167 మొదలు 1175 వఱకును, ఆమీఁద సంగమదేవి 1175 మొదలు 1180 వఱకును, ఆతర్వాత ఆహవమల్లు 1186 మొదలు 1188 వఱకును, అనంతరము సింగణుఁడు 1189 వఱకును పాలించిరి. ఈ వంశీయుఁడైన విజ్జలుని మంత్రియైన బసవయ్యయే లింగాయతమతమును స్థాపించినాఁడు. ఈ బసవయ్య తన తోఁబుట్టువైన

పద్మావతిని విజ్జలుని కిచ్చినాఁడు. బసవయ్య బ్రాహ్మణుఁడేయైనను కుల పద్ధతి నతిక్రమించినవాఁడు. ఈ బసవయ్యయే విజ్జలుని చంపించినాఁడు. తుద కీబసవయ్యయు విజ్జలుని వంశీయులచే హింసింపఁబడినాఁడు. పైన చెప్పిన విజ్జలుని వంశీయుఁడే కృష్ణదేవరాయని అల్లుఁడైన రామరాజు అని యెఱుంగఁదగినది.

మరొక శాసనమునలనఁ దెలియవచ్చున దేమనఁగా:— తెలింగనా ప్రధానపట్టణమైన ఓరంగల్లులో రాజ్యముచేసిన ఆంధ్ర (తుళువ) ఆ దేవరాజులు ప్రతాపరుద్రునకుమున్ను 370 సం॥ ములు 18 గురురాజు లేలిరి. ఈ ఆ దేవరాజ వంశీయులలో నొకఁడైన త్రిభువనమల్లరాజే ఓరంగల్లును స్థాపించినాఁడు. క్రీస్తు - 1162 సం॥ ప్రతాపరుద్రుఁ డొక దేవాలయమును కట్టించెను. వీఁడు చాలా ప్రఖ్యాతికలవాఁడై యుండెను. అప్పుడు వీని రాజ్యము ఉత్తరము గోదావరి, దక్షిణము శ్రీశైలము, తూర్పు సముద్రతీరము, పశ్చిమము తిరుపతి (వేంకటాద్రి) వఱకునుండెను.

---

ఓరంగల్లు నేలిన ఆంధ్రరాజుల పరంపర.

| | | | |
|---|---|---|---|
| 1. | క్రీ-పు 800 సం॥ శ్రీరంగరాయఁడు పాలించిన సంవత్సరములు. | | 25 |
| 2. | వీరనారాయణుఁడు ... | ,, ... | 23 |
| 3. | ఓబళరాజు ... | ,, ... | 21 |
| 4. | శ్రీరంగనాయకుఁడు ... | ,, ... | 22 |
| 5. | ఫిరంగి యండయ్య ... | ,, ... | 15 |
| 6. | చంద్రగోపాలుఁడు ... | ,, ... | 32 |
| 7. | నరసింహుఁడు ... | ,, ... | 13 |
| 8. | గంభీరుఁడు ... | ,, ... | 15 |
| 9. | బుక్కన్న ... | ,, ... | 22 |
| 10. | వీరనరసింహుఁడు ... | ,, ... | 12 |



| | | | |
|---|---|---|---|
| 11. | నృసింహుఁడు ... | ,, ... | 8 |
| 12. | దేవుఁడు ... | ,, ... | 12 |
| 13. | శ్రీపాండ్యుడు ... | ,, ... | 2 |
| 14. | వాసుదేవుఁడు ... | ,, ... | 12 |
| 15. | శ్రీవీరనిధి ... | ,, ... | 15 |
| 16. | కాటయదేవుఁడు ... | ,, ... | 14 |
| 17. | రాయవేశ్యాభుజంగుఁడు | ,, ... | 12 |
| 18. | నారాయణుఁడు ... | ,, ... | 10 |
| 19. | ప్రతివాదిభయంకరుఁడు | ,, ... | 87 |

ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు 58 - లేక 54 ఏండ్లు రాజ్యము చేసినపుడు క్రీ 1221 సంవత్సరములు పూర్తికాఁగా, మ్లేచ్ఛులు దండెత్తివచ్చిరి. ఆకాలములోనే ప్రతాపరుద్రుని సేనాధిపతులైన హక్క, బుక్క అనువారు ఆనెగొందికి పోయి సంస్థానమును స్థాపించిరి.

మిస్టర్, జే, యల్ మార్స్మ దొరగారు వ్రాసిన హిందూదేశచరిత్రయం దెట్లున్న దనఁగా,— సుమారు క్రీ-ము, 56 సంవత్సరమున ఆంధ్రవంశీయులు మగధరాజ్యమును స్వాధీనము చేసికొని 436 ఏండ్లు పాలించిరనియును, వారి ప్రధానపట్టణము ఓరంగల్లనియును, వీరిరాజ్యము ఉజ్జయినివఱకు వ్యాపించియుండినదనియును వ్రాసియున్నారు.

---

## అయిదవ అధ్యాయము.

### మరొక తెగవారైన చంద్రవంశ ఆంధ్రరాజ పరంపర.

---

### ఓరుగల్లు గణపతిరాజులు.

ఓరుగల్లు (ఓరంగల్) ఆంధ్రరాజులకు కాకతీయ గణపతిరాజులని పేరుకలదు. ఆంగ్లేయు లనేకులు కాకతీయగణపతిరాజులచరిత్రములను అనేక శాసనాధారములచేత వ్రాసియున్నారు గాని, అవి యొకటి కొకటి భేదపడియున్నవి. అయినను ఈసంస్థానమును స్థాపించిన యతఁ

డు గోదావరీతీరములోని నందావనము అను రాజధానియందు వసించి చోళులను జయించి సింహళ దేశాధిపతికుమార్తెను వరించినాఁడు. ఈతనిపుత్త్రుఁడు చిత్తభ్రమకలవాఁడై యున్నందున ఈతని ఇద్దరుమనుమలు రాజ్యమునేలిరి. వీరికి తర్వాతి పదితరములవారి పేరులు సరిగా తెలియలేదుగాని, వీరివంశీయుఁడైన పురోళరాజే ఈపట్టమునకువచ్చినాఁడు అని డాక్టర్ వాకర్ చెప్పుచున్నారు.

పురోళరాజ వంశావళి.

1. త్రిభువనమల్లు.
2. పురోళరాజు (ఈతనిపత్ని ముమ్మడమ్మ).
3. ప్రతాపరుద్రుఁడు.
4. గణపతిదేవరాజు. (రుద్రమదేవిభర్త).
5. రుద్రమదేవి. గుణపతిదేవరాజు గతించినమీఁద ఈమె పట్టమునకు వచ్చినది క్రీ - పు. 1257 - 1295.
6. ప్రతాపరుద్రుఁడు 2. క్రీ - పు. 1295 - 1323.
7. కృష్ణుఁడు (లేక వీరభద్రుఁడు).
8. వినాయకుఁడు (లేక నాగదేవుఁడు).

అనుమకొండలో దొరకిన శాసనముచేత త్రిభువనమల్లు కుమారుఁడు పురోళరాజని తెలియుచున్నది. తక్కిన కాలనిర్దేశము మొదలగువిషయములేదియు తెలియలేదు. ఇందుచే వీరి పూర్వులు అనుమకొండయందుండి రాజ్యమేలిరని తోఁచుచున్నది. పురోళరాజు ఓరుగల్లులో నుండి రాజ్యముచేయునపుడు ఓఢ్రదేశ గజపతిరాజును, చాళుక్యతైలపునిని, మైసూరు ప్రాంత్యములలోని రాజులను జయించినాఁడు. తుదకు వీఁడు తన కుమారునిచే చంపఁబడినాఁడని తెలియుచున్నది. మొదటి ప్రతాపరుద్రుఁడు 1162 లో పట్టమునకువచ్చి భీమరాజును చోళరాజును జయించినాఁడు. గణపతిదేవుఁడు 1190-1258 వఱకు నేలినాఁడు. వీనిభార్య రుద్రమదేవి. కుమార్తెపేరు జ్ఞానాంబ. ఈజ్ఞానాంబను ధరణి



కోటరాజైన కోటపెద్దిరాజునకిచ్చి పెండ్లిచేసిరి. ఈకోటపెద్దిరాజు జైనమతస్థుఁడు. రాజకీయవ్యవహారమునుపట్టి జైనమతస్థునకు కన్యనిచ్చిరని తోఁచెడిని. జ్ఞానాంబకును కోటపెద్దిరాజునకును రెండవప్రతాపరుద్రుఁడుపుట్టెను. గణపతిదేవరాజునకు మగబిడ్డలేనందున భర్తకనంతరము రుద్రమదేవి 1290 మొదలు 1323 వఱకు రాజ్యమేలినదని ప్రత్యక్షముగా చూచినట్టి "మార్కుపోలో" అను యాత్రికుఁడు చెప్పుచున్నాఁడు. అపుడు ఆరుద్రమదేవికి మహావీరధీరుఁడైన గంగయరెడ్డియను దళకర్తయుండినాఁడు. రెండవ ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవికి మనమఁడుకావున ఈతఁడు ఈపట్టమునకువచ్చినాఁడు. తండ్రి జైనమతస్థుఁడేయైనను ప్రతాపరుద్రుఁడు హిందూమతము నవలంబించి తనరాజ్యమును కన్యాకుమారివఱకును వ్యాపింపఁజేసి మహాపరాక్రమవంతుఁడై రాజ్యమేలినాఁడు. అపుడు అయోధ్యలోనుండు నబాబు పంపించినసైన్యము వారు ఓరంగల్లుతోఁ జేరిన దేవగిరికోటను ముట్టడించి అనేకద్రవ్యములను గైకొనిపోయిరి. క్రీ - పు. 1306లో అల్లాఉద్దీన్ అనువాఁడు మల్లిక్ ఖఫూర్ అను సేనానాయకుని ముట్టడింపఁజేసి, కప్పముకట్టకయున్న ఈ రెండవప్రతాప రుద్రునిచెఱపట్టి ఢిల్లికికొనిపోయిసమాధానముచేసికొని పంపివేసిరి. మరల 1309 లో నొక సైన్యమునుబంపి కప్పమడిగిరి. ఇయ్యనందున 1310 లో మల్లిక్ ఖఫూర్ ను మరల ఓరంగల్లుకు బంపి కొల్లగొట్టించిరి. 1316లో ప్రతాపరుద్రుఁడు దేవగిరిరాజుతో స్నేహముచేసికొని కప్పము కట్టుటను మానినందున 1321 లో ఢిల్లినబాబు కోపముతో నొక సైన్యమునుబంపెను. ఆ సైన్యముచేతగాక తిరిగిపోయినందున మరల 1323 లో విశేషసైన్యమును బంపి ప్రతాపరుద్రుని ఢిల్లికి పట్టుకొనిపోయిరి. ఈ ప్రతాపరుద్రదేవునికొడుకు కృష్ణుఁడనెడి వీరభద్రదేవుఁడు 1325 లో పట్టమునకువచ్చి 1344 లో హిందూరాజులను స్నేహించుకొని గొప్పదండుచేర్చుకొని తురకలనుజయించినాఁడుగాని, 1358 లో మహమ్మదుషా యుద్ధపుఖర్చును కృష్ణునివలన రాబ

ట్టుకొన్నాఁడు. కృష్ణునికి తర్వాత వీనికొడుకు వినాయక దేవుఁడు అను నాగ దేవుఁడు రాజై కొంచెముకాలమే పాలించినాఁడు. కొన్ని శాసనములయం దు కృష్ణునికొడుకు కృష్ణనాయఁడు రాజ్యమేలినట్లు తెలిసెడిని. 1371 లో మహమ్మదుభామినీ సైన్యమువచ్చి ఓరుగల్లును పాడుచేసి నాగదేవునిని చంపిరి. తర్వాతివారిచరిత్ర తెలియలేదు.

---

## ఆఱవ అధ్యాయము.

---

### ఓఢ్రదేశ ( ఒరిస్సా ) గజపతిరాజులు.

చంద్రవంశ ఆంధ్రులలో నొక తెగవారైన గజపతిరాజులు కొండవీటియందుండి రాజ్యమేలిరి. క్రీ - పు - 1320 లో కొందఱు రెడ్లు ప్రబలి కొండవీటిని తమవశముచేసికొని 1427 వఱకు రెడ్లేపాలించుచుం డిరి. ఆమీఁద మహమ్మదీయలు రెడ్లనుండి ఆక్రమించికొనిరి. తుదకు గజపతివంశ్యుఁడైన విశ్వంభర దేవుఁడు కొండవీటిని స్వాధీనముచేసికొ నెను. వీనికి గణపతి దేవుఁడు, బాలభాస్కర దేవుఁడు, హరిహర దేవుఁడు, విశ్వంభర దేవుఁడు అను నల్వురుపుట్టిరి. వీరిచరిత్ర సరిగా తెలియలేదు.

ఒరిస్సా గజపతివంశీయులలోనొకఁడైన అనంగభీమ దేవుఁడు తన విజయసూచకార్థమై క్రీ - పు - 1174 లో జగన్నాథములోని దేవాలయ మునిర్మించినాఁడు.

కొండవీటిరాజైన వెంకటరెడ్డిని క్రీ - పు - 1420 లో అలంకారగ జపతిరాజు జయించినాఁడు. అదిమొదలు గజపతిరాజవంశస్థులు 1454 వఱ కుపాలించిరి.

### కపిలేశ్వరగజపతివంశావళి.

ఆమీఁద 1454 మొదలు పూర్వపు గజపతిరాజసంతతిలోఁ జేరిన కపిలేశ్వరగజపతిరాజు 1461 వఱకు నేలినాఁడు.

శ్రీవీరప్రతాప పురుషోత్తమగజపతి 1461 - 1496 వఱకు పాలిం చినాఁడు. వీఁడు ధర్మగుణముకలవాఁడు.



| | | | | |
|---|---|---|---|---|
| ప్రతాపరుద్రగజపతి | ... | ... | 1496 | 1497 |
| వీరభద్రగజపతి | ... | ... | 1497 | 1515 |

వీరభద్ర గజపతిని విజయనగరపు కృష్ణదేవరాయఁడు 1515 లో జయించి, వానికుమార్తెను వరించినాఁడు. అదిమొదలు 1574 - వఱకు విజయనగర వంశీయులకు కొండవీడు స్వాధీనమైయుండెను. ఆ మీఁద తురకలకు లోబడినది.

---

## ఏడవ అధ్యాయము.

---

### విజయనగర నరపతిరాజులు.

చంద్రవంశ ఆంధ్రులలోఁ జేరిన విజయనగర (ఆనెగొంది) నర పతిరాజులు పాండవవంశీయులని తెలియుచున్నది. ఇట్లే అనేక శాసన ములును గలవు. పాండవ వంశీయుఁడైన చంద్రబీజరాజునకు తర్వాత రాజ్యమేలినవారు.

మారుతిరాజు. (మగధదేశమున కధిపతి.)

నందమహారాజు. (అర్జునునకు 83 వ సంతతి.)

భూతనంది.

నందిరాజు. (మగధదేశాధిపతి.)

ఈ నందిరాజునకు శేషనంది, యశోనంది అను నిర్వురు కొడుకులు. వీరికాలమున అమిత్ర, దుర్మిత్ర అనువారు దండెత్తిరాఁగా ఈ శేష నంది యశోనంది అనువారి 14 గురు కొడుకులలో ఏడ్గురు ఆంధ్రులు ఆంధ్రదేశమునకువచ్చి రాజులైరి.

వీరిలో నందమహారాజు క్రీ - పు 1034 లో నందపురమును, ఓరంగల్లు సంస్థానమును స్థాపించినాఁడు. ఈ నందమహారాజు సంతతి లోఁజేరిన చాళుక్యుఁడు ప్రబలుడై 1076 లో ప్రబలుడైయుండెను. 1118 లో విజయరాజు విజయనగరమును నిర్మించి సంస్థానమును స్థాపిం చెను. విజయరాజు కొడుకు 1158 వఱకు నేలినాఁడు. ఆ మీఁద వీని

కొడుకు నరసింహదేవరాయలు 1182 వఱకును, ఆమీఁద రామదేవరాయలు 1249 వఱకును, ఆవల భూపరాయలు 1274 వఱకును నేలిరి.

ఈ భూపరాయలకు బుక్కఁడును, హరిహరుఁడును మంత్రులుగా నుండిరి. ఈ బుక్కఁడును హరిహరుఁడును చంద్రవంశ్య యాదవక్షత్రియులైన సంగమహారాజు కొడుకులు. ఈ యిర్వురును మొదట ఓరంగల్లులో ప్రతాపరుద్రునికి మంత్రులై యుండిరి. ఆరాజ్యము మహమ్మదీయులకు చేరినమీఁద వీరిచ్చటికివచ్చిరి. ఆకాలమున 1325 లో డిల్లిలోనుండి మహమ్మదు తుఘ్లాకు పంపిన సైన్యము విజయనగరమునకు వచ్చినపుడు ఇరుతెగలవారికిని జగడమైనది. హరిహరుఁడును బుక్కఁడును తురకలతో జగడముచేయుచుండిరి. తురకలు వీరిద్దరును చచ్చిరని అబద్ధవార్త పుట్టించినమీఁద, భూపరాజునకు ధైర్యముతగ్గిన సమయము నెఱింగి తురకలు రాజును బలాత్కరించి తమకు లోఁబడియుండవలసినదేగాక మహమ్మదీయులగుడని చెప్పగా మతవైరాగ్యశీలుఁడైన భూపరాజును ఆతని పదునొకండు బిడ్డలును అగ్నిప్రవేశమై పోయిరి.

అపుడొక దాది భూపరాయలుయొక్క మూఁడేండ్ల చిన్నవానిని అతి జాగ్రత్తగా కాపాడియుంచి వానిని తుళువదేశమునకు గొనిపోయి పెంచుచుండెను. మహమ్మదీయులు విజయనగరము కోటకొత్తళములను 1334 లో పడగొట్టివేసినదేగాక దేశమంతయు కొల్లగొట్టి పాడుచేసిరి.

ఆమీఁద హరిహరుఁడు బుక్కఁడు అను సేనాధిపతు లిద్దరును గొల్లవాండ్రవలె వేషముదాల్చి అడవులలో సంచరింపఁ దొడంగిరి. అక్కడ తపస్సుచేయుచున్న విద్యారణ్యులనెడి మాధవాచార్యులను శరణుచొచ్చి తమ సంగతులనంతయు చెప్పిరి. ఆమీఁద మాధవాచార్యులవారు హక్క బుక్కలకు అభయమిచ్చి, వెంటబెట్టుకొని వచ్చుచు, దారిలో నొకగుహను గనబఱిచి, యచ్చోటనుండు ద్రవ్యముతో నగరము నిర్మింపుఁడని సెలవిచ్చిరి. అట్లే క్రీ-పు 1336 లో విద్యానగరము నిర్మింపఁబడెను. అయినను రాజులేడు కావున తామే రాజ్యమును పాలింప



వలసినదని హరిహరుఁడును బుక్కఁడును గోరిరి. విద్యారణ్యులు సమ్మతింపక, రాజుగా హరిహరునిని, సేనాధిపతిగా బుక్కనిని యుండునట్లు నియమించిరి. మంత్రిగా మాధవాచార్యులుండిరి. ప్రజలందఱును సమ్మతించిరి.

అది మొదలు హరిహరరాయఁడు రాజై తురకలను కొందఱిని జయించి, బాదామిలో నొకకోటను నిర్మించి మహాశూరుఁడై 1343 వఱకు పాలించి పరలోకమొందినాఁడు.

ఆమీఁద సేనాధిపతిగానున్న బుక్కఁడు రాజై తురకలనుజయించి, ఓరంగల్లు ప్రతాపరుద్రునకు సహాయముచేయుచుండినాడు. ఇందుచే తురకలకును బుక్కదేవరాయలకును యుద్ధములు జరుగనారంభించినవి గాని బుక్కదేవరాయలు జయశీలుఁడుగానే రాజ్యమును పాలించుచుండి 1379లో మృతినొందెను. ఇతనికిని మాధవాచార్యులే మంత్రిగానుండిరి.

ఆ తర్వాత బుక్కదేవరాయల కొడుకు హరిహరరాయడు పట్టమునకువచ్చెను. వీడును పరాక్రమవంతుఁడై మహారాజాధిరాజ బిరుదును పొంది, అనేక ధర్మకార్యములుచేసి 1406 లో గతించినాఁడు. ఇతనికిని మాధవాచార్యులే మంత్రిగానుండిరి.

ఆమీఁద ఈ రెండవహరిహరరాయలకొడుకు దేవరాయలు 1406- నవంబరునెలలో సింహాసనమెక్కినాఁడు. వీనికాలములోదేశము క్షేమముగానుండలేదు. వీఁడు దుర్మార్గుఁడై యుండినాఁడు. వీఁడు 1461 లో మృతినొందెను.

ఆవల దేవరాయలకొడుకు విజయభూపతిరాయలు 1461 మొదలు రాజ్యమును సుఖముగా పాలించి 1418 లో గతించినాఁడు.

ఆ తర్వాత విజయభూపతిరాయల కొడుకు ప్రౌఢదేవరాయలు 1419 లో పట్టమునకువచ్చి శూరుఁడై తురకలకు స్వాధీనమైనదేశమునంతయు ఆక్రమించికొన్నాఁడు. అందుచే తురకలకును వీనికిని గొప్ప జగడముకల్గినది. వీఁడు అల్లాఉద్దీనుకు సహాయకుడై యుండెను. ఈ మహాపరాక్రమవంతుఁడైన ప్రౌఢదేవరాయలు 1443 లో గతించెను.

అనంతరము ప్రౌఢ దేవరాయనికొడుకు మల్లికార్జునుఁడు 1445-మొదలు 1449 వఱకు రాజ్యముచేసి గతించినాఁడు.

ఆపిదప మల్లికార్జునుని తమ్ముడు విరూపాక్షరాయలు పట్టమునకువచ్చినాఁడు. వీఁడుభయశాలి గనుక తురకలు చాలా దేశమును ఆక్రమించుకొనిరి. మరియు విరూపాక్షరాయలకు సంతతిలేనందున ప్రౌఢ దేవరాయలు అను నొకనిని (వీడు మూడవ ప్రౌఢ దేవుఁడు) స్వీకారముచేసికొని వానికి పట్టముకట్టినాడు. ఈ మూఁడవ ప్రౌఢ దేవుఁడు 12 ఏండ్లు రాజ్యమేలి మహమ్మదీయులతో జగడముచేసినపుడు తగిలిన కత్తిగాయముచేత 1483 లో గతించినాడు.

ఈ మూఁడవ ప్రౌఢ దేవరాయనియొద్ద దళకర్తగను మంత్రిగను నరసింహరాయలుండెను. ఈ నరసింహరాయలును, పైనచెప్పిన 3 వ ప్రౌఢ దేవరాయడును ఎవరనఁగా, మున్ను అగ్నిప్రవేశమైన భూపరాయలకొడుకులలో నొకఁడైన 3 సం॥ వయస్సుగల బుక్కడు అనువానిని యొకదాది తుళువ దేశమునకుం గొనిపోయినదని చెప్పియున్నాముకదా? ఆ బుక్కని సంతతివారే వీరిర్వురు నని తెలియఁదగినది.

ఈ భూపరాయల కొడుకు బుక్కనిని దాది గారాబముతో బెంచి పెద్దవానిచేసి చదువుచెప్పించి ఆనెగొందికి తాను రహస్యముగాఁబోయి నరపతివంశముతోఁజేరిన యొక కన్యకను రహస్యముగాదెచ్చి పరిణయముచేసెను. ఆమీాద తుళువ దేశస్థులు ఈ బుక్కనిని తమ దేశమునకు రాజుగాజేసికొనిరి. ఈ బుక్కనియొక్క యింటిపేరు ఆదిలో సమ్మెటవారు, సాళ్వవారు, కోలవారు, కోటవారు, దేశవారు, అనియుండినను తుళువ దేశమునందున్న కారణముచే తుళువవారు అనే పేరు వాడుకకు వచ్చినది.

ఈ తుళువ బుక్కరాయల కొడుకు తిమ్మరాయలు ఆనెగొందిని స్వాధీనముచేసికొన ప్రయత్నించియు సాగకపోయినందున తుళువ దేశమునే యేలినాఁడు. ఈ తిమ్మరాయల కొడుకు ఈశ్వరరాయలును తుళువ



దేశమునే యేలుచుండినాఁడు. ఈ యీశ్వరరాయల కొడుకు నరసరాయలు మహా ధీరుఁడును శూరుఁడునై యుండెను. ఇట్లుండఁగా తన సొంత పినతండ్రి కుమారుఁడైన 3 వ ప్రౌఢ దేవరాయలు విజయనగరములో రాజుగానున్న సంగతి తెలిసి ఆతనియొద్దికివచ్చి చేరెను.

ఇట్లుండగా 3 వ ప్రౌఢ దేవరాయఁడు గతించినమీాద ఆ రాజ్యమునకు క్రమమైన బాధ్యతగల ఈ నరసరాయలే 1484 లో పట్టమునకు వచ్చినాఁడు. ఇతఁడు తనరాజ్యమును బహుదూరము వ్యాపింపఁజేసి, అనేక ధర్మకార్యములుచేసి కీర్తిగాంచినాఁడు. చంద్రగిరిలో కోటగట్టించినాడు. ఇతనియొద్ద సాళ్వతిమ్మరసు అను నతఁడు మంత్రిగానుండెను. ఇట్లు మహాపరాక్రమవంతుడై రాజ్యమునేలిన నరసరాజు 13 ఏండ్లు రాజ్యమేలి, తన పెద్దకొడుకైన వీరనరసింహరాయలకు పట్టముకట్టి, తక్కిన ముప్వురిని సహాయులుగానుండ నియమించి సాళ్వ తిమ్మరసు అను అప్పాజిని మంత్రిగా నియమించి 1498 లో పరలోకమొందెను.

ఈ నరసరాయలకు తిమ్మాంబ, నాగమాంబ, ఉమాంబ అని ముగ్గురు భార్యలుండిరి. తిమ్మాంబికకు వీరనరసింహరాయలును, నాగాంబికకు కృష్ణ దేవరాయలును, ఉమాంబికకు అచ్యుత దేవరాయలు, రంగ దేవరాయలు అను నిర్వురు కొడుకులును గల్గిరి.

వీరనరసింహరాయలు మహాపరాక్రమవంతుఁడై తనకుకప్పముగట్టకున్న మైసూరు మొదలగు రాజులతో యుద్ధముచేయుటకై కృష్ణ దేవరాయలను అచ్యుత దేవరాయలను బంపించి, వారివలన కప్పముల గొనుచునుండెను. ఆకాలమునందే ‘‘వాస్కోడిగామా’’ అనువాఁడు ఈ దేశమునకువచ్చినాఁడు. ఈ నరసింహరాయలయొక్క సంస్థానమును ఆకాలమునచూచినఇటాలి దేశీయుఁడైన‘‘వర్తెమా’’అనునతఁడు చాలా ప్రశంసించియున్నాఁడు. మరియు పారిజాతాపహరణమునందు, ‘‘ కుంత లేశ్వరుఁడు ’’ అను సీసపద్యమునుఝూచినను బోధమగును. ఇట్టి శూరుఁడు

1509 లో విష్ణుసాయుజ్యమొందెను. ఆ మీఁద కృష్ణదేవరాయడు 1509 ఫిబ్రవరిలో పట్టమునకువచ్చెను.

కృష్ణదేవరాయలు.

తుళువంశీయ చంద్రవంశ ఆంధ్ర క్షత్త్రియుఁడును, వైష్ణవమతస్థుఁడునైన శ్రీ కృష్ణదేవరాయలు 1465 లో జన్మించినట్లుగా "అందలి శాలివాహన" అను పద్యమువలనఁ దెలియుచున్నది. కృష్ణదేవరాయని పూర్వీకులకు సాళ్వవారు, సమ్మెటవారు, సెలగోలవారు అను నిత్యాది పేరులున్నట్లు కొండవీటి చరిత్రవలనఁ దెలియుచున్నది. మనుచరిత్రమునందు తుళువవంశమనియే చెప్పఁబడియున్నది.

కృష్ణదేవరాయలు తిమ్మరుసును తండ్రివలె భావించి అప్పాజీ అని గౌరవముగా నేపిలుచుచునుండెను. కృష్ణదేవరాయడు ప్రతాపరుద్ర గజపతి కుమార్తెయైన వరదాంబ, లేక దుర్గాంబను మొదట వరించెను. ఆ తర్వాత ఉత్కళదేశపు (ఒరిస్సా) రాజకుమారిని వరించెను. వీరిర్వురుగాక మరికొందఱు పత్నులునుండిరి.

కృష్ణదేవరాయలు విజయనగరమునేలిన రాజులందఱికంటెను విద్యావితరణాది గుణములయందును, శౌర్య ధైర్య సాహసాదులయందును అసమానుఁడై అపజయమెఱుంగక, అనేక రాజులనుజయించి రాజ్యమునేలుచుండెను. ఈతనిసంస్థానమునందు అలసాని పెద్దనమొదలగు కవీశ్వరులుండిరి. అనేక కవులను పోషించుటయేగాక తానును కవియై ఆముక్తమాల్యదయనెడి మహాకావ్యమును రచియించెను.

కృష్ణదేవరాయని సంస్థానమునందు ఆర్వీటివారు, 2 నాకవారు, 3 నంద్యాలవారు, 4 పెమ్మసానివారు, 5 వెలమ, లేక వెలుగోటివారు, 6 భూతహరివారు, 7 తురగంటివారు, 8 తుళువదొరలు, 9 రావులవారు అను మహాజనులుండిరి.

కృష్ణదేవరాయల సంస్థానమును ప్రత్యక్షముగాఁజూచినట్టి పోర్తుగల్ దేశపు యాత్రికుఁడైన "బార్బోసా" అనునతఁడును; పోర్తుగల్



దేశవర్తకుఁడైన "డామింగోస్ పేస్" అనునతఁడును; విజయనగరమువంటి సంస్థానమును, విజయనగరమునంగల సైన్యమును, సంపదయును ఎచ్చటనులేదని విశేషముగా వర్ణించి వ్రాసియున్నారు. పారిజాతాపహరణము, మనుచరిత్రము, విష్ణుచిత్తీయము, కృష్ణదేవరాయవిజయము మొదలగు గ్రంథములవలనను ఈతని పరాక్రమాదివిషయము లెఱుంగఁదగును. ఇట్టి మహాభాగుడు 1581 నవంబరు 19 తేది విష్ణులోకముచేరెను.

ఆమీఁద అచ్యుతదేవరాయలు పట్టమునకువచ్చినాఁడు. ఇతఁడును మహాధార్మికుఁడును శూరుఁడునుగానుండి 1541 లో పరమపదమొందెను.

ఈ అచ్యుతదేవరాయలు తనభార్యయైన తిరుమలదేవి చెల్లెలైన మూర్తిఅమ్మను వరించిన చెవప్పనాయనికి తంజావూరు, త్రిశిరపురము, నాగపట్టణము, దేవీపట్ణము, తిరుకోవెలూరు, మొదలైన నగరములను అరణముగానిచ్చి అతనినే రాజుగా నుండ నియమించెను. తిరునెల్వేలి, మధుర మొదలగు స్థలములకు బయ్యమనాయనిని,విశ్వనాథనాయనిని రాజులనుగా నియమించెను. గోపన్ననాయనిని రాయచూరు మొదలగుస్థలములకును, లక్ష్మయ్యనాయనిని ధార్వాడ మొదలగు స్థలములకును, ఇక్లే వరదప్పనాయడు, మల్లపనాయడు, ఆదియప్పనాయడు, కృష్ణపనాయడు, రాజప్పనాయడు మొదలగువారిని వేలూరు, చెంజి, చంద్రగిరి, ఉమ్మత్తూరు, కొండవీడు మొదలగు స్థలములకును పాలకులుగనుండునట్లు నియమించెను.

ఆతర్వాత అచ్యుతదేవరాయనికొడుకు వేంకటాద్రిరాయఁడు సింహాసనమెక్కెను. ఈతఁడు బాలుఁడుగా నున్నందున మంత్రియైన సాళ్వతిమ్మరాయడే సకలకార్యములును జూచుకొనుచునుండినదేగాక, పూర్వమందున్న ఉద్యోగస్థులనందఱిని తొలగించి తనకుబంధువులును మిత్రులును అగువారికే ఆ ఉద్యోగములనిప్పించెను. ఈ తిమ్మరాయని కాల

మున "ఇబ్రాహిం అదిల్షా" దండెత్తివచ్చి చాలాధనమును గైకొనిపోయి నాఁడు. మరియు దేశమును నెమ్మదిలేకుండెను. ఇట్లురాజద్రోహమును ప్రజాద్రోహమునుచేయుచున్న తిమ్మరాయనిపై కృష్ణదేవరాయని అల్లుడు రామరాజు మొదలగువారు ద్వేషించియుండుటను తెలిసికొని, ఈ దుష్టుఁడు సంస్థానములోనున్న వస్త్రాభరణాదులనంతయు పాడుచేసివేసి 1541 కడపట ఆత్మహత్యచేసికొన్నాడు.

ఆమీఁద కృష్ణదేవరాయలసోదరుడైన రంగదేవరాయనికొడుకు సదాశివరాయలు 1541 కడపట పట్టమునకువచ్చినాఁడు. వీడు పిన్నవాఁడుగానున్నందున, కృష్ణదేవరాయనిఅల్లుఁడు రామరాజు 1565 వఱకును తానేసర్వాధికారమువహించి రాజ్యపాలనముచేసినాఁడు. ఈ రామరాజుయొక్క వంశమునుగూర్చి ముందేచెప్పఁబడియున్నది. ఇతనికీర్తిప్రతాపములు వసుచరిత్రము, బాలభాగవతము, నరపతివిజయము మొదలగు గ్రంథములవలనఁ దెలియును. ఈ రామరాయలకు కృష్ణదేవరాయలు తనకుమార్తెను కన్యాదానముచేయించినప్పుడు "ఆదోని" పరగణాను అరణముగానిచ్చినాఁడు. రామరాజుకాలములో పలుమాఱు తురకలు జగడమునకువచ్చుచుండిరి. అయినను అప్పుడప్పుడు సమాధానములగుచునేయుండెను. ఇట్లు మహాపరాక్రమముతో రామరాయలు రాజ్యముచేయుచు దానధర్మములుచేయుచు, గుళ్ళు గోపురములుకట్టించుచు, కవులను ఆదరించుచు, అసమానశౌర్యముతో మెఱయుటనుజూచి తురకలోర్వక 1565 సం॥ తాలికోటయొద్ద పెద్దజగడము చేయందొడంగిరి. ఆ యుద్ధమున మహమ్మదీయులు రామరాయలను అక్రమముగాపట్టి నరికివేసిరి.

ఆవల విజయనగరము తురకల స్వాధీనములోనుండినదేగాక వారు సమస్తమును పాడుచేసిరి. అప్పుడు పెనుగొండయందున్న విజయనగరనరపతివంశీయుఁడైన తిరుమలరాయడు విజయనగరమునకువచ్చి సింహాసనమెక్కుటకు ప్రయత్నించియు సాగలేదు. కొన్ని శాసనములవలన సదాశివరాయనినిచంపివేసి ఈ తిరుమలరాయడు 8 ఏండ్లేలినట్లు తెలియుచున్నది.



శ్రీరంగరాయలకుతర్వాత ఇతనిసహోదరుఁడు వేంకటపతిరాయలు 1586 మొదలు 1614 వఱకు మహాశూరుఁడై రాజ్యమేలుచుండెను. ఆకాలమున తన రాజ్యముతో సంబంధించిన చెంజికి కృష్ణప్పనాయనిని, మధురకు కుమారకృష్ణప్పనాయనిని, చెన్నపట్టణమునకు (మద్రాసుకు) జగదేవరాయలను, శ్రీరంగపట్టణమునకు తిరుమలరాయలను, ఇట్లే తంజావూరు, పెనుగొండ మొదలగు మండలములకును ప్రతినిధులను నియమించి పాలించుచుండెను.

ఆతర్వాత 1614 మొదలు 1636 వఱకును మూడవ నరపతివంశీయులే యేలుచుండిరి. 1639 లో శ్రీరంగరాయలు విజయనగరములో నుండి రాజ్యముచేయు కాలంబునందు "ఈస్టు ఇండియా కంపెని" వారికి ముఖ్యుఁడైన 'డే' అనునతఁడు మద్రాసుకువచ్చి, శ్రీరంగరాయనితోకోటను గట్టుకొనుటకు స్థలమీయవలయుననియడుగగా, శ్రీరంగరాయలు తనపేరుతో శ్రీరంగరాయపట్టణము అనుపేర నగరమునిర్మించునట్లుగా మద్రాసులోనున్న తనప్రతినిధియైన నాయడుగారికి ఉత్తరవుచేసినంత, ఆనాయడు పట్టణముగట్టి, దానికి తనతండ్రి చెన్నప్పనాయనిపేర "చెన్నపట్టణ" మని పేరుంచెను.

---

**నరపతివంశీయ మూఁడవసంతతివారియొక్క వంశావళి.**

పూసపాటి రంగరాయనికిని ఆతనిపత్ని తిరుమలాంబకును రామరాజు, తిరుమలరాయలు, వేంకటాద్రిరాయలు అనుముగ్వురు కల్గిరి.

వీరిలో రామరాజుకు కృష్ణదేవరాయని కూతురైన మోహనాంగి లేక తిరుమలాంబయందు (4వ) రంగరాయలును, మరి నల్వురు కుమారులుకల్గిరి. ఈరంగరాయలకు పెదవేంకటరాయలు, చినవేంకటరాయలు అను నిర్వురుకొడుకులు పుట్టిరి. ఈ చినవేంకటరాయలకు (6వ) రంగరాయలు పుట్టెను. ఇతడు 1644 లో గోపాలరాయలకు దత్తపుత్రుఁడై చంద్రగిరికి రాజాయెను.

చంద్రగిరిలో వేంకటపతిరాయలు 1614 లో గతించినమీఁద, ఆయనభార్యతరపువారు, వేంకటపతిరాయని స్వీకారము చేసికొన్న సింగదేవరాయని చెఱఁబెట్టయత్నించినదేగాక మరికొన్నిదుర్మార్గప్రయత్నములుచేయుటకును తలంపుగొన్న సంగతి నెఱింగి, తానే తనభార్యను బిడ్డలను నరికివేసి తానును కత్తితోపొడిచికొని గతించెను.

ఈవృత్తాంతమెఱింగిన యాచమనాయఁడు తోడనే సైన్యముతో చంద్రగిరికిపోయి ఆదుర్మార్గులలో కొందఱిని ఖండించి వేంకటపతిరాయలకు వార్సుదారుఁడైన చిక్కదేవరాయనికి పట్టముకట్టివేసెను.

ఆమీఁద ఆదుర్మార్గులలో మిగిలిన కొందఱు తంజావూరులోని నాయళ్లను, మధురలోని ముద్దువీరప్పనాయనిని సైన్యముపంపవలసినదిగా కోరిరిగాని వారును సమ్మతించలేదు.

---

**నరపతిరాజుల నాల్గవసంతతి.**

చిన (6వ) వేంకటరాయనికి వీరవేంకటరాయలు, తిరుమలరాయలు, (6వ) రంగరాయలు పుట్టిరి. వీరవేంకటరాయనికి రామరాయలు, రంగరాయలుపుట్టిరి. ఈరామరాయలకు వెంకన్న, చిన్నరాజు, రామరాయలను మువ్వురుపుట్టిరి. తిరుమలరాయనికి రామరాయలు, గోపాలరాయలుపుట్టిరి. చిన్నరాజుకు పెద్దదాసరాయలు, చిన్నదాసరాయలుపుట్టిరి. చిన్నదాసరాయలకు రామరాయలు, వీరవేంకటరాయలుపుట్టిరి. వీరవేంకటరాయలకు తిరుమలరాయలును, చెల్లమ్మ అను కూతురునుపుట్టిరి. ఈ తిరుమలరాయనికి నరసింహరాయలు, వీరవేంకటరాయలు, కేశవమ్మయుపుట్టిరి. కేశవమ్మ గర్భమునందు చిన్నతిరుమలరాయలును లక్ష్మీదేవమ్మయుపుట్టిరి. ఈ చిన్నతిరుమలరాయలకు వేంకటరాయలు, కృష్ణరాయలు, ఒకకూతురునుకల్గిరి. ఈకృష్ణరాయలకు పుత్త్రిడులేనందున పంపాపతిరాయలను స్వీకారముచేసికొనెను. ఈపంపాపతిరాయలెవరనఁగా,-మున్ను చెప్పిన చెల్లమ్మ గర్భమునందు పెద్ద పంపాపతి, చిన్నపంపాపతి అను నిర్వురుపుట్టిరి. వీరిలో నొకరే పంపా



పతిరాయలు. ప్రకృతమున ఆనెగొందియందు జహగీర్ దారైయుండు నరపతి శ్రీరంగరాయరాజారావ్ సాహేబ్ గారు పైనచెప్పఁబడిన పంపాపతిరాయల సంతతిలో జేరినవారు. వీరికి నిజాం గవర్నమెంటు వారు జహగీరును, ఇంగ్లీషు గవర్నమెంటువారు రొక్కముగా పింఛను నును ఇప్పించుచున్నారు.

---

## ఎనిమిదవ అధ్యాయము.

---

### నాయఁడుగార్ల సంస్థానము.

శ్రీచంద్రవంశీయ ఆంధ్రక్షత్త్రియులకు మొదట రాజ, మహారాజ, విజయ, సేన, విక్రమ, భోజ, పాల, భువన, సింహ, చాళుక్య, వర్మ, వల్లభ, వర్ధన, మల్ల, కాలచూర్య, నాయక, గణపతి, గజపతి, నరపతి, రాయ, అనునీమొదలగు పేర్లుండెను. ఆమీఁద నాయఁడు అనుపేరుకల్గెను. ఆంధ్రక్షత్త్రియులు మగధము, ఉజ్జయినీ మొదలగు దేశములయందుండి రాజ్యముచేయుకాలమున సంస్కృత నామముల నుంచుకొనియుండిరి. దక్షిణదేశమునకు రాను ప్రారంభించినమీఁద రాజశబ్దముయొక్క అపభ్రంశమైన రావు, రాయలు అనునట్టి పేర్ల నుంచుకొనిరి. ఆతర్వాత నాయకశబ్దముయొక్క ఆంధ్రాపభ్రంశమైన నాయఁడు అనుపేరు వ్యవహారమునకు వచ్చెను. మరియు నాయకఅనఁగా అచ్చటచ్చటనుండు పాళెములకును, సైన్యమునకును, (దండునకును) అధిపతులుగానుండిన ఆంధ్రక్షత్త్రియ బంధువులకే పేరుగలదు. కాఁబట్టియే నేటిదాక సైన్యములోని కొందఱికి ‘‘నాయక’’ అనే అధికారమును మన గవర్నమెంటువారును బిరుదనామముగా నిచ్చియున్నారు.

విజయనగరము ప్రబలముగానున్నకాలమందు ఆరాజు తనరాజ్యమును తొమ్మిదిఖండములుగా విభజించి ఒక్కొకఖండమున కొక్కొకరిని నాయఁడు అను బిరుదనామమిచ్చి నియమించెను.

విజయనగరమును అచ్యుత దేవరాయలు రాజ్యభారమువహించి పాలించుకాలమునందు ఆతనిమరదలైన మూర్తియమ్మను చేవప్పనాయఁడువివాహముచేసికొనెను. అందుచే నీతనిని తంజావూరును పాలించునట్లుచేసినదేగాక ఆనగరమును స్త్రీధనముగానిప్పించివేసిరి. ఇదిగాక ఆకాలమునందు విజయనగరమునందు సుమారు 200రికి నాయకులనెడి బిరుదనామములిచ్చి రాజునకు సహాయకులుగానుండునట్లు నియమింపబడియుండిరి. ఈవిషయమును మిస్టర్ స్యూవెల్ దొరగారు వ్రాసిన విజయనగరచరిత్ర 345 - 349 పుటలయందుగానందగును.

ఆనాయడులలోకొందఱినియిట వ్రాయఁబడుచున్నయది.

1. అతివీరతిమ్మప్పనాయడుగారు—ఇతఁడు ఉదయగిరి, కొండవీడు, పెనుగొండ, కడప, సిద్ధవటము, గండికోట, నెల్లూరు, కనకగిరి, (కనిగిరి), ఒరిస్సాప్రాంతములలో కొంతభాగమునకు అధిపతి. ఇతనికి ఆదాయము 8,00,000, లక్షుల బంగారమొహరీలు. ఇందు 3,00,000, లక్షులవరహాలు నరపతిరాజులకు కప్పమియ్యవలయును. మిగత ధనము నుతాముతీసికొని, సంస్థానరక్షణమునకై 25,000 పదాతులను, 15,000 గుఱ్ఱములను, 40 ఏనుగులను సిద్ధముగానుంచుకొనియుండవలసినది.

2. గోపాలనాయుడుగారు — ఇతఁడు గోవాప్రాంతములలోని రాజకులం, త్రిపురం, దిబ్బాలం, భోగలోలం, మొదలగుప్రాంతములకు అధిపతి. ఇతనికి ఆదాయము 600,000 లక్షులవరహాలు. 1,50,000, వరహాలు నరపతిరాజుకుకప్పము, 20,000, పదాతులను, 2,500 గుఱ్ఱములను, 20 ఏనుగులను సిద్ధముగానుంచుకొని యుండవలసినది.

3. లక్ష్మయ్యనాయఁడు—ఇతఁడు ధార్వాడకు దక్షిణమునందుండు బంకాపురము మొదలగు దేశములకు అధిపతి. ఆదాయము 3,00,000 లక్షుల వరహాలు. 80,000 వరహాలు నరపతికి కప్పము. 20,000 పదాతులు, 12,000 గుఱ్ఱములు, 28 ఏనుగులు నుంచుకొని యుండవయును.



4. నరహరినాయఁడు—ఇతఁడు నాగలాపురమునందు కొన్నాళ్ళధనాధికారిగానుండి ఆమీద బళ్లారి, హర్పనహళ్లి, రాయదుర్గం, మొదలగు దేశములకు అధికారియైయుండెను. ఆదాయము 4,00,000 లక్షుల మొహరీలు. నరపతికి కప్పము 20,00,000 మొహరీలు. 12,000 పదాతులను,600గుఱ్ఱములను,20ఏనుగులనునుంచుకొనియుండవలసినది.

5. చిన్నప్పనాయఁడు—ఇతఁడు మైసూరికిపశ్చిమమునుండికొచ్చివఱకుగల ప్రాంతములకు అధికారి. ఆదాయము 3,00,000 లక్షుల మొహరీలు. నరపతులకుకప్పము 4,00,000 వరహాలు. 10,000 పదాతులను, 800 గుఱ్ఱములను నుంచుకొనియుండవలసినది.

6. కృష్ణప్పనాయడుగారు—అశోల మొదలగు పరగణాలకు అధికారి. 20,000 మొహరీలు ఆదాయము. 7,000 వరహాలుకప్పము. 700 పదాతులను, 500 గుఱ్ఱములను నుంచుకొనవలసినది.

7. విజయప్పనాయడుగారు—ఇతనికి రాజప్పనాయడనియు పేరుకలదు. ఇతడు మైసూరారు, చిత్రదుర్గము, మొదలు మంగళూరువఱకుగల దేశములకు అధికారి. 3,00,000 లక్షుల మొహరీలు ఆదాయము. 10,000 వరహాలుకప్పము. 10,000 పదాతులు, 800 గుఱ్ఱములు, 15 ఏనుగలుండవలసినది.

8. మల్లప్పనాయడుగారు—కృష్ణరాయలయొక్క గుఱ్ఱముదళమునకుకర్త. వీరు కల్లికోట మొదలగు మలయాళప్రాంతములకుకర్త. అతనికి 15,000 మొహరీలు ఆదాయము. 5,000 వరహాలుకప్పము. 6,000 పదాతులను, 400 గుఱ్ఱములను నుంచుకొనవలసినది.

9. సాళ్వనాయడుగారు—ఇతడు నరపతుల కొంకప్పుడు మంత్రిగానుండెను. తంజావూరు,నాగపట్ణము, తిరుక్కోవెలూరు, భువనగిరి, కాయల్ పట్ణము మొదలగు లంక (సిలోన్) వఱకుగల దేశములకు అధికారి. ఆదాయము 11,00,000, లక్షులవరహాలు. దీనిలో 3 ట నొకభాగము కప్పము. 3000 గుఱ్ఱములు, 30,000 పదాతులు, 30 ఏనుగలునుంచుకొనవలసినది.

10. విజయప్పనాయడుగారు—రాయచూరు మొదలగు ప్రదేశములకు అధికారి. 4,00,000 లక్షలవరహాలు ఆదాయము. 150,000 వరహాలు కప్పము. 150,00 పదాతులు, 1,000 గుఱ్ఱములు, 50 ఏనుగులు నుంచుకొనవలసినది.

11. ఆదియప్పనాయడుగారు—బల్లారి, గుత్తి మొదలగు ప్రదేశములకు అధికారి. 30,00,000 లక్షలవరహాలు ఆదాయము. 4,000 వరహాలుకప్పము. 8,00,000 పదాతులు, 800 గుఱ్ఱములు, 30 ఏనుగలు నుంచుకొనవలసినది.

ఈ ప్రకారముగానే ఇంకను అనేకనాయడుగార్లు అచ్చటచ్చట నరపతి ప్రతినిధులుగానుండి దేశమునురక్షించుచుండిరి. 1609-1623లో మధురయందుండిన విశ్వనాథనాయడుగారిమనమడు ముద్దువీరప్పనాయడుగారు విజయనగర నరపతులకు 6,00,000 లక్షలవరహాలుకప్పమిచ్చుచుండిరి. ఈవిషయమును మిస్టర్ నెల్సన్ దొరగారువ్రాసిన మధురచరిత్రలో చూడవచ్చును.

---

## కర్ణాటకదేశస్థితి.

విజయనగరరాజ్యముతో జేరిన నవఖండములలో కర్ణాటకఖండము పెద్దది. ఈఖండమునకు ధర్మానాయడుగారు అధికారిగానుండిరి. వీరి వంశీయులే శకాబ్దము 520 మొదలు 688 వఱకునేలుచుండిరి. చోళమండలముకూడా శకాబ్దము 670 మొదలు 710 వఱకు వీరు తమశక్తిచేస్వాధీనముచేసికొనిరి. అదిమొదలు చోళదేశము 1222 వఱకు నరపతులపాలనలోనేయుండెను.

కృష్ణదేవరాయలకాలములో తొండమండలము, తుళువమండలము, కొంకణదేశము, చోళదేశము, పాండ్యదేశము, చేరమండలముమొదలగునవియు వారిపరిపాలనలోచేరియుండెను. ఆకాలమున దక్షిణమందలి ఇంతగొప్పరాజ్యమును 3 ఖండములుగాభాగించి, నెల్లూరుమొదలు



కొల్లడమువఱకును తుపాకికృష్ణప్పనాయడుగారిని పాలించునట్లును, తంజావూరు మొదలు కావేరితీరమువఱకును విజయరాఘవులునాయడుగారిని పాలించునట్లును, కావేరీతీరము మొదలు దక్షిణముకడవఱకును వేంకటప్పనాయడుగారినిపాలించునట్లును నియమించిరి. ఇట్లునియమించిన నాయడుగార్లు ప్రజలకు సౌఖ్యముకలుగునట్లుగా పాలించుచుండిరి. ఆమీఁద ఈనాయడుగార్లు తమచేతిక్రిందుగా కొందఱునాయడుగార్లకు కొన్నికొన్నిగ్రామములను పంచియిచ్చి పాలించునట్లుచేసిరి. అయినను కాలవ్యత్యాసముచేత మహమ్మదీయులాదిగాగలవారిచే రాజ్యము ఆక్రమింపఁబడియెను. ఇప్పుడుండునట్టి కొందఱు బలిజవంశక్షత్రియుల చరిత్రములు వ్రాయఁబడుచున్నవి.

---

# తొమ్మిదవ అధ్యాయము.

## వేంకటగిరిసంస్థానము.

ఈ సంస్థానము నెల్లూరిజిల్లాలోనున్నది. దీనిని క్రీ-పు. 1257సం॥ వెలమబలిజవారైన బేతాళనాయడుగారు స్థాపించిరి. ఇతఁడు ఓరంగల్లు గజపతిరాయలు నొద్దనుండివచ్చిన యతఁడు. ఇతనికి దామానాయడు, ప్రసాదిత్యనాయడు, రుద్రనాయడు అను ముగ్గురుకుమారులు పుట్టి మహాపరాక్రమవంతులై యుండిరి. దామానాయడుగారికి వెన్నమనాయడు, సామినాయడు అని యిర్వురుకొడుకులు పుట్టిరి. వెన్నమనాయనికొడుకు ఎఱ్ఱతులసినాయడుగారు 1293 మొదలు 1323 వఱకును కాంచీపురములోని పాండ్యునిజయించి జయశీలుఁడై అచ్చోటనుండి రాజ్యమేలుచుండెను. ఎఱ్ఱతులసినాయడుగారికి సింగమనాయడు, వెన్నమనాయడు, యాచమనాయడు అను ముగ్గురు కుమాళ్లుగలిగి మహాధీరులును శూరులునునై యుండిరి. వీరిలో సింగమనాయనికి అనంతభోగనాయడు, మాధవనాయడుఅని యిర్వురుకుమార్లుగలరు. అనంతభోగనాయడు 1300సం॥మునందు సుమారు 100గురు పాళేగారులనుజయించినాఁ

డు. మాధవనాయడు 1369 లో శ్రీశైలస్థలమును జీర్ణోద్ధారణముకావించెను. అనంతభోగనాయనికి పెదసింగమనాయడు, ధర్మానాయడు, తిమ్మానాయడు, అన్నమనాయడు, చినసింగమనాయడు అని ౫ గురు కుమార్లుకల్గిరి. వీరిలోతిమ్మానాయనికి ధర్మానాయడు, సిద్ధిదాసనాయడు, అనపోతనాయడు అను ముగ్గరుపుట్టి 1456 మొదలు 1477 వఱకు పాలించుచుండిరి. అనపోతనాయనికి పెద్దమాధవనాయడు, చిన్నమాధవనాయడు, వీరశూరనాయడు, మధుసూదననాయడు, యాచమనాయడు, చినసింగమనాయడు, నిర్వాణననాయడు పుట్టిరి. ఇట్లుండగా వీరిరాజ్యము విజయనగరము అచ్యుతదేవరాజు వశమైపోయినది. ఆమీద 1530 మొదలు మరల వీరివశమైనది. అదిమొదలు వీరివంశీయులైన సింగమనాయడు, కుమారతిమ్మానాయడు, పెద్దకొండప్పనాయడు, తిరుమలనాయడు, జ్ఞానతిమ్మానాయడు, కొండమనాయడు, పెద్దకొండప్పనాయడు, చెన్నప్పనాయడును పట్టమునకువచ్చిరి. వీరిలో చెన్నప్పనాయడుగారు గండికోటలో మహమ్మదీయులను జయించిరి. పైనచెప్పినట్టి పెద్దకొండప్పనాయనితమ్ముడు యాచమనాయడుగారికి కస్తూరి రంగప్పనాయడుడు, ఆర్వీటి తిమ్మప్పనాయడు అని యిద్దరుకొడుకులుగలరు. వీరిలో కస్తూరిరంగప్పనాయడుగారు 1579 సం॥ విజయనగర నరపతిరాజులకు యుద్ధసమయములో చాలాసహాయముచేసి మహాశూరుడని పేర్వడసెను. ఈ కస్తూరి రంగప్పనాయని కొడుకు యాచమనాయడుగారు 1602 సం॥మునందు విజయనగరము వేంకటపతిరాయలవలన మధురాన్తకము అను గ్రామమును (ఇప్పుడిది తాలూకా) బహుమానముగా బొందెను.

ఈ యాచమనాయడుగారి కొడుకు బంగారు యాచమనాయడు అగ్రహారమునుకట్టి దానముచేసిన ధర్మాత్ముడు. ఇతడు 1658 లో వేలూరిలో నొకతురకదుర్మార్గునివలన జంపఁబడెను. ఇతనికొడుకు సర్వజ్ఞకుమారయాచమనాయడుగారు 1700 సం॥మునందు వేలూరియందును,



1712 లో మైసూరియందును, 1714 లో చెంజియందును జరిగినయుద్ధములలో జయమునొంది 1747లో గతించిరి. ఇతనికుమారుడు బంగారు యాచమనాయడు 1760 లో వేంకటగిరియందు కోటనుగట్టి 1776 వఱకు పాలించుచుండిరి. వీరిసోదరుడైన పెద్దయాచమనాయడుగారికి సంతతిలేనందున కుమార యాచమనాయడుగారిని దత్తతతీసికొనిరి. ఈ కుమార యాచమనాయడుగారే రాజ్యముచేయుచుండిరి. వీరు ఇంగ్లీషు వారికి 1802 లో సహాయముచేసిరి. వీరికిని సంతతిలేనందున బంగారు యాచమనాయనిని స్వీకారముచేసికొనిరి. ఇతడు 1847 వఱకు రాజ్యమేలెను. వీరికి కొందఱుకుమార్లుగలరు. వారిలో నొకరైన శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రనాయడుగారే ప్రకృతమున సింహాసనాధిపతులై అధిక కీర్తి గాంచుచున్నారు.

---

## కాళహస్తి సంస్థానము.

కాహస్తిసంస్థానము చిత్తూరుజిల్లాలోనున్నది. ఈసంస్థానమును క్రీ-పు-1112 సం॥నందు క్షత్రియవంశీయ ఇనగలగోత్ర జయప్పనాయడుగారు స్థాపించిరి. ఇతడు క్రీ-పు. 1112 సం॥ శా-శ-సం॥ 1033 లో ఓరంగల్లు ప్రతాపరుద్రరాయలకు సహాయకుడై మహమ్మదీయులను జయించినందువలన నీ సంస్థానము ఇతనికివచ్చెను. ఇతనికుమారుఁడు మాదానాయడుగారును ప్రతాపరుద్రునకు సహాయముచేసియున్నారు. ఇతనికుమారుఁడు వల్లభనాయడు గజపతులకు సహాయకుడై మహమ్మదీయులనుజయించి ఖాదర్ ఖాఁ అను మంత్రినింజంపెను. ఇతనికుమారుడు తిమ్మానాయడుగారు మహమ్మదీయులను జయించి దేవరకొండ పరగణాను జాగీరుగా బడసిరి. ఇతనికుమారుడును వాలూరును జయించి ఆదేశమును వశముచేసికొనిరి. వీరిసహోదరుఁడు అన్నమనాయడుగారికి మగసంతానము ఎక్కువగానుండెను. వారిలో వేంకటప్పనాయడుగారు శూనకాసల యందున్న మహమ్మదీయులనుజయించి దానిని తమ రాజ్యముతో జేర్చుకొనిరి.

పదునైదవ (15) శతాబ్దమున గజపతిసంస్థానముయొక్క మహిమతగ్గి విజయనగర నరపతులమహిమ ప్రబలముగానుండెను. అప్పుడు కాళహస్తిరాజైన దామర్లవీరప్పనాయడుగారు విజయనగర సంస్థానమువారికి సహాయకుఁడై యుండినారు. వీరికుమారుడు దామర్ల వేంకటప్పనాయడుగారు నరపతి శ్రీరంగరాయలకాలములో (క్రీ-పు-1573-1585) మిగుల కీర్తిశాలిగానుండి మహమ్మదీయులను జయించినందున శ్రీరంగరాయలు సంతోషించి చెంజి, వందవాసి మొదలగు గ్రామములను కొన్ని బిరుదులను ఇచ్చిరి. ఇతనికుమారుడు వేంకటప్పనాయడుగారును మహాశూరులై మహమ్మదీయులను జయించినందువలన తంజావూరు తిరిచినాపల్లి మొదలగు పరగణాలనిచ్చిరి. అయినను ఇతడు తిరిచినాపల్లివద్ద జరిగిన యుద్ధములో గతించెను.

---

ఇతనికుమారుడు చెన్నప్పనాయడు పట్టమునకువచ్చి కొన్నాళ్లు పాలించెను. ఆమీద వీరికుమారుడు దామర్ల వేంకటాద్రినాయడుగారు పట్టమునకువచ్చిరి. అప్పుడు ఆంగ్లేయులాదిగాగలవారు దక్షిణదేశమునకువచ్చి వర్తకముచేయుచుండిరి. అంత ఆంగ్లేయులు దామర్ల వేంకటాద్రినాయడుగారిని ఆశ్రయించి, మద్రాసును తమకిప్పింపవలసినదని యడుగగా, వారు చంద్రగిరియందున్న నరపతి శ్రీరంగరాయల అనుమతినిబొంది ఆంగ్లేయులకు మద్రాసును ఇప్పించిరి. అయినను ఈ వేంకటాద్రినాయడు శ్రీరంగరాయలుచెప్పినట్లు మద్రాసుకు, శ్రీరంగరాయపట్టణమని పేరుబెట్టక, తనతండ్రిపేరైన చెన్నప్పనాయనిపేర చెన్నపట్టణమని పేరుపెట్టెను.

వీరికి తర్వాత వచ్చినవారలలో అక్కప్పనాయడుగారు మహాపరాక్రమముగలవారై ఔరంగజీబుకు సహాయముచేసినందున "బహదర్" పట్టమునుపొందిరి. వీరికి సంతతిలేనందున వీరి అన్నకుమారుడు దామర్ల వేంకటప్పనాయడు 1745 లో పట్టమునకువచ్చి మహాశూరుడై రాజ్యమునేలినను మహారాష్ట్రులు 1758 లో దండెత్తివచ్చిరి. అపుడు



ఇంగ్లీషువారు కాళహస్తిసంస్థానమును రక్షించుచుండిరి. అదిమొదలు ఆంగ్లేయులకును కాళహస్తివారికిని మిగుల స్నేహముకలిగెను. ఇతడు 1795 లో గతించినందున వీరికుమారుడు దామర్ల తిమ్మానాయడుగారు పట్టమునకువచ్చి ఆంగ్లేయులకు మిత్రుడై యుండి 1803 సం॥ గతించిరి. ఇతనికి పెద్దవెంకటప్పనాయడు, చిన్నవెంకటప్పనాయడు అని ఇర్వురు కొడుకులుండిరి. వీరిలో పెద్దవెంకటప్పనాయడు పట్టమునకువచ్చి కొంతకాలముండి గతించినందున, వీరికుమారుఁడు తిమ్మనాయడుగారు పట్టమునకువచ్చి 1832 లో గతించినందున, ఈయనపత్ని దామర్ల వేంకటప్పనాయడుగారిని స్వీకారముచేసికొనగా నతడు 1834 లో పట్టమునకువచ్చి అనేక ధర్మకార్యములుచేయుచుండగా, జమీన్‌దార్లు కప్పమునధికముగా నిప్పించవలసినదనెడి క్రొత్తచట్టమును ఇంగ్లీషువారు పుట్టించినందున నితడు చాలాధనము అప్పుతీసి తుదకు ఆవ్యసనముచేతనే తమ ఆర్గురుకొడుకులను విడిచిపెట్టి 1881 లో గతించిరి. ఈ ఆర్గురిలో పెద్దకుమారుడైన రాజా దామర్ల కుమారముద్దు వేంకటప్పనాయడు బహదర్‌గారు 1881 మేనెల 17 తేది పట్టమునకు వచ్చిరి. ఇంగ్లీషు దొరతనమువారివలన రాజమర్యాదలలో కొన్నిటిని 1890 సం॥ బడసిరి. ప్రకృతమున నీసంస్థానము "కోర్టుఆఫ్‌వార్డ్సు" వారివశముననున్నది.

---

## కార్వేటినగర సంస్థానము.

ఈసంస్థానము చిత్తూరుజిల్లాలోనున్నది. ఈసంస్థానము కల్గినకారణమెట్లనఁగా:—తొమ్మిదవశతమానమునందు గోదావరిజిల్లా పిఠాపురమునందుండి ఆంధ్రక్షత్రియ వెలమబలిజ కుటుంబముతోఁజేరిన బొమ్మరాజు, మాకరాజు అను సహోదరులిర్వురు రామేశ్వరయాత్రకై బయలుదేరి అచ్చటచ్చటగల దివ్యక్షేత్రతీర్థములను సేవించుచు తిరుపతికివచ్చి స్వామిదర్శనముచేసికొని, దూరదేశ ప్రయాణశ్రమ నివర్తి

కై "మట్టిగుంట" అనుగ్రామమునందు కొన్నాళ్లుండిరి. ఇట్లుండఁగా నొకనాడు కొందఱు కొల్లగాండ్రువచ్చి ఆగ్రామమును కొల్లగొట్టినదే గాక, ఆగ్రామాధికారినిని హింసించిరి. అట్టికాలమునందు ఈసహోదరులిర్వురును ఆకొల్లగాండ్రను కొట్టితఱిమివేసిరి. అందుచే నీశూరులపై గ్రామాధికారికిని గ్రామస్థులకును ప్రేమగల్గినది. గ్రామాధికారి బొమ్మరాజును మంత్రిగా నియమించుకొనెను. ఇదిగాక అతనికి సంతతిలేనందున మఱికొన్నాళ్లకు తనదేశమును బొమ్మరాజుకు అప్పగించి మృతిచెందెను. బొమ్మరాజు ధర్మముతో రాజ్యమునేలుచుండెను. ఇతనికిని సంతతిలేనందున పిఠాపురమునందుండి యితనిదాయాదికుటుంబముతోఁజేరిన సాళ్వ నరసనాయనిని 1020 లో దత్తతతీసికొని ఆతనికి పట్టముకట్టెను. అతడు నరసాపురము అను నగరమును నిర్మించి రాజ్యమేలి 1023 లో గతించినందున, వీరికుమారుడు సాళ్వ వేంకటపతినాయడుగారు పట్టమునకువచ్చి చోళులను జయించి 35 సం॥ పాలించిరి.

వేఱొక శాసనమువలనఁ దెలియవచ్చువిధ మెట్లనగా:—శా-శ-880 సం॥ విమలాదిత్యనాయడును, 930 వేంకటపతినాయడును, 958 భీమనాయడును, 1077 భుజంగనాయడును, 1236 నరసనాయడును ఏలినట్లు తెలియుచున్నది.

అయినను ప్రకృతముననుండువారు బొమ్మరాజ సంతతివారే యని వేద్యమయ్యెడిని.

---

బొబ్బిలి సంస్థానము.

ఈసంస్థానము విశాఖపట్టణముజిల్లాయందున్నది. ఈనాయడు సంస్థానమును స్థాపించినవారు పెద్దినాయడుగారు. ఇతడు 1652 సం॥ రాజాం అనుచోట కోటనుగట్టి దానికి (బెబ్బులి) బొబ్బిలియని పేరిడిరి. 1756 సం॥ రంగారావుగారు రాజ్యముచేయుచున్న కాలమునందు రాజ్యమున కలహములు సంభవించెను. అపుడు ఫ్రాన్సుదేశపు సేనాధిపతిగానున్న బుస్సీ అను నతనిని విశాఖపట్టణములోని విజయనగరరాజు పురికొల్పినంతట ఘోరయుద్ధము జరుగ నారంభించెను. ఈ జగడమునందు రంగారావుగారు అగపఱచిన శౌర్యము చెప్ప నలవికాదు. అయినను రాజును ప్రజలును ప్రాణములున్నంతదాక పోరాడిమడిసిరి. ఎట్టకేలకు ఈవిజయనగరాధిపతిని చిత్రవధచేసి చంపిరి. ఈబొబ్బిలిరాజైన రంగారావుకొడుకును నొక ముసలివాఁడొకచోటికి తీసికొనిపోయి దాచియుంచెను. యుద్ధము ముగిసినమీఁద సంస్థానమునకు వార్సు ఎవరు గలరని బుస్సీ విచారించెను. తుదకు ముసలివానిచే కాపాడబడిన చిన రంగారావునే 1794 లో సింహాసనాసీనుంగావించెను. ఇతడు మహాధార్మికుడుగానుండెను. ఇతనికి సంతతిలేనందున 1852 లో పిఠాపురపు రాజకుమారుని స్వీకారము చేసికొనెను. అతడు 1864 లో గతించినందున, ఆయనభార్య చెల్లయ్యమ్మగారు పట్టమునకు వచ్చినమీఁద, శ్రీ వెంకటగిరిరాజాగారి మూఁడవ కొమారుడు శ్రీ వేంకటశ్వేతాచలపతి రంగారావు బహదర్‌గారిని దత్తతచేసికొనెను. వీరే యిపుడు బొబ్బిలిరాజ్యమునేలుచు సర్వవిధములయందును ప్రఖ్యాతిగలవారని పేరొందుచు వెలయుచున్నారు.



---

పిఠాపుర సంస్థానము.

ఈసంస్థానము గోదావరిజిల్లాలోనున్నది. ఈ ఆంధ్రక్షత్రియ వెలమనాయడుగారియొక్క సంస్థానమునకుమూలపురుషులు అయోధ్యనుండివచ్చినవారు. ఇదిగాక నూజివీడు మొదలగు అనేక జమీందార్లందఱును ఆంధ్రక్షత్రియ వెలమబలిజవారని తెలియుచున్నది.

---

## పదియవ అధ్యాయము.

---

### తంజావూరునాయడుగారి సంస్థానము.

సీసమాలిక.

" * * * * * * * *
ప్రజ్వరిల్లెడుచోళ పతులపరంపర వినుడియానంద మా వీనులకును,
క్షేమంకరుండగు చేవప్పనాయడు నచ్యుతప్పయునన నవనియందు, [లైన,
రఘునాథుఁడు విజయరాఘవనాయడు యువరాజుమన్నారు యోగ్యు
పంచపాండవులని ప్రాబల్యమొందుచు ధరనుబాలించిరి ధర్మముగను,
* * * * * * * * "

చోళదేశముతోఁ జేరిన తంజావూరియందు చేవప్పనాయడుగారు, అచ్యుతప్పనాయడుగారు, రఘునాథనాయడుగారు, విజయరాఘవనాయడుగారు, మన్నారుసామినాయడుగారు అను నైదుగురు పంచపాండవులవలె ధర్మముతప్పక ప్రబలముగా రాజ్యమునేలిరి.

చోళదేశమునకు రాజధానియైన తంజావూరు 1365 సంవత్సరమున కిటీవల విజయనగరము నరపతిరాజులకు లోఁబడియుండినట్లు తంజావూరియందుగల దేవాలయములలోను, చుట్టుపట్లనుండు ఆలయములలోను కొన్ని శాసనములున్నవి.

ఇదిగాక మద్రాసు గవర్నమెంటువారి పుస్తకశాలయందు " తంజావూరిరాజులకథలు" అను పుస్తకమునందలి శాసనము పై విషయమును బలపఱుచుచున్నది.

తంజావూరిరాజులకథయందు వ్రాయంబడినదానియొక్క సారాంశము:— " ఆదిలో విజయనగరమునందు అచ్యుతదేవరాయలవారు రాజ్య మేలుచుండగా, పాండ్యదేశాధిపతియైన చంద్రశేఖరరాజు మధురయందుండి రాజ్య మేలునపుడు చోళదేశాధిపతియైన వీరశేఖరరాజు తంజనగరమునందుండి చంద్రశేఖరరాజుమీద దండెత్తిపోయి జయించి



పాండ్య రాజ్యమును అపహరించుకొనెను. అంత చంద్రశేఖరరాజు విజయనగరమునకుపోయి తనస్థితినిగూర్చి విన్నపించుకొనగా, విజయనగరరాజు ఆగ్రహగ్రస్తుడై, తోషేఖానా (ఉగ్రాణము) అధికారియైన నాగమనాయనివారినిరప్పించి సైన్యమునిచ్చి యిట్లనియె. మీరు వీరశేఖరచోళునిజయించి, దక్షిణదేశమునంతయు మీస్వాధీనముచేసికొని వారివారివల్ల పేష్కష్ వసూలుచేయుచు రాజ్యమేలుచు మాకు కప్పమిచ్చుచునుండవలసినదని చెప్పెను. అట్లే నాగమనాయడు దండెత్తిపోయి వీరశేఖరచోళునిచంపి, చోళదేశానికి తానే (నాగమనాయడే) అధికారియైనదేగాక కమప్రకారముగా పాండ్యునికిప్పించవలసిన రాజ్యమునీయక దానిని ఈనాగమనాయడే అపహరించెను. అందువలన విజయనగర నరపతిరాజు నాగమనాయనిమీద కోపముచెంది ఆనాగమనాయనికొడుకైన విశ్వనాథనాయనికి సైన్యమునిచ్చి నాగమనాయనిని జయింపవలయునని ఉత్తరవుచేయగా, ఈ విశ్వనాథనాయడు రాజాజ్ఞప్రకారమే తండ్రియనికూడచూడక నాగమనాయనిని జయించి, ఆరాజ్యమును చంద్రశేఖరపాండ్యుని కీయగా, నతడు సంతోషించి, తనకు పుత్రసంతానములేనందున విశ్వనాథనాయనినే స్వీకారముచేసికొని తన పాండ్యరాజ్యమునకు పట్టముకట్టెను. ఈవిషయమునంతయు విజయనగరరాజువిని సంతోషించెను.

ఇట్లుండగా చోళరాజ్యమునకు తగినరాజు లేకుండినందువలన, అచ్యుతదేవరాయలవారు తనభార్యకు చెల్లెలైనమూర్తియమ్మను చేవప్పనాయడుగారికిచ్చివివాహముజేసి చోళదేశమునువారిస్వాధీనముచేసెను.

---

### చేవప్పనాయడుగారు.

క్రీ - పు - 1549—1572.

తంజావూరిలో నాయడుగారి సంస్థానమునకు మొదటిరాజు చేవప్పనాయడుగారు. ఇతనివంశవివరణమంతయును, ఈచేవప్పనాయడు

గారి మంత్రియొక్క ప్రథమ పుత్త్రుడైన రాజచూడామణి దీక్షితులు రచియించిన "రుక్మిణీపరిణయము" అను కావ్యమునందు స్పష్టముగా నున్నది. ఎట్లనఁగా, చేవప్పనాయని తండ్రి పేరు తిమ్మప్పనాయడు, తల్లి పేరు బయ్యమాంబ, కులము చంద్రవంశ ఆంధ్రక్షత్రియబలిజకులము అని తెలియుటయేగాక, చంద్రవంశ ఆంధ్రక్షత్రియకులతిలకుడైన అచ్యుత దేవరాయలవారి మరదలిని వివాహమైనట్లును, ఈరాజ్యము స్త్రీధనముగా నిచ్చినట్లును వ్రాయఁబడియున్నది. ఇదిగాక తంజావూరిరాజచరిత్ర వలనను, విజవిలాసమువలనను మఱియు ననేకశాసనములవలనను ఈవిషయమును తెలియదగను.

ఈ చేవప్పనాయడుగారు మొదట విజయనగరముతోఁజేరిన నాగలాపురమునందు సైన్యాధిపతిగానుండిరి. వీరియొక్క విద్యాబుద్ధి శీలాదులనంతయు అచ్యుత దేవరాయలుచూచి మెచ్చి అచ్యుత దేవరాయలు వీరికి తనమరదలినిచ్చి పెండ్లిచేసి, తంజావూరును నిచ్చెను. ఈచేవప్పనాయడుగారు తంజావూరియందు రాజ్యమేలునపుడు అనేక ధర్మకార్యములు చేసిరి. వీరు త్రవ్వించినట్టి చేవప్పచెఱువు (சேவப்ப னேரி = చేవప్పచెఱువు, లేక சேவப்பன் குளம் = చేవప్పకొలను) అనునది యిప్పటికిని ప్రసిద్ధముగానున్నది. వీరు హిందువులకును హిందూదేవాలయములకునేగాక ఇతరమతస్థులకును కావలసిన ధర్మకార్యములను చేయించినారు. ఇపుడు తంజావూరు రైలుస్టేషనుకు సమీపమునందుగల మసీదువద్దనుండు శిలాశాసనములో ఈ చేవప్పనాయడుగారు మహమ్మదీయులయొక్క మసీదుకై స్థలమునిప్పించినట్లుగా శకాబ్దము 1472 లోని శాసనమున వ్రాయంబడియున్నది. సాహిత్యరత్నాకరము 3 వ సర్గ 6వ శ్లోకమువలన దెలియవచ్చునదేమనగా,—తిరువణ్ణామల (అరుణాచలము)యొక్క గోపురమును, కోవెలకు బైటనుండు పెద్ద గుంటను చేవప్పనాయడుగారి కైంకర్యములని తెలిసెడిని. వీరికాలమున, అనగా శకాబ్దము 1494 సం॥ క్రీ - పు-1572 సం॥మునందు తిరు



వణ్ణామలలో శివనేశన్, లోకనాథన్, అను సహోదరులిద్దరుకూడనొక గోపురమును కట్టినట్లుగా గోపురమందొక శాసనములో నున్నది. మరియు వీరి సద్ధర్మపరిపాలనమునుగూర్చి సాహిత్యరత్నాకరము 3వ సర్గ 9—17 శ్లోకములవలన స్పష్టముగా దెలిసికొన నగును. వీరు తమ కుమారుడైన అచ్యుతప్పనాయడుగారికి రాజ్యమును పట్టముగట్టి పరమపదము నలంకరించిరి.

---

## అచ్యుతప్పనాయడుగారు.

### క్రీ - పు - 1577—1613.

చేవప్పనాయడుగారికితర్వాత అచ్యుతప్పనాయడుగారు సింహాసనమెక్కిరి. సాహిత్యరత్నాకరము 8 సర్గ 38 శ్లోకప్రకారముగా చిన్న చేవప్పనాయడనికూడా నీతనికి పేరుకలదని తెలిసినను, వీరితండ్రిగారైన చేవప్పనాయడుగారు తన్ను వృద్ధికిందెచ్చిన అచ్యుదేవరాయలవారియందుగల కృతజ్ఞత సదాజ్ఞప్తియందుండవలయునని యెంచి కుమారునికి అచ్యుతప్పనాయడని పేరిడిరి. ఈ అచ్యుతప్పనాయడుగారు విద్యావంతులై అనేకులకు విద్యాదానము చేయుటకై తగినయేర్పాట్లు కావించిరి. వీరు సాహిత్యరత్నాకరము, రుక్మిణీపరిణయము అను రెండుగ్రంథములకు అధిపతులు. ఈనాయడుగారు శ్రీరంగము రంగనాథస్వామికి అనేకాభరణములను కొన్ని గ్రామములను సమర్పించిరి. ఇదిగాక కావేరీనది ఆనకట్టను జీర్ణోద్ధారణముచేసిరి. మాయవరము, మధ్యార్జునము, కుంభఘోణము, తిరువలంజుళి, వృద్ధాచలము, తిరువైయారు, రామేసేతువు మొదలగుస్థలములలో సోపానములను నిర్మించిరి. రామసేతువునందు పుష్పమండపము నిర్మించిరి. ఇంకను అనేక అగ్రహారములను బ్రాహ్మణులకు దానముచేసిరి. మరియు చిదంబరము, కాళహస్తి, తిరుపతి మొదలగుస్థలములను జీర్ణోద్ధారణము చేసినట్లు రుక్మిణీపరిణయ

కావ్యముచేఁ దెలిసెడిసి. ఇతనికి కర్ణాటక బ్రాహ్మణుడైన గోవిందదీక్షితులు మంత్రిగానుండిరి.

ఈ అచ్యుతప్పనాయడుగారు నాగపట్టణమునవచ్చి దండు విడిసియున్న మహామదీయులను పారద్రోలిరి. ఇతఁడు తన జీవితకాలములోనే తనకుమారుఁడైన రఘునాథనాయడుగారికి పట్టముకట్టిరి.

---

## రఘునాథ నాయడుగారు.

### క్రీ - పు - 1614 - 1630.

ఈ రఘునాథనాయడుగారికి శాస్త్రోక్తప్రకారముగా రాజ్యపట్టాభిషేకము కావింపంబడియెనని సాహిత్యరత్నాకరము 12 సర్గ-56-82 శ్లోకములవలనఁ దెలియుచున్నది. ఇతనికిని గోవిందదీక్షితులు మంత్రిగానుండిరి. వీరును అనేక హిందూదేవాలయములకు తండ్రివలెనే ధర్మకార్యములుచేసి కీర్తికెక్కిరి. మరియు అన్నదానమునందు వీరిని మించినవారు మరెవ్వరును లేరనెడి పేరును వహించిరి. ఇతని పరాక్రమమునకు భయముచెంది మధురయందున్న పాండ్యుడు తన కుమార్తెనిచ్చి వివాహముచేసెను. ఈతని శక్తి సామర్థ్యము లన్నియును "రఘునాథవిలాసము" అను గ్రంథమునుజూచిన బోధమగును. ఇతడు విద్యాప్రియుడు. విద్వాంసులను బోషించుచుండెను. వీరి సంస్థానవిద్వాంసు లెవరనఁగా:—

1. గోవిందదీక్షితులు :—ఇతడు మంత్రియును పండితుడున్నై యుండెను. ఇతడు హరివంశసారచరిత్రమును రచియించెను. దీనికి అప్పయదీక్షితులు వ్యాఖ్యానముచేసియున్నారు. ఇదిగాక ఈ దీక్షితులు సంగీతసుధానిధి అనెడి గాయకశాస్త్రమునురచియించియున్నారు.

2. యజ్ఞనారాయణ దీక్షితులు :—ఇతడు పైనచెప్పిన గోవిందదీక్షితుల జ్యేష్ఠకుమారుఁడు. ఇతడు సాహిత్యరత్నాకరము, రఘునాథభూప విజయము, రఘునాథవిలాసము అనునివి మొదలగు గ్రంథములను రచియించెను.



3. వేంకటేశ్వరమఖ(దీక్షితులు):—ఇతఁడు పైనచెప్పిన గోవింద దీక్షితులయొక్క కుమారుడు. యజ్ఞనారాయణదీక్షితులకు సోదరుడు. ఇతడు వార్తికాభరణము, సంగీతశాస్త్ర సంబంధమైన చతుర్దండిప్రకాశిక మొదలగు గ్రంథములనురచియించెను. గంగాతరణకావ్యము 1 సర్గ, 51 శ్లోకప్రకారముగా, నీలకంఠవిజయచంపూకావ్యమును రచియించిన నీలకంఠ దీక్షితులకు ఈ వేంకటేశ్వరమఖ (దీక్షితులు) ఆచార్యులని తోఁచుచున్నది.

4. రాజచూడామణిదీక్షితులు:—ఇతడు చిత్తూరుజిల్లాలోఁ జేరిన సత్యమంగల గ్రామవాసిరైన శ్రీనివాసదీక్షితుల కుమారుడు. ఈకవియొక్క విద్యావైదుష్యమునకు రఘునాథనాయడుగారు మెచ్చి వీరికి రత్నఖేట అను బిరుదిచ్చిరి. ఈకవి బాల్యమందే నవద్వీపమునకేగి విద్యాభ్యాసముచేసి భట్టాచార్యబిరుదు పొందివచ్చినట్లు రుక్మిణీపరిణయము వలన దెలియుచున్నది. ఈకవి రుక్మిణీపరిణయము, కంసధ్వంసనము, కాంతిమత్యుపాఖ్యానము, రత్నఖేటవిజయము, చిత్రమంజరి, శృంగారసర్వస్వము, కావ్యదర్పణము, అలంకారచూడామణి, సాహిత్యసామ్రాజ్యము, తంత్రశిఖామణి, సంకర్షముక్తావళి, న్యాయచూడామణి దర్పణము, మొదలగు కావ్య నాటక భాణ అలంకార సాహిత్యశాస్త్ర గ్రంథములను రచియించెను. ఈతనితండ్రిగారును భావనాపురుషోత్తమాది18 నాటకములును; శతకంఠవిజయాది 60 కావ్యములును; సాహిత్యసంజీవిని, భావోద్భేదము, రసాప్రవము మొదలగు అలంకారశాస్త్రములును; వేదాన్తరత్నావళి, మణిదర్పణము, అద్వైతకౌస్తుభము, విధినిర్ణయము, సర్వసమయసర్వస్వము, స్మృతిరత్నప్రదీపము, మొదలగు వ్యాఖ్యానగ్రంథములను; పరిశుద్ధి, తత్త్వావబోధము మొదలగుశాస్త్రగ్రంథములను రచియించిరి. భావనాపురుషోత్తమనాటక ప్రకారముగా నీ శ్రీనివాసదీక్షితులు అనేక దానధర్మములుచేసి ప్రఖ్యాతిగాంచిన చెంజికోటరాజైన శూరపనాయడుగారి పోషణయందుండిరని తెలియుచున్నది.

5. కుమారతాతాచార్యులు:—ఇతఁడు శ్రీవైష్ణవుడు. ఇతడు పారిజాతాపహరణ నాటకమును రచియించినాడు. ఈనాటకమునందు రఘునాథనాయడుగారి కీర్తిప్రతాపములువ్రాయంబడియున్నవి.

6. భాస్కరదీక్షితులు:— ఇతడు ఆత్మపరీక్ష అనుపేరుగల భాస్కరదీక్షితీయము మొదలగు గ్రంథములను రచియించెను. ఆత్మపరీక్షయందు రఘునాథనాయడుగారికీర్తినిగుఱించి విస్తరించివ్రాయంబడియున్నది.

ఇదిగాక రఘునాథనాయడుగారును విద్వాంసుడై యున్నందులకు దృష్టాంతమేమనఁగా, ఈ నాయడుగారు రచియించిన పారిజాతాపహరణము, నళాభ్యుదయము, అచ్యుతాభ్యుదయము, రామాయణసంగ్రహము, భారతసంగ్రహము మొదలగు గ్రంథములే సాక్షిగానున్నవి. చంద్రవంశ ఆంధ్రక్షత్రియులలో ఆనెగొంది కృష్ణదేవరాయలకుతర్వాత విద్యాభివృద్ధిగావించినవారు ఈరఘునాథనాయడుగారొక్కరే.

రాజచూడామణిదీక్షితులురచియించిన ఆనందరాఘవనాటకము ప్రకారముగా ఈ రఘునాథనాయడుగారికి అచ్యుతప్పనాయడుగారు, రామభద్రనాయడుగారుఅని యిర్వురు కొమారులున్నట్లు వ్రాయబడియున్నవి. ఈ అచ్యుతప్పనాయడుగారికే అచ్యుత విజయరాఘవనాయడు, లేక విజయరాఘవనాయడు అనెడిపేర్లు వ్యవహారమునందుండెను. రఘునాథనాయడుగారికి తర్వాత విజయరాఘవనాయడుగారు తంజావూరుసింహాసనాధిపతులైరి.

---

## విజయరాఘవ నాయడుగారు.

### క్రీ - పు. 1630 - 1670.

—*—

రఘునాథనాయడుగారి పెద్దకుమారుఁడు విజయరాఘవనాయడుగారు పట్టమునకువచ్చిరి. వీరికి గోవింద దీక్షితులయొక్క కుమారుఁడు వేంకటేశ్వరమఖి (దీక్షితులు) మంత్రిగానున్నట్లు తెలిసెడిని. కొందఱు గోవిందదీక్షితులే మంత్రిపదమునందుండిరనిచెప్పెదరు. ఇది అసంగతము.



తంజావూరు ఆంధ్రరాజ చరిత్రవలనఁ దెలియవచ్చు విషయము లేవనఁగా:— ఈ విజయరాఘవనాయడుగారు విష్ణుభక్త శిరోమణి. ప్రతినిత్యమును 12000 బ్రాహ్మణులు భోజనముచేసిన తర్వాత తాము తమ పత్నియును భుజించుచుండిరి. ఒకపుడు విశేషవర్షముచేత వంటకట్టెలు దొరకకపోగా, తమ రాజమందిరమును పడగొట్టి అందుండు దూలములు పట్టెలు స్తంభములు మొదలగువానినిగొని వంటచేయునట్లు చెప్పిరి. ఇట్లు రాజమందిరమునందలి మ్రానులు నయిపోయినమీఁద, వస్త్రాదులవలన వంటచేయ ననుజ్ఞయిచ్చిరి. ఆ వస్త్రాదులపొగకు వంటవాండ్రోర్వలేక పఱుగిడిపోయిరి. అపుడు శ్రీరంగము రంగనాయికాదేవియే వీరవ్రతము నవలంబించిన నాయడుగారు ఈ దినము 12000 బ్రాహ్మణులు భుజింపనిచో భుజింపరని యెంచి పరిచారికావేషముతో వచ్చి వంటచేసిరి. ఇట్లుండగా శ్రీరంగమున రంగనాయికాదేవి ఆలయములో దేవియొక్క ముక్కర కనఁబడనందున ఆదినము పరిచర్యచేసిన బ్రాహ్మణుని ధర్మకర్తలుపట్టి కట్టికొట్టిరి. అంత నా బ్రాహ్మణుడు తంజావూరికివచ్చి నాయడుగారితో విన్నపముచేయగా, నొక విప్రస్త్రీమీఁద ఆవేశరూపముగా రంగనాయికాదేవివచ్చి, నాయడుగారూ, మీ వ్రతమునకు భంగమురాఁగూడదని నేనువచ్చి వంటచేసితిని. అపుడు నా ముక్కులోని ముక్కర గంజితొట్టియందు పడిపోయినదనిచెప్పి అంతర్ధానముకాఁగా, నామీఁద ఆ తొట్టిలోచూడగా ముక్కర కనబడెను. అదిమొదలు విజయరాఘవనాయడుగారు పత్నీసహితముగా ప్రతినిత్యమును శ్రీరంగమునకుఁబోయి కావేరియందు స్నానముచేసి శ్రీరంగనాథస్వామినిని, శ్రీరంగనాచ్చియారును సేవించి మరలి తంజావూరు చేరుచుండిరి. ఇదిగాక అనేక బ్రాహ్మణులకు కావేరీతీరమునందలి గ్రామములను అగ్రహారములుగా నిచ్చిరి.

మరియు నీవిజయరాఘవనాయడుగారు తంజావూరు సంస్థానమునకులోఁబడియున్న దుర్గములను, కోటకొత్తళములను, కావేరీతీరమునం

దలిపుష్పమండపము, మధ్యార్జునమండలి పుష్పమండపమును జీర్ణోద్ధారణముచేసిరి. రాజమన్నారుకోవెలయందు స్వామియొక్క ఆలయమును, మఱియు ననేకములైన దేవాలయములను నిర్మించిరి. రాజ్యమును ధర్మముతప్పక పాలించుచుండిరి. ఇట్టిసమయమున వీరికి సుమారు 80 సంవత్సరములుండును. ఈకాలమున వీరికి మనస్సున విచారము కల్గ నారంభించెను. కారణమేమనగా, వీరు తమకుమార్తె మంగమ్మ అనుకన్యకను తమసేనాధిపతియైన రంగప్పనాయడుగారి కుమారుఁడు రంగనాథనాయడుగారి కీయం దలంచియుండిరి. ఇంతలో మధురయందుండిన చొక్కనాథనాయడుగారు తాము మంగమ్మను వరింపవలయునని అనేక ప్రయత్నములు చేయుచుండిరి.

అప్పుడు విజయరాఘవనాయడుగారినిచూచి వారిపెద్దకొడుకు మన్నారుసామినాయడుగారు చెప్పినదేమనగా, మనము చొక్కనాథనాయనికి మంగమ్మనీయకూడదు. అట్లు వాఁడెదిరించివచ్చెనా యుద్ధముచేసి వానింజయింపవచ్చునని యిట్లుచెప్పెను.

క. మణిక్రిందుపడిచిజలనిధి, తృణమూర్ధ్నపై నుంచియతని తేకువసుమ్మీ,
మణిమణియె తృణముతృణమే, రణవిజయదిలీపవిజయరాఘవభూప.

ఇట్లు మన్నారుసామినాయడుగారుచెప్పఁగా విని విజయరాఘవనాయడుగారు చాలా సంతోషమొందిరి.

చొక్కనాథనాయడు మంగమ్మనే వరింపవలయుననెడి కుతూహలముగలవాఁడై పలువురురాయబారులనుబంపెను. తంజావూరువిజయరాఘవనాయడుగారును వారిబంధుజాలమును సమ్మతింపనందున కన్యకనిచ్చుటలేదనిరి. అంత చొక్కనాథనాయడు యుద్ధముచేయ తలంపుగొని సైన్యముతో వచ్చెను. అపుడు విజయరాఘవనాయడుగారు ఆలోచించినదేమనగా, యుద్ధములో పురుషులందఱొక్కవేళ దైవానుగ్రహములేక మడిసినను, లేక మనలను బందిఖానాలో నుంచినను, మంగమ్మను వాడు సులభముగా గ్రహింపవచ్చును కనుక మనమందఱమును



గలించుటయే మేలనిరి. అందులకందఱును సమ్మతించిరి. కనుక అందఱును తమతమఖడ్గములతో ఆబాలవృద్ధపర్యంతము బలవన్మరణము కావించుకొనిరి. అంతఃపురస్త్రీలు అగ్ని ప్రవేశమైరి. ఇంతటితో తంజావూరునాయడుగార్ల సంస్థానము మాసిపోయినది.

ఆమీద ఈ విజయరాఘవనాయడుగారి వంశీయులలో మంగమ్మయును, చెంగమలదాసనాయడును మిగిలిరి. చొక్కనాథనాయడుగారు మంగమ్మను వివాహముచేసికొనిరి. ఆతర్వాత చెంగమలదాసనాయడుగారికి తంజావూరురాజ్యములోని కొన్నిగ్రామములు చొక్కనాథనాయనివలన లభించినట్లు తెలియుచున్నది. ఈ చెంగమలదాసనాయనిని కొందఱు విజయరాఘవనాయడుగారి కొడుకనెదరు. మఱికొందఱు మనుమడనెదరు. ఈ చెంగమలదాసు విజయరాఘవనాయడు మొదలగువారు బలవన్మరణము చేసికొనుటకు యత్నించినకాలము సందొకదాదివలన కాపాడబడినవాఁడని తెలిసెడిని. అపుడువీనికివయసు 4 సంవత్సరములట.

---

## పదునొకండవ అధ్యాయము.

తంజావూరిలో నాయడుగార్లకు తర్వాత పట్టమునకువచ్చినవారు మహారాష్ట్రులు.

### తంజావూరు సంస్థాన మహారాష్ట్రరాజవంశావళి.

1. బాబాజిభోఁసలే— ఇతఁడు పునాకు సమీపమునందుండు 3 గ్రామములకు అధిపతి.
2. మాలోజి— నైజాంయొద్దనున్న ఉద్యోగస్థుఁడు.
3. భానోజి.
4. శాహాజి—1544. సం॥ జనించిరి. ఈతని భార్యలపేర్లు తుంగాబాయి మోహిని, జీజిబాయి.
5. జీజిబాయి— శాహాజిభార్య.

6. ఏకోజీ—(వెంకోజి) ఇతడే చెంగమలదాసు వశమునందున్న తంజాపూరిని అపహరించినవాఁడు.

7. సంతోజీ— వీఁడు లంజకొడుకు.

8. శాహోజీ— 1648-1711. వీనికి సంతతిలేదు.

9. శరభోజీ— 1711-1729. ఇతనికిని సంతతిలేదు.

10. తుక్కోజీ— 1729-1736.

11. బాబాసాహేబ్— 1736-1737. జనాబాయి భర్త.

12. శాహోజీ— 1749-1765. ఇతడు తన సహోదరుని జయింపనెంచి ఆంగ్లేయులతో సహవాసము చేసినవాఁడు.

13. ప్రతాపసింహ మహారాజు— ఇతఁడు లంజకొడుకు 1778 లో గతించెను.

14. తుల్జారాజు— 1765-1788. ఇతఁడు 1767 లో ఆర్కాడునబాబుతో జగడముచేసినవాఁడు.

15. అమరసింహమహారాజు— 1788-1898. ఇతఁడు వివేకములేనివాడు.

16. శరభోజిరాజు— 1798-1833. దత్తపుత్రుఁడు.

17. శివాజి మహారాజు— 1833-1855.

18. ముక్తాబాయి— కడపటిరాణి.

నాయడుగార్లకు తర్వాత పట్టమునకువచ్చిన మహారాష్ట్రిలలో ననేకులు స్త్రీలోలులైయుండిరి. ఇందుచేతనే 1857 సంవత్సరమున ఆంగ్లేయుల స్వాధీనమగుటకు హేతువయ్యెను. ఇపుడు మహారాష్ట్రి తంజావూరి రాజవంశీయులు ఇంగ్లీషు గవర్నమెంటువారివలన ఉపకారవేతనమును బడసియున్నారు.

---



## పండ్రెండవవ అధ్యాయము.

### మధురయందుండి పాలించిన నాయడుగార్ల సంస్థానము.

సీసమాలిక.

శ్రీవిష్ణుమూర్తికి చెలువయాలక్ష్మికి తమ్ముఁడై వెలసిన ధన్యచంద్ర,
వంశసంభవులైన వరమహాక్షత్రియులనియెడి శ్రీ గౌరియన్వయులయి,
పరగుచుండెడికోట బలిజవారనుపేర వ్యవహరింపుచునుండు వారలైన,
బహుళశ్రీపాండ్య భూపతులపరంపర వివరంబు తెలియుడి విశ్వమునను,
నాగమనాయఁడు నయవిశ్వనాథుఁడు పెద్దికృష్ణప్పయుపృథివియందు,
పెద్దివీరప్పనుపేరినాయఁడు విశ్వనాథుఁడు కృష్ణప్పనాయఁడుమఱి,
ఘనవిశ్వనాథుఁడు కస్తూరిరంగప్ప ముద్దుకృష్ణప్పయు ముఖ్యులైన,
స్థిరముద్దువీరప్ప తిరుమలనాయఁడు మంగమ్మవిజయరంగచొక్క,
నాథనాయఁడునుమీనాక్షమ్మ కడగాను పదునాల్గుమనువుల పాటిగాను,
పదునాల్గు ప్రభువులు ప్రజలకు మిత్రులై చెలువొంద రాజ్యంబుచేయు
చుండ్రి,

* * * * * * *

విజయనగరసంస్థానమును అచ్యుత దేవరాయలువారు పాలించు కాలంబున (క్రీ-పు-1559) పాండ్యనాడు నరపతి స్వాధీనమైనది. అపుడు విశ్వనాథనాయడుగారిని అచ్యుతరాయలవారు పాండ్యమండలమునకు ప్రతినిధిగా నియమించిరి.

### నాగమ నాయడుగారి వంశావళి.

| | |
|---|---|
| | క్రీ-పు. 1554 |
| 1. నాగమనాయడు | 1559 - 1563 |
| 2. విశ్వనాథనాయఁడు (1) | 1563 - 1573 |
| 3. కుమారకృష్ణప్పనాయడు | 1573 - 1395 |
| 4. పెద్దవీరప్పనాయఁడు, (2) విశ్వనాథనాయఁడు | 1595 - 1602 |
| 5. లింగప్పనాయడు, (3) విశ్వనాథనాయడు | 1602 - 1600 |
| 6. ముద్దుకృష్ణప్పనాయడు | 1600 - 1623 |
| 7. ముద్దు వీరప్పనాయఁడు | |

| | | |
|---|---|---|
| 8. | తిరుమలనాయఁడు | 1623 - 1659 |
| 9. | ముద్దు అళగసింగరినాయఁడు | 1659 - 1662 |
| 10. | చొక్కనాథనాయడు | 1662 - 1682 |
| 11. | రంగకృష్ణముద్దువీరప్పనాయఁడు | 1682 - 1686 |
| 12. | మంగమ్మగారు | 1686 - 1699 |
| 13. | విజయరఘునాథచొక్కలింగనాయఁడు | 1704 - 1741 |
| 14. | మీనాక్షమ్మగారు | 1741 - 1748 |
| 15. | బంగారు తిరుమలనాయఁడు | |
| 16 | విజయరఘునాథనాయడు | 1752 |

ఇట్లు నాయడుగార్లు పదునల్వురును, నాయడుగార్ల రాణులలో ఇద్దరును మధురను పాలించిరి.

పాండ్యమండలమును (మధురను) స్థాపించిన నాయడుగారిలో మొదటివారు విశ్వనాథనాయఁడుగారు. ఇతఁడెవరనఁగా,—విజయనగరములో సంస్థానముయొక్క ఉగ్రాణమునకు అధికారిగానున్న కోటయనాగమనాయడను పేరుగల నాగమనాయడు ఉగ్రాణాధికారిగానున్నతర్వాత, ఇతనికి విజయనగర సంస్థానముతోఁజేరిన 56 రాజ్యములయందుగల నలుబదివేల గుఱ్ఱపు పటాలమునకును, నాలుగువేల ఏనుగులపటాలమునకును, పదివేల ఒంటెల పటాలమునకును, మరియు ననేకవేలపదాతులును జేరిన పెద్దసైన్యమునకును ప్రధానదళకర్తఉద్యోగమును వహించియుండినదేగాక, తమ సొంతసంరక్షణముకొఱకై ఆఱువేల గుఱ్ఱపుపటాలమును, ఇరువదివేల పదాతులను నుంచుకొని వీనికగు వ్యయమునకై ఆర్కాడుమొదలు తిరువనంతపురముదాఁక గల సామంతరాజులవలన కప్పమును గొనుచు నుండిరి. ఇట్టి శూరుడైన నాగమ నాయనివారి శ్రీమంతపుత్రుఁడే ఈవిశ్వనాథనాయఁడుగారు.

నాగమనాయఁడుగారికి బహుకాలము సంతానము లేనందున కాశికిపోయి భార్యాభర్తలు మిగుల భక్తిచేసినందున సంతానముకలిగెను. అందుచేతనే యీతనికి విశ్వనాథనాయఁడని పేరిడఁబడెను.



ఈతఁడును మహాధీరుఁడును శూరుఁడునై యున్నందునను, విజయనగరసంస్థానముమీఁదికి దండెత్తివచ్చినట్టి మహమ్మదీయుల పొగరణచినందువలనను ఈతనికి 1535 సం॥ తండ్రివలె నీతనికిని విజయనగర సంస్థానమునందు సేనాధిపతి యుద్యోగమియ్యబడెను.

మధురయందున్న పాండ్యవంశీయుఁడైన చంద్రశేఖరపాండ్యుడు రాజ్యపాలనము చేయుచున్నపుడు, తంజావూరియందున్న వీరశేఖర చోళుడు మధురకుపోయి చంద్రశేఖరుని పదభ్రష్టునిచేయఁగా, దిక్కెవ్వరులేక చంద్రశేఖరుడు ఆనెగొందికిపోయి అచ్యుతదేవరాయనితో మొఱబెట్టఁగా, నతఁడు కరుణించి 1564 లో తనదళకర్తయైన నాగమ నాయనికి సైన్యమిచ్చి పంపించి చోళుని జయించి పాండ్యునికి రాజ్యమిప్పింపవలసినదని యుత్తరవుచేసెను. అట్లే నాగమనాయడుపోయి చోళునిజయించి తంజావూరిని స్వాధీనముచేసికొని, మధురను పాండ్యునకు అప్పగించక దానిని తనయొక్క స్వాధీనమునసే యుంచుకొనెను.

ఈసంగతి అచ్యుతదేవరాయలెఱింగి విశ్వనాథనాయడుగారిని బంపించెను. ఈతఁడు తండ్రియనెడి పక్షము వహింపక న్యాయ్యముగా రాజ్యమును మధురపాండ్యునకు అప్పగించివేసెను. ఈచంద్రశేఖర పాండ్యుడు కొంతకాలమే రాజ్యముచేసి గతించెను. చంద్రశేఖరపాండ్యుని కుమారుఁడు బాలుఁడైయుండెను. వీఁడును పట్టమునకువచ్చిన కొన్నాళ్లకే గతించినందున, ప్రజలయొక్క కోరిక మేరకు విశ్వనాథనాయడుగారినే, అచ్యుతరాయలు రాజుగానుండ నియమించెను.

---

## విశ్వనాథనాయడుగారి సంస్థానము.

క్రీ - పు - 1559 - 1563.

విశ్వనాథనాయడుగారు సుమారు తమ 40 ఏట మధుర పాండ్య సింహాసనము నలంకరించిరి. ప్రజలందఱును సంతోషమొందిరి. దేశమునంగల అంతచ్ఛిద్రములనంతయు బోఁగొట్టి ధర్మముతప్పక రాజ్య

మేలుచుండిరి. వీరికి మంత్రిగా హరినాయక మొదలారి అనువారుండిరి. ఈ హరినాయక మొదలారుగారెవరనఁగా:—

ఇతఁడు కాంచీపురముతోఁ జేరిన మెయ్ప్పేడు అనుగ్రామస్థుఁడైన వెలమకులజుఁడు. ఇతఁడు బీద కుటుంబమునందు జన్మించెను. బాల్యమున తల్లి పరుండబెట్టి నీటికిపోయినప్పుడు మంచిపామువచ్చి ఇతని శరీరమును చుట్టుకొని పడగను శిరసుపై గొడుగువలె నుంచుకొనియుండినది. ఇంతలో తల్లి నీళ్లెత్తుకొనివచ్చి చూచి భయపడి కుయ్యిడగా ఇరుగుపొరుగువారు ఆపామును ద్రోలివేసి, వీఁడు వయఃకాలమున గొప్ప పదవినందఁగలఁడని చెప్పిపోయిరి. అట్లే ఇతఁడు క్రమముగా వృద్ధి నొంది విజయనగరముచేరి నరపతులనాశ్రయించెను. ఒకప్పుడు అచ్యుతరాయలవారి సమ్ముఖమునకు బైటిదేశమందుండివచ్చిన మల్లునితో హరినాయక మొదలి మల్లయుద్ధముచేసి వానిని క్రిందబడద్రోసినందుచేత అచ్యుతరాయలు మెచ్చికొని యీతనికి దళకర్తయుద్యోగమిప్పించెను. ఈ మొదలారి విశ్వనాథనాయడుగారితోడనే యున్నందున ఆతనితో నీతడును మధురచేరి, అదిమొదలు మంత్రిపదవిని వహించెను.

విశ్వనాథనాయడుగారును హరినాయక మొదలియారును మిగుల స్నేహముతో వర్తించుచుండిరి. వీరిర్వురునుచేరి చేసిన ధర్మకార్యములేవియనఁగా:—

మధురలో పాండ్యుల కోటకొత్తళములను జీర్ణోద్ధారణముచేసి రెండుగోడల కోటను కట్టించిరి. గుళ్లు గోపుర సోపానములను జీర్ణోద్ధారణముచేసిరి. అనేక దేవాలయములను అగ్రహారములనునిర్మించిరి. వైఘనదికి ఆనకట్ట కట్టించిరి. రామేశ్వరము శ్రీరంగము ఈప్రాంతములకు బోవుటకు బాటలు ఏర్పాటుచేసి అక్కడక్కడ గాట్లునుపెట్టి దొంగలభయమును బోగొట్టిరి. తిరుచినాపల్లిలో కోటనుగట్టిరి. శ్రీరంగము మొదలుగా అనేక విష్ణ్వాలయములను శివాలయములను జీర్ణోద్ధారణము చేయించిరి. శ్రీరంగమునందనేకాగ్రహారములను కట్టి బ్రాహ్మ



ణులకిప్పించిరి. విశ్వనాథనాయడుగారికి కప్పమిచ్చుటలేదని యెదిరించిన తిరునెల్వేలి పాళేగారునుజయించి ఆదేశమును స్వాధీనముచేసికొని అచ్చట అనేకదేవాలయాది ధర్మకార్యములుచేసినదేగాక తామ్రపర్ణీ నదికి ఆనకట్ట కట్టించిరి. అపుడపుడెదురించుచున్న పాళేగార్లందఱిని మట్టుపఱిచి స్వాధీనముచేసికొని వారిచే కప్పములనుగొనుచు మహాపరాక్రమముతో నాయడుగారును మొదలారిగారును కీర్తిగాంచుచుండి క్రీ-పు. 1563 సంవత్సరమునందు పరమపద మలంకరించిరి.

ఆతర్వాత విశ్వనాథనాయని కుమారుఁడు కృష్ణప్పనాయడుగారు మధురకు మహారాజులైరి.

---

### కృష్ణప్పనాయడుగారి సంస్థానము.

### క్రీ-పు. 1563-1573.

విశ్వనాథనాయడుగారి కుమారుఁడైన నీతనికి కుమారకృష్ణప్పనాయడనియును, పెద్దకృష్ణప్పనాయడనియును, కృష్ణప్పనాయడనియును పేర్లుకలవు. ఇతనికి శాస్త్రోక్తప్రకారముగా పట్టాభిషేకము చేయఁబడెను. వీరికిని హరినాయక మొదలారియె మంత్రిగానుండిరి. ఈకృష్ణప్పనాయడు మహాధీరుడును శూరుడునై యున్నందున నీతనిపై దండెత్తి వచ్చినవారి తలలను నరికించెను.

ఇట్లుండగా మధురనాయడుగార్ల సంస్థానమును మట్టుపఱచుటకై లంకతోఁ జేరినట్టి ఖండిలోనున్న రాజు ప్రయత్న పడుచుండు సంగతి నెఱింగి, సైన్యముతోడ ఖండికిపోగా, ఖండిరాజు భయపడి పోర్తుగీసువారి సహాయమునుబడసి, మరికొందఱు సింహళులనుజేర్చుకొని యుద్ధమునకు వచ్చినాడుగాని, నాయడుగారిసైన్యముతో యుద్ధముచేయుటకెవరికినిసాధ్యపడక అనేకులు యమపురినిజేరిరి. తుదకు కృష్ణప్పనాయని తుపాకిదెబ్బచేత ఖండిరాజు కూలెను.

ఆమీఁద కృష్ణప్పనాయడుగారు తమ బావమరిదియైన విజయభూపాలనాయడుగారిని ఖండిరాజ్యమునకు రాజుగానియమించిరి. అది మొదలు ఖండిరాజ్యమును నాయడుగార్లవశమైపోయినది.

---

లంక ఖండిరాజసంస్థానము.

* * * * * * * * * *

సీసమాలిక.

అరయలంకాద్వీపమైన సింహళచక్రవర్తిపరంపర వసుధవినుఁడి,
లక్షణవిజయపాలనమహారాజు శ్రీయంగదాంకితరాజు నమలకొండ,
సాలమహారాజు జగతియందునుకీర్తిసింహమహారాజు శ్రీకరుఁడగు,
రంజిల్లురాజాధిరాజసింహుఁడుమఱి విక్రమసింహుఁడు వీరవరులు,

గీ. ఆఱుగురుచక్రవర్తులు సొభ్గురవలె
పదికినొకపాలు కప్పంబు ప్రజలవలన,
తీసికొనిరాజ్యమేలిరి దిశలు వెలుఁగ
ననుచుపెద్దలు నుడువుదు రతిశయముగ.

లంకలోని ఖండియందు, 1 విజయభూపలమహారాజు, 2 అంగదాంకితమహారాజు, 3 కొండసాలమహారాజు, 4 కీర్తిసింహమహారాజు, 5 రాజాధిరాజ సింహమహారాజు, 6 విక్రమసింహమహారాజు, అనునీయాభ్గురు రాజులు ఒకరివెనుక నొకరుగా షట్చక్రవర్తులవలె పాలించుచుండిరి. తుదకిది ఆంగ్లేయులవశమైనది. ఇపుడు విజయపాలనాయడుగారి వంశీయులుకొందఱు తంజావూరు మధుర మొదలగుచోటులలో వసించుచు ఆంగ్లేయులవలన నిప్పించబడు ఉపకారవేతనముతో కాలము గడపుచున్నారు.

---



పెద్దవీరప్పనాయడు, 2-వ విశ్వనాథనాయఁడుగార్ల సంస్థానము.

క్రీ - పు - 1573 - 1595.

కీర్తిశాలియైన కృష్ణప్పనాయడుగారికి తర్వాత ఇతనికొడుకులు 1 పెద్ద వీరప్పనాయడును, 2 రెండవ విశ్వనాథనాయడును మధురను పాలించిరి. వీరికాలమునందును హరినాయక మొదలారుగారే మంత్రిగానుండిరి.వీరును శూరులుగానుండి దుర్మార్గులనుమట్టుపఱిచి అనేక ధర్మకార్యములుచేసినదేగాక తిరుచినాపల్లికోటను బందోబస్తుచేసి, చిదంబరములో క్రొత్తగా నొకకోటనుకట్టించి పరమపదమలంకరించిరి.

---

లింగప్పనాయడు, 3వ విశ్వనాథనాయడుగార్ల సంస్థానము.

క్రీ - పు - 1595 - 1602.

పెద్దకృష్ణప్పనాయడుగారికుమారులైన లింగప్పనాయడుగారును, విశ్వనాథనాయడుగారును, పట్టమునకువచ్చిన కొంతకాలమునకు, మధురలో వేయికాళ్లమంటపమును, చోళవందాను గ్రామములో కోటను దేవాలయమును అగ్రహారమును కట్టించినవారును, మహామేధావంతుడునైన హరినాయక మొదలారు క్రీ - పు - 1600 లో గతించిరి. ఇందుచేత ఈ యిర్వురునాయడుగార్లకంటె ముందు రాజ్యమునేలినవారివంటి కీర్తి ప్రతిష్ఠలు వీరికికలుగక సామాన్యులవలెనుండవలసివచ్చెను. అయిననువీరును పూర్వవాసన ననుసరించి మంచివారుగనే ప్రజలపట్ల వర్తించుచుండి పరమపదముజేరిరి.

---

ముద్దుకృష్ణప్పనాయడు సంస్థానము.

క్రీ - పు - 1602 - 1609.

లింగప్పనాయనికుమారుఁడు ముద్దుకృష్ణప్పనాయడు పట్టమునకు వచ్చెను. ఇతనిపినతండ్రియైన కస్తూరిరంగప్పనాయడుగారు ధనాశచేత ముద్దుకృష్ణప్పనాయనిని చెఱయందుంచి తానే మధురకు రాజని చాటించెను. తోడనే ముద్దుకృష్ణప్పనాయని మిత్రులు కస్తూరిరంగప్ప

నాయనిని శిరచ్ఛేదము చేసివేసి ముద్దుకృష్ణప్పనాయడుగారినే పట్టమునకు అధిపతులనుగా జేసిరి. ఇతఁడును ధర్మముతప్పక రాజ్యము నేలి గతించెను.

---

### ముద్దువీరప్పనాయడుగారి సంస్థానము.

#### క్రీ - పు - 1609 - 1623.

ముద్దుకృష్ణప్పనాయడుగారికి తర్వాత వారి జ్యేష్ఠపుత్త్రుఁడు ముద్దువీరప్పనాయడుగారు పట్టాభిషిక్తులైరి. ఇతఁడు తంజావూరు, మైసూరు మొదలగు రాజులతో యుద్ధముచేసి జయమొందెను. ఇతని కాలములోనే మధురలో క్రీస్తుగుడి కట్టఁబడెను.

---

### తిరుమలనాయడుగారి సంస్థానము.

#### క్రీ - పు - 1623 - 1659.

ముద్దువీరప్పనాయడుగారికి తర్వాత ఆతని సోదరుఁడైన తిరుమలనాయడుగారు సింహాసనాధిపతులైరి. ఇతనిపూర్వులు తఱుచుగా తిరచినాపల్లియందుండియే రాజ్యము చేయుచుండిరి. ఇతఁడుమాత్ర మట్లుగాక మధురయందుండియే రాజ్యమేలుచుండిరి. వీరు మధుర మీనాక్షి సోమసుందరేశ్వరులకు సమర్పించిన నవత్నాభరణములు మొదలగునవి చాలాగలవు. ఇవిగాక గోపురప్రాకారమంటపాదులను, కోటకొత్తళములను నూతనముగా నిర్మించిరి. ఇంకను అనేకములైనగుంటలు మొదలగువానికి సోపానములు నిర్మించిరి. నేటికిని మధురయందు తిరుమలనాయడుగారు వసించినకోటయు, వారు తమ యిష్టముచొప్పున నిర్మించిన మహాలునుచూచి ఆనందించుచున్నారు. వీరికి ఇన్నూఱ్గురు భార్యలుగలరు. ఈతని కాలములోనే క్రీస్తువులకు బంజరుభూము లొసగబడి వారిని రైతులుగా జేసిరి.

తిరుమలనాయడుగారికి ముందు రాజ్యమేలుచున్న నాయడుగార్లందఱును ఆనెగొంది నరపతిరాజులకు లోఁబడియుండిరి. ఇతడుమాత్రము



వారికి లోఁబడక అనేక సైన్యమును చేర్చుకొని స్వతంత్రరాజై రాజ్యము నేలుచుండెను. ఇట్లుండగా మైసూరు రాజు లొకప్పుడు మధుర నాయడు సంస్థానమువారివలన అవమానమును చెందియుండిరి. ఆవిరోధముచే చామరాజ ఒడయర్ మధుర తిరుమలనాయడుగారిమీఁద దండెత్తివచ్చి దిండిగల్ మొదఁగు ప్రాంతములలో ననేక గ్రామాదులను కొల్లగొట్టి చాలా ధనమును గైకొనిపోయి మైసూరుచేరిరి. ఈసంగతిని తిరుమలనాయడుగారు విని కోపముజెంది సైన్యమును గూర్చుకొని పోయి మైసూరుకోటను ముట్టడించి, మైసూరురాజులవలన తమదేశమునందు కొల్లగొనిపోయిన ధనమును, యుద్ధవ్యయమునకైన ధనమును, గ్రహించుకొని సమాధానముచేసికొని జయముతో మధుర చేరిరి.

ఇట్లు మహాపరాక్రమముతో మధురను పాలించుచుండు కాలమునందు మహమ్మదీయులు ఉత్తరదేశములోనంతయు కొల్లగొట్టి సంస్థానములనంతయు పాడుచేసివేసి మధురకోటను ముట్టడించిరి. అపుడు తంత్రవాదియైన తిరుమలనాయడుగారు వృథాగా జననష్టమేల కలుగఁజేయవలయుననియెంచి ఆతురకలకు కొంతధనమిచ్చి వారిని పాఱద్రోలిరి.

మఱొకప్పుడు మైసూరురాజు సైన్యమును బలపఱచుకొని ముందటిపగను సాధింపఁదలంచి మధురమీఁదికి దండెత్తగా అపుడు రామనాథపురం జమీందారుగారు తిరుమలనాయడుగారికి సహాయముగా సైన్యమును తీసికొని వచ్చిరి. ఆకాలమునందు రామయ్య అనెడి బ్రాహ్మణుడు తిరుమల నాయుడుగారి సైన్యమునకు అధిపతిగా నుండెను. ఈతనికి మైసూరువారు విశేష ధన మిచ్చి వశ పఱచుకొనిరి. ఈ సంగతి నెఱింగిన రామనాథపురము సేతుపతి తత్క్షణమే రామయ్యను పట్టి చెఱయందుంచి, యుద్ధము చేయందొడంగినంత, మైసూరివారు చెప్పకనే చెల్లాచెదరై పఱుగిడి పోయిరి. రామనాథపురము సేతుపతిగారు చేసిన మోహనతుకై తిరుమల నాయడుగారు అనేక బహుమానములను చేసిరి.

ఇట్లు మైసూరివారు పోవునపుడు తిరుమలనాయడుగారి సైన్యములో జేరినవారియొక్కయు, మరియు పాండ్యమండలముతో జేరిన ప్రజలయొక్కయు ముక్కులను కోయుచు పోవుచుండిరి. ఈ సంగతిని తిరుమల నాయడుగారు విని మహారోషమొంది తమ తమ్ముడైన కుమారముద్దువీరప్పనాయడుగారిని దళకర్తగా నియమించి, వీరికి సహాయముగా రంగన్న నాయడుగారిని పంపించి మైసూరురాజు ముక్కును తేవలసినదని ఉత్తర వీయగా, అట్లే వారు మైసూరికి పోయి కోటను ముట్టడించి మైసూరురాజును చెఱపట్టి, ఆ రాజుయొక్కయు, మరియు ఆరాజుయొక్క ఉద్యోగస్థులయొక్కయు ముక్కులను గోసి తెచ్చిరి.

ఇవ్విధముగా మహాశూరత్వముతో ప్రజాపాలనము చేయుచు కీర్తిప్రతిష్ఠలుగాంచి అనేక ధర్మ కార్యములుచేసిన తిరుమలనాయడుగారు 36 ఏండ్లు రాజ్యమేలి 1659 సం॥ పరమపదము సలంకరించిరి. ఈతని సంస్థానమునం దనేక పండితు లుండిరి. వారిలో పిళ్లపెరుమాళయ్యంగారు అను ద్రావిడపండితులు మహాప్రసిద్ధులు. ఈ అయ్యంగారు రచియించిన అష్టప్రబంధమనెడి ద్రావిడగ్రంథము నేటికిని మిగుల ప్రశస్తముగా నున్నది.

—*—

## ముద్దుఅళగసింగరినాయడుగారు.

### క్రీ - పు - 1659 - 1662.

తిరుమల నాయడుగారికితర్వాత వారి కుమారుడైన ముద్దు అళగసింగరినాయడుగారు పట్టమునకు వచ్చిరి. ఈతనికాలములోనే 'రాబర్టునోబిల్ బస్' అను నతఁడు బ్రాహ్మణ వేషమును బూని క్రీస్తు మతమును బోధించి అనేకులను క్రీస్తువులనుగాఁ జేసినాఁడు. ఆ కాలమునందు మహామదీయులు దక్షిణ దేశమునకు యుద్ధమునకువచ్చి తంజావూరు మొదలగు ప్రాంతములను పాడుచేసివేసి తిరుచినాపల్లికి పోయి ముట్టడి వేసిరి. అపుడు ముద్దుఅళగసింగరినాయడును, సేనాధిపతియైన



లింగమనాయడును మహారోషముతో మహమ్మదీయులను ఎదిరించినంత వారు తమజపమునసాగక మరలి పోయిరి. ఈముద్దుఅళగసింగరినాయడుగారు విశేష స్త్రీలోలుఁడై నందున తత్సంబంధమైన సుఖ వ్యాధిచేత నే గతించిరి.

—*—

## చొక్కనాథనాయడుగారు.

### క్రీ - పు 1662 - 1682.

ముద్దు అళగసింగరినాయడుగారికి తర్వాత ఆతని కుమారుఁడు చొక్కనాథనాయడు పట్టమునకువచ్చెను. ఆకాలమునం దీతనికివయస్సు సుమారు 16 ఏండ్లుండెను. కనుక ప్రధానియు, రాయసమును, అగు ఇద్దరు బ్రాహ్మణులు రాజ్యపాలనము చేయుచునుండిరి. తుదకు వీరిద్దరును అత్యాశగలవారై నందున లోకకంటకులై అక్రమములుచేయఁదలఁపెట్టిరి. ఇంతేగాక శత్రువులకు సహాయముచేయుచుండిరి. రాజుతో నెవ్వరును మాట్లాడకూడదని కట్టుదిట్టముచేసిరి. ఇట్లు వీరుచేసినందున యుక్తిశాలియైన చొక్కనాథనాయడుగారు తనమిత్రులతో నీసంగతుల నంతయు చెప్పియుంచి మంత్రియును రాయసమును జాతిలో బ్రాహ్మణులేమైనను, చండాలురకంటె నీచగుణములుగల వీరిద్దరునుజీవించియున్నచో సంస్థానమే పేరులేకపోవునని యెంచి చిత్రవధచేసి చంపివేసి చిన్నతంబి మొదలారిని మంత్రిగా నియమించుకొనిరి.

ఇట్టికాలమునందు తురకలు కొండలు యుద్ధమునకువచ్చిరి. వారినందఱిని చొక్కనాథనాయడుగారు తరిమివేసినదేగాక, కొండలు తురకలు తంజావూరురాజు నాశ్రయించి దాగియుండిరి. ఆమీఁద తంజావూరికి సైన్యమును గూర్చుకొనిపోయి తురకలను పాఱద్రోలినమీఁద తంజావూరునాయడు భయపడి దాసానుదాసుడైనాఁడు. కొన్నాళ్లతర్వాత చొక్కనాథనాయడుగారికి వివాహముచేయవలయునని వారిబంధువులు ప్రయత్నించగా, అదివఱకే తంజావూరునాయడుగారికుమార్తె మంగమ్మ

మహాసౌందర్యవతియని వినియున్న చొక్కనాథనాయడుగారు ఆమెనే వరింపగలవాఁడనని చెప్పఁగా, వారు తంజావూరుపోయి విజయరాఘవ నాయడుగారితో చెప్పగా నాతడు సమ్మతింపనందున, చొక్కనాథ నాయడు యుద్ధముచేసియైనను మంగమ్మను పరిగ్రహింపనెంచి బయలు దేరెను. ఈవర్తమానమును విన్న తంజావూరురాజైన విజయరాఘవనా యడు బంధువులతోఁడ ఆత్మహత్య గావించుకొనెను. ఆమీద చొక్క నాథనాయడు మంగమ్మను వరించి సుఖముగా కాలముగడుపుచుండెను.

ఇట్లుండగా కొందఱు దుష్టులుచేరి చొక్కనాథనాయడుగారి తమ్ముడు ముద్దు అళగసింగరినాయనిని వశపఱచుకొని నాతనికే రాజ్య పట్టాభిషేకము చేయవలయునని యెంచి తుదకెట్లో ఒకవిధముగా నాత నినే రాజుగాజేసినమీద ఈదుష్టులందఱును కొల్లగొట్టితిననారంభించిరి. ఈ ముద్దు అళగసింగరినాయనికి మంత్రిగానున్న గోవిందయ్యఅను బ్రాహ్మ ణుడు చొక్కనాథనాయనిని చంపదలంచి యుండెనుగాని కార్యము కొన సాగలేదు. ఆమీద తంజావూరి రాజులను పురికొల్పి అక్రమములు చేయ మొదలుపెట్టెను. ఇట్టిసమయమున ఏకోజి అను మరాటిరాజు తలయెత్త నారంభించి తంజావూరికి తానే రాజై మధురతోచేరిన కొన్ని కోటకొత్తళములనుగూడ స్వాధీనము చేసికొనెను.

ఈరీతిగా పలువిధములగు కష్టములు చొక్కనాథనాయడుగారికి గోవిందయ్య మొదలగువారివలన సంభవించెను. ఈవ్యసనముచేతనే మనోవ్యాధి బలమై స్వర్గలోకము చేరెను.

---

## రంగకృష్ణముద్దువీరప్పనాయడుగారు.

### క్రీ - పు 1682 - 1686.

చొక్కనాథనాయడుగారు గతించినమీద వారి కుమారుడైన రంగకృష్ణముద్దువీరప్పనాయడుగారికి 16 ఏండ్లుగా నుండినను ప్రజ లందఱు నీతనినే రాజుగా చేయదలంచి పట్టాభిషేకము చేసిరి. ఇతనికి



20 సంవత్సరములు కాగానే మహాబుద్ధిశాలియను పేరుతో రాజ్యము చేయుచునుండెను. లోకులందఱును సంతసమందుచుండిరి. ఇట్టి కాల మున డిల్లిలోనుండి పాదుషాగారి జోళ్లువచ్చెను. ఏలనఁగా, డిల్లిలో క్రొత్తగా పాదుషా పట్టమునకు వచ్చినదే ఆపాదుషాయొక్క జోళ్లను పల్లకిలోనుంచి ప్రతి సంస్థానమునకును పంపగా, ప్రతిసంస్థానమువారును ఆజోళ్లను తమ సింహాసనముమీదనుంచి పూజించి నమస్కరించి పంపు వాడుకకలదు. అట్లే క్రొత్తపాదుషా డిల్లికిరాగానే వాడుకప్రకార ముగా జోళ్లను తీసికొనివచ్చుచు అక్కడక్కడగల సంస్థానములలో నంతయు మర్యాదలు చేయబడి మధురకు తీసికొనివచ్చి రంగకృష్ణ ముద్దువీరప్పనాయడుగారికి యీసంగతిని తెలిపిరి. ఆనాయడుగారు దాని తెచ్చినవారిని సంస్థానములోనికిం గొనిరమ్మని చెప్పి ఆజోళ్లను కాళ్లలో తొడుగుకొని వచ్చినవారినందఱిని కొట్టి పంపించిరి. అదిమొ దలు డిల్లిపాదుషాలు ఈ అక్రమమైన జోళ్లపూజను నిల్పివేసిరి. ఇట్టి శూరుడైననీతడు స్ఫోటకవ్యాధిచే శీఘ్రకాలమున పరలోకమునకేగెను.

---

## రాణి మంగమ్మగారు.

### క్రీ - పు 1686 - 1699.

రంగకృష్ణముద్దువీరప్పనాయడుగారు పరలోకవాసులైనప్పుడు వీరిపత్నిగారు గర్భముగానుండిరి. భగవత్కటాక్షముచే నీమె పురుష శిశువునే కనెను. వీనిపేరు విజయరఘునాథచొక్కలింగనాయడు. ఈ బాలునకు 2 వ మాసములోనే మధురరాజ్య పట్టాభిషేకము చేసిరి. అయినను వీనికిబదులుగా వీనిఅవ్వ (చొక్కనాథనాయడుగారి భార్య యు, రంగకృష్ణముద్దువీరప్పనాయడుగారి తల్లియునైన) మంగమ్మగారే రాజ్యపాలనము చేయుచుండిరి.

ఈమె హిందువులకేగాక క్రీస్తువులకును, మహమ్మదీయులకును ఉపకారిణియై ధర్మముతో రాజ్యమును పాలించుచు ధైర్యవతియను పేరుతో స్వర్గలోకవాసియాయెను.

---

## విజయరఘునాథచొక్కలింగనాయడుగారు.

క్రీ-పు- 1704 - 1741.

మంగమ్మగారు గతించినమీఁద యుక్తవయస్సులోనున్న రంగకృష్ణముద్దు వీరప్పనాయడుగారి కుమారుఁడు (పుట్టిన రెండవనెలలోనే రాజ్యాధిపతియైన) విజయరఘునాథ చొక్కలింగనాయడుగారు పాలింపనారంభించిరి. ఇతనికి విజయరంగ చొక్కలింగనాయడనియు పేరుకలదు. ఇతడు సదా గోపుర ప్రాకార మంటపాదులను కట్టించుట మొదలుగాగల ధర్మకార్యములయందే కాలమును గడపుచు రంగనాయకుఁడే గతియనినమ్మి ఏకాంతముగా నాతనినే ధ్యానింపుచుండి సుఖముగా పరపదము నలంకరించిరి.

---

## రాణి మీనాక్షమ్మగారు.

క్రీ-పు- 1731 - 1738.

విజయరఘునాథచొక్కలింగనాయడుగారికి సంతతి లేనందున నీయన భార్యయైన మీనాక్షమ్మగారు రాజ్యమును పాలింపఁదొడంగిరి. మరియు తిరుమలనాయడుగారి వంశీయుఁడైన నొకనిని స్వీకారము చేసికొనిరి. అపుడు దళవాయి వేంకటాచారి మొదలగువారికి యీ స్వీకారము తృప్తిగాలేదు. వేరే మరొకరికి రాజ్యము రావలసియున్నదని వాదింపదొడంగిరి. ఇందుచే కలహములు వృద్ధియై సంస్థానమున కతుకులేర్పడెను.

ఇట్టిసమయముననే చందా సాహెబు దక్షిణముమీఁదికి దండెత్తి మధుర మొదలగు ప్రాంతములలోని చాలా భాగములను స్వాధీనము చేసికొనినదేగాక, మీనాక్షి అమ్మను చెఱయందుంచ దలంచెను. ఈ సంగతినంతయు తెలిసినమీఁద నిఁక ప్రాణము నుంచఁగూడదని యెంచి మహామానవతియు పతివ్రతయునైన నీమె పాషాణమును ద్రిని ప్రాణములను విడిచెను.

---



అమీఁద ఈ మొదట పుత్త్రుని తండ్రియైన బంగారుతిరుమలనాయడుగారు సంస్థానమును స్వాధీనముచేసికొనదలంచి, అప్పుడు ప్రబలులైయున్న "సతారా" మహారాష్ట్రుల కడకుపోయి మొఱబెట్టుకొనఁగా, వారు అభయప్రదానముచేసి, దక్షిణమునకు దండెత్తివచ్చి చందాసాహేబునుపట్టి తీసికొనిపోయి సతారాలో చెఱయందుంచిరి. ఇట్లు వాగ్దత్తముచేసిన సతారా మరాటావారు మధురను బంగారు తిరుమలనాయడుగారికి అప్పగించనందున, నాయడుగారు నైజామువారియొద్దికిపోయి మొఱబెట్టుకొనిరి. అపుడు నైజాం చాలా వ్యసనముచెంది, తమవలన ఆర్కాడులో నియమింపబడియున్న అన్వర్ ఉద్దీన్ ఖానుకు బంగారుతిరుమలనాయడుగారిని ఆతని కుమారుని అప్పగించి, వీరిర్వురికిని ప్రతినిత్యమును 400 రూపాయ లిచ్చునట్లును, శీఘ్రముగనే మధురను వారివశము చేయవలసినదనియును చెప్పిపంపెను. ఈ అన్వర్ ఉద్దీన్ ఖాన్ కొన్నాళ్లి విధముగనే యిచ్చుచుండి, మధురను వీరికిప్పించుటకు మనసొప్పనివాఁడై బంగారుతిరుమలనాయనికి పాషాణమిచ్చి 1748లో చంపివేసెను. ఈ వృత్తాంత మెఱింగిన నతని కుమారుఁడు పఱుగిడిపోయి శివగంగతో జేరిన వెల్లికురిచ్చి చేరెను.

ఇత్యాది అసంభవములచేత మధురకు 1741 మొదలు నాథుఁడు లేకుండెను. ఆమీఁద శివగంగ జమీందారును, రామనాథపురము సేతుపతియునుగూడి బంగారుతిరుమలనాయని కుమారుఁడైన విజయకుమారనాయడుగారికి మధురను 1752లో పట్టముగట్టిరి. అయినను ఈ విజయకుమారనాయడుగారిని, అదే సంవత్సరములోనే, తురకలు వెల్లికురిచ్చికిపోవునట్లుచేసివేసి, మధురను ఆక్రమించుకొనిరి. ఈ మహమ్మదీయులలోనే కలహములుగల్గి పోరాడుచుండగా 1785 సం॥ మున మధుర ఆంగ్లేయులవశమైపోయినది. అది మొదలు దేశోపద్రవములుతీరి ప్రజలకు సౌఖ్యముకల్గినది.

---

ఈ ప్రకారముగా చంద్రవంశక్షత్రియకులతిలకులైన యయాతి యొక్క సంతతివాడైన బలిజరాజవంశీయులైన ఆంధ్రరాజులు మగధ దేశమును విడిచి దక్షిణమునకువచ్చి ఉజ్జయిని, ఓరంగల్, కొండవీడు, కల్యాణనగరము, విజయనగరము (ఆనెగొంది), మొదలగు ప్రదేశములయందు, విక్రమార్క, చాలుక్య, కాలచమార్య, గజపతి, నరపతి మొదలగు పేరులతో సంస్థానములను స్థాపించి పాలించిరి. తద్వంశస్థులైన చేవప్పనాయడు మొదలగువారు తంజావూరు (చోళదేశ) రాజులుగాను; విశ్వనాథనాయడు మొదలగువారు మధుర (పాండ్యదేశ) రాజులుగాను; విజయభూపాలనాయడు మొదలుగాగలవారు లంక (సిలోన్=సింహళము) రాజులుగాను పాలించుచుండిరి.

కాలవ్యత్యాసముచేతను కలిధర్మప్రాబల్యముచేతను చంద్రవంశ ఆంధ్రక్షత్రియ బలిజవారు పదచ్యుతులైపోయిరి. ఇందుచే హీనజాతి వారందఱును తామే బలిజవారనియును, గౌరవులనియును పేర్లుపెట్టుకొని నాయడులను పేరుతో వ్యవహరించుకొనుచున్నారు.

---

## పదుమూడవ అధ్యాయము.

ప్రకృతమున మధుర ఇంగ్లీషువారి స్వాధీనమై జిల్లాగానున్నది. ఈ జిల్లాలో పాళేగార్లును జమీందార్లును చాలమందియున్నారు. వారిలో పాళేగార్ల కొందఱిని యిట వ్రాయఁబడుచున్నది.

1 ఏచ్చక్కనాయక్కనూరు, 2 దేవారం, 3 బోడినాయక్కనూరు, 4 కండప్పనాయక్కనూరు, 5 దేవాదానపట్టి, 6 దొడ్డియక్కోట, 7 నిలకోట, 8 అమ్మయనాయక్కనూరు, 9 అంబలత్తారు, 10 తపసుమేడ, 11 యమకాలపురం, 12 మరవనాడు, 13 చొక్కంపట్టి, 14 పల్లియప్పనాయకనూరు, 15 ఇడయకోట, 16 మాంపరై, 17 విరూపాక్షి, ఇవి పాళేగార్ల నెడు పేరుగల చిన్న జమీందార్లుండు ప్రధానగ్రామములు. వీరందఱును కంబళజాతిలో చేరినవారు. వీరికందఱికిని "నాయక్కర్" అను బిరుదు పేరుకలదు.

---



18. కోంబి:— ఈ పాళేగారికి "కవుండర్" అను బిరుదుపేరు కలదు. ఇతఁడును కంబళజాతిలో చేరిన యతఁడే.

19. ఎరియోడు:— 20 మాదూరు:— ఈ ఇద్దరుపాళేగార్లును "నాయడు" అను బిరుదుపేరుగల బలిజవంశీయులు.

21. పళని:— 21 అయక్కుడి:— ఈ ఇద్దరుపాళేగార్లును వేటవాండ్ర వంశీయులు; అనగా శబరజాతిలోఁ జేరినవారు. వీరికిని "నాయక్కర్" అను బిరుదుపేరుగలదు.

---

ఇఁక పెద్దజమీందార్ల కొందఱిని యిట వ్రాయఁబడుచున్నయది.

### వడకరై జమీందారు.

ఈ వడకరై జమీనును స్థాపించిన యతఁడు రామభద్రనాయఁడు. ఇతఁడు మున్ను చెప్పఁబడిన విశ్వనాథనాయని తండ్రియైన నాగమనాయనియొద్ద సైన్యాధిపతిగానుండెను. నాగమనాయడు చోళరాజ్యముపై దండెత్తినపుడు రామభద్రనాయడుగారు చాలా సహాయముచేసినందునను, నాగమనాయడు కాశికిపోయినపుడు ఆతనికి బదులుగా విజయనగర సైన్యమునకు దళకర్తగానుండి కార్యమును చక్కగా నిర్వర్తించుచుండినందుచేతను, నాగమనాయడుగారు ఈ జమీనును నిచ్చిరి. అది మొదలు వీరి వంశీయులచే పాలింపఁబడుచున్నయది.

---

### ఎట్టియాపురం జమీన్‌దారు.

ఈ జమీందారికి మధురజిల్లాలోను తిన్నెవల్లి జిల్లాలోను గ్రామాదులున్నవి. ఈ యెట్టియాపురం తిన్నెవల్లి జిల్లాలోనున్నది. ఈ సంస్థానమునకు మూలపురుషుఁడైన ఎట్టియప్పనాయడు సుమారు 1500 సం॥ మున కీవల విజయనగరమునకేగి నరపతులవలన శూరుఁడని పేరెన్నికఁగాంచి వారివలన నీ సంస్థానమును బొందెను. అందుచే నీ గ్రామమునకు ఎట్టియాపురమని పేరుగలైను.

మఱియు మధురలో నాయుడుగార్ల రాజ్యభారకాలమునందు సహాయముచేసిన కొండఱికి జహగీర్లు ఇప్పించఁబడెను. వారందఱు నిప్పుడు సంస్థానాధిపతులైరి. అట్టివారిలోఁ గొందఱిని యిట వ్రాయఁబడుచున్నయది.

రామనాథపురం. సేతుపతి సంస్థానము.

ఈ సంస్థానాధిపతులు మరవజాతిలోఁ జేరినవారు. రామేశ్వరమునకు సమీపమునంగల సేతువు మొదలగు ప్రాంతములకు అధికారులగుటచేత ‹‹సేతుపతి›› అను బిరుదుపేరుకల్గియున్నది. ఈ సంస్థానము వారు బహుకాలముగనే మంచి కీర్తి ప్రతిష్ఠలుగాంచినవారును, చోళ పాండ్యరాజులకు సహాయముచేసినవారునై యున్నారు. సుమారు క్రీ-పు. 1070 సంవత్సరములనుండి యీ సంస్థానము ప్రబలముగానున్నది. ఆ కాలమునుండి యీ కాలముదాక ధర్మ విషయముగను, విద్యావిషయముగను వేలకొలది ధనమును వ్యయముచేయుచున్నారు. ఏసంస్థానములోను ఇట్లు విద్యావిషయముగా నేటిదాక చేయుచుండుట వారగపడలేదు.

శివగంగ సంస్థానము.

ఈ సంస్థానము రామనాథపుర సంస్థానమునందుండి విభజింపఁబడినది. ఈ సంస్థానాధిపతులును మరవజాతిలో జేరినవారేయైనను వీరికి ‹‹దేవర్›› అను బిరుదునామము చెల్లుచున్నది. ఈ సంస్థానము సుమారు క్రీ-పు. 1720 లో గల్గినది.

పుదుకోట సంస్థానము.

ఇది మున్నొకకాలమున తంజావూరు సంస్థానమునకుఁ లోఁబడియుండెను. పిమ్మట ఈ సంస్థానాధిపతులుచేసిన మెహనతు కొఱకై సుమారు క్రీ-పు. 1600 లో ఇప్పించఁబడెను. ఈ సంస్థానాధిపతులు మరవజాతిలోఁ జేరినవారేయైనను వీరికి ‹‹తొండమాన్›› అను బిరుదనామముకలదు.

శ్రీరస్తు.

పదనాలుగవ అధ్యాయము.

# బలిజవంశ గృహనామాది వివరణము.

శ్రీ చంద్రవంశ క్షత్రియులైన దేశ బలిజవారనియెడు గౌరవులయందు, రాజబంధు, మహాబంధు, గోష్ఠిబంధు, బహుబంధువులనియెడి చతుర్వర్గముల వివరణములఁ దెలిపెడు శ్రీవంశప్రకాశికయనెడు గ్రంథయొక్క సారాంశము:—

శ్రీచంద్రవంశక్షత్రియులయిన గౌరవులనియెడి బలిజవారిలో కోటబలిజవారనియును, పేటబలిజవారనియును రెండు తెఱంగులు గలవు. కోటయనగ, విజయనగరపుకోటయని తెలియవలయును. ఈ కోటవారికే దేశబలిజవారను నామముగలదు. వీరిలో రాజబంధు, మహాబంధు, గోష్ఠిబంధు, బహుబంధువులని నాలుగు తెగలుగలవు. వీరందఱును నాయనివారు, సెట్టివారు, రాతువారు, రాజువారు, రావువారు, వజీరువారు అను షడ్విధాంక నామధేయములతో వ్యవహరింపఁబడుదురు.

ఈ చతుర్బంధువులయందు రాజబంధుజనకూటస్థుల
గృహనామాది వివరణము.

సీసమాలిక.

శ్రీకరంబగుచంద్రమాకులక్షత్రియు లందునాలుగు తెగ లవనిగలదు
అవిరాజబంధువు నరయమహాబంధు బలగోష్ఠిబంధువు బాగుగాను
బహుబంధువనఁబడు పరికింపవీరిలో భాసిలును గరికెపాటివారు
వర నెడుంగుంద్రపువారును నమ్మకుమారులనియెడియల్లూరివారు
వసుధచింతలపురివారును మఱిబండ్ల పేటవారును పాలపాటివారు

పట్టుపువారును పగడాలవారును సెట్టివారును ధనసెట్టివారు
వెలికోట్లవారని వెలయుతుపాకులవారును మఱికత్తివారు పిదప
జగదేవవారును సవరమువారును కరివేటివారును కంచివారు
గంధపురమువారు కడియాలవారును నాసూరివారును నవనియందు
శ్రీపతివారును చెంజివారును మఱి వజ్రాలవారును వరుసగాను
నిమ్మడివారును నీలకంఠమువారు స్థిరనుడేగలవారు బిరుదువారు
రాయకులమువారు రాజిలువిజయమువారు నరావారు ధోరణిగను
వరలుభండారమువారు మంచాపాత్రనామంబువారు మునగలపేట
వారును నంజేటివారును మఱిదళవావారు తియ్యారివారు తిరుగ
స్థిరచంద్రగిరివారు పురమువారును పర్వతమువారు నుదయాద్రి స్థలము [వారు
గుఱుతుగామఱిబంతికుట్టువారని యెడి యీనామములుగల నిండ్లవారు
పరికింప శ్రీరాజబంధుకూటస్థులై విలసిల్లుచుందురు విభవముగను
భువియందు ననువీరి పూర్వసంబంధులై యుండువారలతోడ నొక్కటిగను

గీ. రాజబంధువు లనిముందు తేజవిజయ
రంగచొక్కనాథేంద్రుఁడు రాజులెఱుఁగ
రంగనాథునిముంగల రమ్యముగను
ఘోషణముజేసె బంధువుల్ గూడివినఁగ.

తాత్పర్యము. శుభకరులగు చంద్రవంశ క్షత్రియులయిన కోట బలిజవారియందు నాలుగు తెగలవారు గలరనియు, వారు రాజబంధువు లనియును, మహాబంధువులనియును, గోష్ఠిబంధువులనియును, బహు బంధువులనియును చెప్పబడుదురు.

వీరిలో రాజబంధుజనకూటస్థులెవరనఁగా:—

1. గరిగపాటివారు అను పాండ్య మండలాధీశ్వరుండైన విజయ రంగ చొక్కనాథ నాయని వారు.
2. నెడుంగుంద్రమువారు.
3. అమ్మకుమారు లనెడి అల్లూరి వారను తంజావూరు అధిపతి విజయరాఘవనాయనివారు.



4. చింతలపురివారు అనఁగా శ్రీ ఖండిమహారాజుగారు.
5. బండ్లపేటవారు.
6. పాలపాటివారు.
7. పట్టుపువారు.
8. పగడాలవారు.
9. సెట్టివారు.
10. ధనసెట్టివారు.
11. వెలికోటవారు, లేక తుపాకుల వారు.
12. కత్తివారు.
13. జగదేవవారు.
14. సవరమువారు.
15. కరివేటివారు.
16. కంచివారు.
17. గంధపురమువారు.
18. కడియాలవారు.
19. ఆసూరివారు.
20. శ్రీపతివారు.
21. చెంజివారు.
22. వజ్రాలవారు.
23. నిమ్మడివారు.
24. నీలకంఠమువారు.
25. డేగలవారు.
26. బిరుదువారు.
27. రాయకులమువారు.
28. విజయమువారు.
2'. నరానారు.
30. భండారమువారు.
31. మంచాపాత్రమువారు.
32. మునగలపేటవారు.
33. అంజేటివారు.
34. దళవాయివారు.
35. తియ్యారివారు, లేక చిత్రాల వారు.
36. చంద్రగిరివారు.
37. పురమువారు.
38. పర్వతమువారు.
39. ఉదయగిరివారు.
40. బంతి కుట్టువారు.

అనియెడు నలుబది ఇండ్లవారును, వీరిపూర్వులును రాజబంధువులని ముందు విజయరంగ చొక్కనాథేంద్రుఁడు రాజకులమువారెఱుఁగ, శ్రీరంగనాయకుల సన్నిధానంబున బంధువులందఱు వినఁగ వక్కాణించిరి. వీరికి రాజబంధువులనియును, రాజశ్రేష్ఠులనియును, ఏలిన వారనియును, చోళ పాండ్య దేశాధిపతులనియును, ఖండివారనియును వ్యవహారనామంబులుగలవు. వీరికి సేవకావృత్తియును, రజతభూషణ ధారణమునులేదు.

వీరి సంఘువాసస్థలములు:—బాగలూరు, నారికల్లు, రాయవేలూరు, వెల్లికురిచి, విరాచ్చిల, పనయూరు, అని తెలియవలయును.

---

## మహాబంధుజనకూటస్థులగృహనామాది వివరణము.

### సీసమాలిక.

శ్రీలక్ష్మీకరమగు శ్రీపైడియావులవారును మరల నీ వసుధయందు
కనగొనబంగారుకత్తివారనియెడి పచ్చనిసుగరికెపాటివారు
వర మెండుగుట్లలవారును మఱిబ్రహ్మముడివారు ఘనవాడి మొసలవారు
సామువారును మఱి జవ్వాజివారును నాదివారును మఱి దూదివారు
నింఘకులమువారు నిర్మల సంపంగివారును మఱి భారివారు మఱియు
చిఱుతపువారును జెట్టివారును మఱి బట్టేటివారును బండపల్లె
వారును మఱియందెవారు నాలంబాకువారును జనకలవారు విడెము
వారును గంధాలవారు నరసవారు పులిగుచ్చువారును భువినియిండ్ల
వారు కొన్కావారు వసుమతిలో గోపిసెట్టివారును మేడిసెట్టివారు
మఱి యేనుగులవారు మంచికుంచావారు వరుసగా మఱివల్లెవాట్లవారు
దండిగానుండు రథాలవారును జూడ ధరకత్తివారు ముత్యాలవారు
సాయనవారును జగతి కాలాపురివారు లాయమువారు వరుసగాను
పావాడవారును బరగ నంగావారు పోగులవారును పొడవుమండి
వారును శోధింప వనధిమధ్యను పూసపాటివారని నలువదియు నొకటి
సంఖ్యతో నొప్పిన చంద్రవంశోద్భవులై నట్టివారిలో నధికులైన
ఈనామధేయపు నిండ్లవారును వీరి యాదిసంబంధులై యమరియున్న

గీ. వారలునుమహాబంధువుల్ వరలువిజయ
రంగచొక్కనాథేంద్రుఁడు రాజులెఱుఁగ
రంగనాథునిముంగల రమ్యముగను
ఘోషణముజేసె బంధువుల్ గూడివినఁగ.



1. పైడియావులవారు.
2. బంగారుకత్తివారనెడుగరికెపాటివారు.
3. మెండుగుట్లలవారు.
4. బ్రహ్మముడివారు.
5. మొసలవారు.
6. సామువారు.
7. జవ్వాజివారు.
8. ఆదివారు.
9. దూదివారు.
10. నిండుకులమువారు.
11. సంపంగివారు.
12. భారివారు.
13. చిరుతవారు.
14. జెట్టివారు.
15. పట్టేటివారు.
16. బండపల్లెవారు.
17. అందెవారు.
18. ఆలంబాకువారు.
19. జనకలవారు.
20. విడెమువారు.
21. గంధాలవారు.
22. అరసవారు.
23. పులిగుచ్చువారు.
24. ఇండ్లవారు.
25. కొనకావారు
26. గోపిసెట్టివారు
27. మేడిసెట్టివారు.
28. ఏనుగులవారు.
29. కుంచావారు.
30. వల్లెవాట్లవారు.
31. రథాలవారు.
32. కత్తివారు.
33. ముత్యాలవారు.
34. సాయనవారు.
35. కాలాపురివారు.
36. లాయరివారు.
37. పావాడవారు.
38. వంగావారు.
39. పోగులవారు.
40. మండివారు.
41. పూసపాటివారు.

అనియెడు నీ నలువదియొక యిండ్లవాండును వీరల ఆది సంబంధులును మహాబంధువులని విజయరంగ చొక్కనాథేంద్రుఁడు రాజకులము వారెఱుఁగ శ్రీరంగంబున శ్రీరంగనాయకుల సన్నిధానంబున బంధువులందఱు వినఁగ వక్కాణించిరని తాత్పర్యము. వీరలకు మహాబంధువులనియును, రాజరాజేంద్రులనియును, పాండ్యరాజశేఖరులనియును, కులశ్రేష్ఠులనియును వ్యవహారనామంబులు కలవు. వీరికి చతుర్బంధువులయందును మొదటిమర్యాద కలిగియుండును. వీరిలోని స్త్రీలకు మెట్టెలనెడి భూషణంబులు లేవు.

వీరి సంఘవాసస్థలములు:—బాగలూరు, నారికల్లు, రాయవేలూరు, వెల్లికురిచి, విరాచ్చిల, పనయూరు, అని తెలియవలయును.

———

మహాబంధుజనకూటస్థులగృహనామాది వివరణము.

సీసమాలిక.

శ్రీలక్ష్మీకరమగు శ్రీపైడియావులవారును మరల నీ వసుధయందు
కనఁగొనబంగారుకత్తివారనియెడి పచ్చనిసుగరికెపాటివారు
వరమెండుగుట్టలవారును మఱిబ్రహ్మముడివారు ఘనవాడిమొనలవారు
సామువారును మఱి జవ్వాజివారును నాదివారును మఱి దూదివారు
నిండుకులమువారు నిర్మల సంపంగివారును మఱి భారివారు మఱియు
చిఱుతపువారును జెట్టివారును మఱి బక్కేటివారును బండపల్లె
వారును మఱియందెవారు నాలంబాకువారును జనకలవారు విడెము
వారును గంధాలవారు నరసవారు పులిగుచ్చువారును భువినియిండ్ల
వారు కొన్కావారు వసుమతిలో గోపిసెట్టివారును మేడిసెట్టివారు
మఱి యేనుగులవారు మంచికుంచావారు వరుసగా మఱివల్లెవాట్లవారు
దండిగానుండు రథాలవారును జూడ ధరకత్తివారు ముత్యాలవారు
సాయనవారును జగతి కాలాపురివారు లాయమువారు వరుసగాను
పావాడవారును బరగ వంగావారు పోగులవారును పొడవుమండి
వారును శోధింప వసధిమధ్యను పూసపాటివారని నలువదియు నొకటి
సంఖ్యతో నొప్పిన చంద్రవంశోద్భవులైనట్టివారిలో నధికులైన
ఈనామధేయపు నిండ్లవారును వీరి యాదిసంబంధులై యమరియున్న

గీ. వారలునుమహాబంధువుల్ వరలువిజయ
రంగచొక్కనాథేంద్రుఁడు రాజులెఱుఁగ
రంగనాథునిముంగల రమ్యముగను
ఘోషణముజేసె బంధువుల్ గూడివినఁగ.



1. పైడియావులవారు.
2. బంగారుకత్తివారనెడుగరికెపాటివారు.
3. మెండుగుట్టలవారు.
4. బ్రహ్మముడివారు.
5. మొనలవారు.
6. సామువారు.
7. జవ్వాజివారు.
8. ఆదివారు.
9. దూదివారు.
10. నిండుకులమువారు.
11. సంపంగివారు.
12. భారివారు.
13. చిరుతవారు.
14. జెట్టివారు.
15. బక్కేటివారు.
16. బండపల్లెవారు.
17. అందెవారు.
18. ఆలంబాకువారు.
19. జనకలవారు.
20. విడెమువారు.
21. గంధాలవారు.
22. అరసవారు.
23. పులిగుచ్చువారు.
24. ఇండ్లవారు.
25. కొనకావారు
26. గోపిసెట్టివారు
27. మేడిసెట్టివారు.
28. ఏనుగులవారు.
2). కుంచావారు.
30. వల్లెవాట్లవారు.
31. రథాలవారు.
32. కత్తివారు.
33. ముత్యాలవారు.
34. సాయనవారు.
35. కాలాపురివారు.
36. లాయదివారు.
37. పావాడవారు.
38. వంగావారు.
39. పోగులవారు.
40. మండివారు.
41. పూసపాటివారు.

అనియెడు నీ నలువదియొక యిండ్లవారును వీరల ఆది సంబంధులును మహాబంధువులని విజయరంగ చొక్కనాథేంద్రుఁడు రాజకులము వారెఱుఁగ శ్రీరంగంబున శ్రీరంగనాయకుల సన్నిధానంబున బంధువులందఱు వినఁగ వక్కాణించిరని తాత్పర్యము. వీరలకు మహాబంధువులనియును, రాజరాజేంద్రులనియును, పాండ్యరాజశేఖరులనియును, కులశ్రేష్ఠులనియును వ్యవహారనామంబులు కలవు. వీరికి చతుర్బంధువులయందును మొదటిమర్యాద కలిగియుండును. వీరిలోని స్త్రీలకు మెట్టెలనెడి భూషణంబులు లేవు.

### వీరల నివాసస్థలము.

శ్రీజగన్నాథము, విజయనగరము, రాజమహేంద్రవరము, సింహాచలము, దక్షిణమధుర, కొత్తకోట, పెరియకుళం, శ్రీహనుమత్పురియను హనుమన్తపట్టివాడి, అరుందాణి, అని తెలియవలయును.

---

### గోష్ఠిబంధుజనకూటస్థులగృహనామాది వివరణము.

### సీసమాలిక.

శ్రీరమాకృపగల స్థిరమతులగు పైడిపాటివారును మఱి తోటవారు
గట్లవారును గుడిమెట్లవారును గవనాలవారును మఱి గాలివారు
అయిలివారును మఱి యాసూరివారును సంద్యాలవారును నందెవారు
కుప్పాలవారనుగొప్పులవారును శీలాలవారును స్థిరను గీర్తి
వారును సాధనవారును పగడాలవారును పోగులవారు నిండ్ల
వారును ముత్యాలవారును గమతంబువారును సుంకరవారు మంకు
వారును నరుగులవారు నొయ్యారపువారును కొలుకులవారు ఛత్రి
వారును గటకంబువారును గనికాలవారును మన్నెంపువారు నొంటి
వారును బీగాలవారును గరివారు భోగినివారును పోలురాజు
వారును శ్రీచందువారు భీసాపత్రివారును గానాలవారు మరల
రామాయణమువారు రాజునాయనివారు కొట్టివారును మఱికోలవారు
స్థిరయుందుననుమాఱు సెట్టివారునుమఱియెఱమచ్చువారును నెఱమసెట్టి
వారు చిన్నమసెట్టివారును మరిబాలుసెట్టివారును జూడనిడెమువారు
బొబ్బూరివారును భువిదళవాయివారు రాతులవారు చంద్రాతువారు
అరయచల్లావారు నాకులవారును నల్లివారును శ్రీధనాలవారు
మహియందుననుదిరుమలసెట్టివారును మానంబువారును మంచియల్లి
వారును భండారివారును శ్రీపాండురంగంబువారును రమ్యపురము
వారును తేకూరివారును మేడూరివారును మోసూరివారు మొలక
వారును మఱి నేతివారు సొమ్ములవారు పృథ్విలోపల కొత్తపేటవారు



బాలునాయనివారు పరగవున్నావారు కనుగొనంగను బండికాటివారు
అననిలోపలజూడ నాలవారు పసుపులేటివారనెడు నీయిండ్లపేరు
గలవీరలును బూర్వకాలసంబంధులౌ గోష్ఠిబంధువు లని గురు తెఱుంగ

గీ. తొల్లికాలంబునందున దొడ్డవిజయ
రంగచొక్కనాథేంద్రుఁడు రాజులెఱుఁగ
రంగనాథుని ముంగల రమ్యముగను
ఘోషణముజేసి బంధువుల్ గూడి వినఁగ.

1. పైడిపాటివారు.
2. తోటవారు.
3. గట్టువారు.
4. గుడిమెట్టవారు.
5. గవనాలవారు.
6. గాలివారు.
7. అయిలివారు.
8. ఆసూరివారు.
9. నంద్యాలవారు.
10. అందెవారు.
11. కుప్పాలవారు అను కొప్పుల వారు.
12. శీలాలవారు.
13. కీర్తివారు.
14. సాధనవారు.
15. పగడాలవారు.
16. పోగులవారు.
17. ఇండ్లవారు.
18. ముత్యాలవారు.
19. కమతంబువారు.
20. సుంకరవారు.
21. మంకువారు.
22. అరుగులవారు.
23. ఒయ్యారపువారు.
24. కొలుకులవారు.
25. ఛత్రివారు.
26. కటకమువారు.
27. కనకాలవారు.
28. మన్నెంపువారు.
29. ఒంటివారు.
30. బీగాలవారు.
31. కరివారు.
32. భోగినివారు.
33. పోలురాజువారు.
34. చందువారు.
35. బీసాపత్రివారు.
36. గానాలవారు.
37. రామాయణమువారు.
38. రాజునాయనివారు.
39. కొట్టివారు.
40. కోలవారు.
41. మాఱుసెట్టివారు.

42. ఎరమచ్చువారు.
43. ఎరమసెట్టివారు.
44. చిన్నమసెట్టివారు.
45. బాలుసెట్టివారు.
46. నిడెమువారు.
47. బొబ్బారివారు.
48. దళవాయివారు.
49. రాతులవారు.
50. చందాత్రితువారు.
51. చల్లావారు.
52. ఆకులవారు.
53. నర్రావారు.
54. ధనాలవారు.
55. తిరుమలసెట్టివారు.
56. మానమువారు.
57. అల్లివారు.
58. భండారివారు.
59. పాండురంగమువారు.
60. రమ్యపురమువారు.
61. తేకూరివారు.
62. మేడూరివారు.
63. మోసూరివారు.
64. మొలకవారు.
65. నేతివారు.
66. సొమ్ములవారు.
67. కొత్తపేటవారు.
68. బాలునాయునివారు.
69. పున్నావారు.
70. బండికాటివారు.
71. ఆలవారు.
72. పసుపులేటివారు.

అనియెడు ఈడెబ్బదిరెండిండ్లవారును వీరి, తొలినాటి సంబంధులును, గోష్ఠిబంధువులని విజయరంగ చొక్కనాథేంద్రుఁడు రాజకులమువారెఱుఁగ శ్రీరంగంబున శ్రీరంగనాయకుల సన్నిధానంబున బంధువులందఱు వినఁగ వక్కాణించిరని తాత్పర్యము. వీరికి గోష్ఠిబంధువులనియును, భక్తశ్రేష్ఠులనియును వ్యవహారనామంబులు కలవు.

వీరల సంఘనివాస స్థలములు:— తిరుపతి, చెంగారెడ్డిపల్లె, ధర్మపురి, శ్రీసత్యదర్శనపురము, శ్రీదివ్యజ్ఞానపురము, శ్రీదివ్యతటాకపురము, అయ్యార్యారు, మొదలగు గ్రామములనియును తెలియవలయును.

బహుబంధుజనకూటస్థులగృహనామాది వివరణము.

సీసమాలిక.

శ్రీరమానరసుకావేరివారును మఱి గునిసెట్టివారును గోవువారు
అల్లంపువారును నాకులవారును మహిపతివారును మఱి నిజపతి



వారును మానంబువారు సింగముసెట్టివారు లక్ష్మిసెట్టివారు బిరుదు
వారును సుక్కడివారును పెనుకొండవారు జబ్బావారు వరుసగాను
గాడివారును మఱి కాలకంఠమువారు పాండురంగమువారు భానుసెట్టి
వారు గంగముసెట్టివారు పోలముసెట్టివారును గుజ్జాలవారు తూము
వారును తిరుపతివారును సింగాణివారును నారణివారు గాజు
వారును నగులూరివారును శ్రీరామవారును నావులవారు నవల
అత్తిలివారును నాచలిపందిటివారును శోధింప పాయసంబు
వారు జక్కావారు వసుధబాలేరావువారు తోటావారు వరలుచుండు
పోసంబువారును భువిదళవాయివారు నిమ్మలవారును నిశ్చయముగ
మేడిదవారును మేదినిలో కుమ్మవారు సాయనవారు మీఱు భుజన
వారును వగసాలవారును ముత్యాలవారును బోయనవారు మఱియు
అయ్యలవారును నాంబీరవారును ముప్పత్తివారును ముదముమీఱి
నలుబదియెనిమిది కులభేదములుగలవారును నీయిండ్లవారు వీరి.

గీ. బంధువులు బహుబంధని భోగవిజయ
రంగచొక్కనాథేంద్రుఁడు రాజు లెఱుఁగ
రంగనాథునిముంగల రమ్యముగను
ఘోషణము జేసె బంధువుల్ గూడివినఁగ.

1. కావేరివారు లేక జగదేవభుజబలరాయలువారు.
2. గునిసెట్టివారు.
3. గోవువారు.
4. అల్లంవారు.
5. ఆకులవారు.
6. మహిపతివారు.
7. నిజపతివారు.
8. మానంవారు.
9. సింగముసెట్టివారు.
10. లక్కసెట్టివారు.
11. బిరుదువారు.
12. సుక్కడివారు.
13. పెనుకొండవారు.
14. జబ్బావారు.
15. గాడివారు.
16. కాలకంఠమువారు.
17. పాండురంగమువారు.

18. భానుసెట్టివారు.
19. గంగమసెట్టివారు.
20. పోలముసెట్టివారు.
21. గుత్తాలవారు.
22. తూమువారు.
23. తిరుపతివారు.
24. సింగాణివారు.
25. ఆరణివారు.
26. గాజువారు.
27. నగులూరివారు.
28. శ్రీరామవారు.
29. ఆవులవారు.
30. అత్తిలివారు.
31. చలిపందలివారు.
32. పాయసంవారు.
33. జక్కావారు.
34. బాలేరావువారు.
35. తోటవారు.
36. పోసంవారు.
37. దళవాయివారు.
38. నిమ్మలవారు.
39. మేడిదవారు.
40. కుమ్మవారు.
41. సాయనవారు.
42. భుజనవారు.
43. వగసాలవారు.
44. ముత్యాలవారు.
45. బోయనవారు.
46. అయ్యలవారు.
47. ఆంబీరవారు.
48. ముప్పత్తివారు.

అనియెడు నీ నలుబదియెనిమిది యిండ్లవారును వీరిపూర్వసంబంధులును బహుబంధువులని విజయరంగచొక్కనాథేంద్రుఁడు రాజకులమువారెఱుఁగ వక్కాణించిరని తాత్పర్యము. వీరలకు బహుబంధువు లనియును రౌతులనియును వీరభటులనియును హస్తినాపురము వారనియును వ్యవహారనామంబులు కలవు.

వీరల సంఘనివాసస్థలములు:— వెంకటగిరి, జలకంఠపురి, మన్నారుగుడి, విళక్కుడి, వెంబలకుడి, కోయంబుత్తూరు, ముసిరి, శేలం, అని తెలియవలయు.

సదరు రాజబంధువులు మహాబంధువులు బహుబంధువులు పరస్పరమును గోష్ఠిబంధువులు ఏకదేశంబునను సంబంధ ప్రతిసంబంధములు చేసికొనుచున్నారు. ఇతర బలిజవారు అన్యబంధువులనియును పేట బలిజవారనియును చెప్పబడుదురు.



ఇదిగాక మఱిం గొందఱు వేఱుపేరులుగల బలిజవారున్నారు. వారిలో ఎవరెవరు ఏయే ప్రాంతములలో నున్నారో ఆవిషయము వ్రాయఁబడుచున్నది.

దక్షిణఆర్కాడుజిల్లా ప్రాంతములోని వారినిగూర్చి తిరుపాపులియూరిలోనుండు, మ-రా-శ్రీ, రంగస్వామినాయడువారు వ్రాసిపంపిరి. ఆ పట్టిక యందెట్లున్నదనఁగా:—

దాసరికిచ్చి వారు, దొడ్లవారు, తిరుమలవారు, వీసూరివారు, ముప్పాలవారు, విరూపాక్షివారు, సేలమువారు, వెంకటగిరినాయనివారు, ఆదిసెట్టివారు, మొయిలాపేటవారు, గజ్జలవారు, బంగాళమువారు, సకలాపురమువారు, నాజరువారు, భువనగిరివారు, చెంగల్పట్టువారు, నల్లవాండివారు, పుష్పాలవారు, తిరుచినాపల్లివారు, చిత్రాలవారు, పోర్తిగీసువారు, ఆత్తూరివారు, వృద్ధాచలమువారు, సున్నపువారు, సాగోలవారు, పిసునువారు, పుదుచ్చేరివారు, నడుకుప్పమువారు, తిరుమలనాయనివారు, మిట్టపాళెమువారు, చెంబేటివారు, దూసివారు, ఒళుకైకవారు, కర్పూరివారు, జల్లివారు, గంధపొడివారు, దేవనాయకశెట్టివారు, గొల్లపాళెమువారు, చంద్రాలవారు, ముద్దురంగంవారు, చిత్తూరివారు, కలశపాకమువారు, కోనేటివారు, పిళ్లారిగుడివారు, ఒడలపట్టువారు, బిచ్చమువారు, ఆలపాక్కమువారు, కుట్టియాంకుప్పమువారు, అమ్మాపేటవారు, సంకువారు, ఆళ్లవారు, పుట్టావారు, తిమ్మవారు, ఊరుగాయలవారు, ఆరణివారు, కస్తూరివారు, కొండప్పావారు, జడలూరివారు, నందివారు, చేమకోటవారు, అళకాద్రివారు, అన్నదానపేటవారు, మేడపాక్కంవారు, కారలెవారు, నాగపట్టణమువారు, తొలసింగంవారు, గూడలూరివారు, తొండమానత్తంవారు, కొండివారు, పాయసమువారు, పగడాలవారు, ఉప్పువారు, పట్టణమువారు, వేంబువారు, బాలగురువారు, లోకయ్యవారు, ఎరవూరువారు, ఏవూరువారు, వేంకటసుబ్బవారు, ఎడకనాటివారు, కోవిల్నూరువారు, ఎళుమేటివారు, వరదయ్య

వారు, కొల్లిరుసువారు, బాలముద్దువారు, కుప్పచ్చివారు, సిపాయివారు, వెళంగల్పట్టువారు, కందంబాళయంవారు, నామాలవారు, చిదంబరము వారు, పుదుక్కడవారు, ముద్దువారు, వరవాడివారు, మామిడిమాకు వారు, తిరువాదివారు.

ఈ చెప్పంబడిన యిండ్లవారు జనకల, (ముగ్గల) ముదుగుల, పుష్పాల, పైడిపాల, విష్ణు, (కాశ్యప) కాశి అక్షింతల, గంధ మువారి, మొరసగలగోత్రస్థులుగా నున్నారు.

మద్రాసు ప్రాంతములలోనుండు బలిజవారి గృహనామముల పట్టికను మద్రాసు గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు క్యాషియర్‌గా నుండు, మ-రా-రా-శ్రీ, కేతు విజయరాఘవనాయుడుగారు పంపించిరి. ఆ పట్టిక యందెట్లున్నదనంగా:—

కేతువారు, సానావారు, కుప్పము సానావారు, గొడుగులసానా వారు, గువ్వల సానావారు, నరహరివారు, నాయరువారు, రావూరి వారు, తొండావూరివారు, నీలకంఠమువారు, ఇరుప్పూరివారు, భూపతి వారు, నీలివారు, ఆవులవారు, తొందులవారు, చిలముత్తూరివారు, నెల్లూరివారు, రాజమల్లి వారు, కోడంబాకంవారు, తెప్పలవారు, మిర్యాలవారు, తలిసెట్టివారు, గరడివారు, మాచివారు, దాంట్లవారు, ముత్యాలవారు, దొండపట్టివారు, ఆరణివారు, గాదెలవారు, శతకం బేటివారు, మారిసెట్టివారు, పగడాలవారు, పోకలవారు, తోటవారు, పొన్నేరివారు, చిరివేళ్లవారు, పొన్నగంటివారు, సనగావారు, కత్తుల వారు, ఉడతవారు, అరసావారు, సాదనవారు, మెట్టువారు, తూము వారు, నాగలాపురమువారు, కలిజమువారు, పెనుకావూరివారు, హేరం బసెట్టివారు, పలకూరివారు, గడ్డమువారు, అల్లమువారు, గంగిపట్టి వారు. వీరందఱును రత్నాల బలిజవారికుటుంబముతోఁ జేరినవారు.

ఈయిండ్లవారు జనకలగోత్రము, కాశిగోత్రము, సెట్లగోత్ర ము, మల్లెలగోత్రము, అక్షింతలగోత్రము, పైడిపాలగోత్రములలోఁ జేరినవారు.



మద్రాసుతోఁ జేరిన రాయపేటయందుండు, మ-రా-రా-శ్రీ, లాల్పేట వేంకటవరదరాజులునాయనివారు పంపించిన పట్టిక ప్రకారము గా బలిజవారిగృహనామములు:—

లాల్పేటవారు, మల్లజట్టివారు, పుట్టావారు, పరుత్తిపట్టువారు, సూరవరమువారు, చూరువారు, రౌతువారు, వేంగవాసివారు, పుట్టము వారు, నీలకంఠమువారు.

మద్రాసులోనుండు మ్మూతకమ్మలబలిజవారి గృహనామములు:—

మోదరపువారు, జగ్గావారు, పంటలవారు, గ్రంధివారు, పుర మువారు, కోటావారు, పోతులవారు, ఎనుములవారు, సాధువారు, గడు దాసువారు, జమ్మివారు, దాడివారు, పసుపులేటివారు.

పెరికబలిజవారి గృహనామములు:—

నూతనపాటివారు, మన్నూరిపేటవారు, కడియమువారు, ముత్తం వారు, పంటలవారు, గోడేవారు, గొట్టేవారు, గొద్దేవారు, దాసరి వారు, పోతమువారు, భేరివారు, తంజావూరివారు, వైరివారు, కఠారి వారు, రామధేనువారు, చండికంటివారు, కత్తికవారు, రాజమహేంద్ర వరమువారు, సంగంవారు, మెడతమువారు, పట్టేవారు, భానువారు మొదలగువారు.

పెరికబలిజవారిలో అనేకులు విశాఖపట్టణము, రాజమంద్రి, బందరు, చిత్తూరుజిల్లాలో సోమలం, చంద్రగిరి మొదలగు కొన్ని ప్రదేశములయందుమాత్రము వసించుచున్నారు.

ఈ పెరికబలిజవారికి తెనుగుజిల్లాలలో రాజుగారు, రావుగారు, వజీరుగారు, బాబుగారు అని బిరుదనామములుకలవు.

మధుర, తిరునెల్వేలి, శ్రీవిల్లిపుత్తూరు, మొదలగుప్రాంతముల యందుండు బలిజవారిగృహనామములను తిరునెల్వేలి కలెక్టరాఫీసులో నుండు మ-రా-రా-శ్రీ, యతిరాజులునాయుడుగారు వ్రాసిపంపించిరి. ఆపట్టికయందెట్లున్నదనగా:—

మెండుకుండలవారు, పసుపులేటివారు, తోండేటివారు, పెద్దిరెడ్డివారు, ముశినవారు, మన్నవారు, కోలవారు, శ్రీపాదమువారు, సాయనవారు, పడవేటివారు.

వీరు కాశ్యపగోత్రము, జనకలగోత్రము, దశరథగోత్రములలో జేరినవారు. వీరందఱును 420 ఏండ్లకుముందు విజయనగరమునుండి నాయడుగారి సంస్థానము ప్రబలముగానున్న కాలమునందువచ్చి చేరినవారు. వీరికి బంధువులందఱును ఈప్రాంతములలోనే యున్నారు.

మధుర, తిరునెల్వేలి, శ్రీవైకుంతము, వీరరాఘవపురము, పాళయంకోట, కల్లడకురుచ్చి, మొదలగు ప్రాంతములయందుండు బలిజవారి గృహనామములు:—

గంభీరమువారు, మల్లేనివారు, నెడుంగొండమువారు, కోటవారు, పెనుగొండవారు, గున్నవారు, సురభివారు, శీతమువారు, కత్తివారు, చేకత్తివారు, జగతివారు, సత్రమువారు, నక్కవారు, పెరుగువారు, తోటవారు, పసుపులేటివారు, పట్టాలవారు, కొండాడువారు, పసుపుతెక్కలవారు, కొండవారు, పిండివారు, పసుపువారు, మందలవారు.

వీరియొక్క గోత్రనామములెవ్వియనగా:— దశరథగోత్రము, జడపాలగోత్రము, పాలగోత్రము, మత్స్యగోత్రము, జనకలగోత్రము, కూర్మగోత్రము, వరాహగోత్రము, నారసింహగోత్రము, వామనగోత్రము.

---

ప్రతిస్థలమునందును వసించు బలిజవారి గృహనామాదులను వివరించుటవలన చదవరులకు ప్రయాసమనియెంచి వారియొక్క గృహనామాదులనుమాత్రము వ్రాయఁబడుచున్నయది.

అత్రివారు, అచ్యుతవారు, అశ్వినివారు, అమరపాలవారు, అరుణవారు, అంగుళివారు, అంబారివారు, అష్టాక్షరమువారు, అనూరాధవారు, అశ్వకల్పవారు, అంశవారు, అంజనవారు, హరిదాసువారు,



అంజేటివారు, ఆంబూరివారు, ఆడువారు, ఆకులవారు, ఆరభివారు, ఆలూరివారు, ఆఱుగుంటలవారు, రాజపాలవారు, రంభావారు, రాజశేఖరవారు, రంగరాయువారు, ఈనువారు, ఈరువారు, ఎఱమచ్చవారు, ఎలుగులవారు, ఎయ్యారివారు, ఏనుగులవారు, ఏనాదివారు, అయ్యారివారు, ఐదిండ్లవారు, ఒప్పారివారు, ఒరపువారు, గండభేరుండవారు, గంధమువారు, గిర్దావారు, కొప్పమువారు, గరుడవారు, కాశివారు, గంభీరవారు, ఖర్జూరవారు, కిరీటమువారు, కోరువారు, గోపాలవారు, కంబులివారు, కాళహస్తివారు, గర్జనవారు, గోష్టివారు, గోకులవారు, గూనివారు, కంభమువారు, గొబ్బివారు, గోరసవారు, కుండదేవవారు, కాతాలవారు, కటకమువారు, కుప్పమువారు, కాకివారు, కట్టువారు, కొంగువారు, కేశిమతమువారు, గుడిచుట్టువారు, గంగమ్మవారు, చక్కివారు, సింగమువారు, సుందరవారు, చోడపాలవారు, సుకుమారవారు, చేదివారు, స్వయసేనవారు, సుగంధవారు, చతురంగమువారు, సంపన్నవారు, సంతతివారు, సగోత్రవారు, సుమంతువారు, చిల్లావారు, సాంబ్రాణివారు, సోమువారు, సంపువారు, సంకులవారు, శిలావారు, చక్రమువారు, సారథివారు, నంకువారు, సురభివారు, సొజ్జివారు, చల్లావారు, సామిశెట్టివారు, సున్నమువారు, సవరమువారు, చల్లనివారు, సరమువారు, చౌదరివారు, చెంబేటివారు, చాందివారు, జమ్మలమడుగువారు, జీనివారు, జంగమయవారు, జుట్టువారు, జొన్నలవారు, జోగివారు, జగన్నాథమువారు, జల్లివారు, డబేదారువారు, డమారవారు, దాడివారు, తిత్తివారు, దీపమువారు, దేవదాసవారు, ధన్వంత్రివారు, దాసువారు, దండువారు, తిలమువారు, తిరుపతివారు, తంగేటివారు, తంబూరివారు, తీర్థమువారు, తులసివారు, దామగ్లవారు, దేవరాయలవారు, దాదివారు, తూములవారు, ధూపమువారు, దవనమువారు, తాటితోపువారు, తెనాలివారు, నాయడుపేటవారు, నగుసవారు, నామాలవారు, నోటబీగమువారు, పత్తివారు, పాలువారు,

పూసపాటివారు, పట్టనామమువారు, భోజరాజువారు, పులోమర్తి వారు, పజ్జలవారు, భోగిరాజవారు, భజనవారు, భద్రాచలమువారు, పసుపుగుడ్డవారు, పాలర్తివారు, బసవవారు, పండరిపురమువారు, బెల్లమువారు, మరకతమువారు, ముదుకులవారు, మేరువారు, మల్లికార్జునవారు, మల్లెనివారు, మన్నెమువారు, మంగివారు, మిరపకాయవారు, మురికినాటివారు, ముక్కాటివారు, రథాలవారు, రాయదుర్గమువారు, వజ్రాలవారు, విజ్జపవారు, మొదలగువారు.

ఆదిలో బలిజవారు వెయ్యియిండ్లవారుండిరనియు, ఆమీఁద చాలాయిండ్లవారు నశించిపోయినందున మున్నూరిండ్లవారే నిల్చిరనియును కొందఱుచెప్పెదరు.

1891 సం॥ జనగణన గ్రంథమునందు మిస్టర్ స్టూవర్టుదొరగారు బలిజవాండ్రు 650 ఇండ్లవారున్నారని వ్రాసిరిగాని, ఆలెక్క ప్రకారముగా నిపుడు కనబడలేదు.

సాధారణముగా నీబలిజవారియిండ్లపేర్లవలన దెలియవచ్చుట యేమనగా:—ఆయాకుటుంబస్థులయొక్క గౌరవము, వారిఉద్యోగము, వారున్నస్థలము, వారివ్యాపారము, మొదలగునవి స్పష్టమగుటకొఱకే యని తెలియదగినది.

కొందఱుఇండ్లపేర్లను తెలిసికొనకయున్నారు. అందువలనచాలాకీడు సంభవించుచున్నది. అప్పుడప్పుడు వ్రాయునట్టి పత్రములు, దస్తావేజులు మొదలగువానియందును స్పష్టముగా తమ తమ యింటిపేరు, కులము, గోత్రము, సూత్రములను స్పష్టముగా వ్రాసియుంచవలయును. ఇదిగాక ప్రతికుటుంబమువారును తమ తమయొక్క ముత్తాతలనాటినుండియైనను వంశావళిని అవశ్యముగా వ్రాసి యుంచవలయును. ఇట్లుచేయనందున చాలాబలిజకులస్థులకు తమ తమ గృహనామములే తెలియకపోవుచున్నవి. ఇందుచేత శుభాశుభకాలములయందు పురోహితుఁడు కర్తనుజూచి మీగృహనామమును జెప్పుమనియడిగినపుడు ముందు



వెనుకతోచక మిణకరించుచుండఁగా, ఆపురోహితుడే నోటికివచ్చినట్లుగా తనకంటిముందాసమయమునందు కనఁబడు వస్తువులనుజూచి కర్పూరమువారు, సాంబ్రాణివారు, పుష్పాలవారు, అక్షింతలవారని చెప్పుచున్నాఁడు. కనుక ఇఁకనైనను ఇట్టిలోపములను తొలగించుకొనవలయును.

పదునైదవ అధ్యాయము.

బలిజవారి గోత్ర వివరణము.

ఆదిలో బలిజవారికి కాశ్యప, భారద్వాజ గోత్రములుండెను. ఆమీఁద అత్రి, ఆంగీరస, మరీచి మొదలగు గోత్రములుకలిగెను. దక్షిణదేశమునందుండు బలిజవారికి కాశ్యప, చలమ, జనకల, దశరథ, ఓడపాల, కాశి, సెట్ల, మల్లెల, అక్షింతల, పైడిపాల, ముదుగుల (ముద్గల) పుష్పాల, గంధము, యోరసాల, జడపాల, మత్స్య, కూర్మ, వారాహ నారసింహ, మహీపతి మొదలగు గోత్రములుకల్గియున్నవి.

బలిజవారిసూత్ర వివరణము.

బలిజవారిలో చాలమంది బోధాయన, ఆశ్వలాయన, ఆపస్తంబ, కాత్యాయనసూత్రములు గలవారై యున్నారు.

బలిజవారిమత వివరణము.

బలిజవారు ఆదియందు బౌద్ధమతస్థులై యుండిరి. ఆవల శైవవైష్ణవ మతస్థులై అనేక శివాలయములను విష్ణ్వాలయములను నిర్మించిరి. ఆశివకేశవాలయములు నేటికిని ప్రసిద్ధములై యున్నవి. అయినను ప్రకృతమునందు బలిజవారిలో నూటికి తొంబదితొమ్మండ్రుగురు వైష్ణవమతస్థులుగను ఒక్కఁడు శైవమతస్థుఁడుగను కానంబడుచున్నాఁడు. ఇదిగాక విద్యాధికులు కాని బలిజవారు తమకు తోఁచిన దేవతల నారాధించుచున్నారు. సాధారణముగా కొందఱు చాత్తాదవైష్ణవులయొక్కయు,

మఱియు గొందఱు చాత్తినవైష్ణవులయొక్కయు ఆచార వ్యవహారముల చొప్పున వర్తించుచున్నారు.

---

బలిజవారియొక్క జాతకర్మాది క్రమము.

శ్రీ చంద్రవంశ క్షత్త్రియులైన బలిజవారు లేక గౌరవులలో శిశువు మాతృగర్భమునుండి వెడలినతోడనే పురుష శిశువుగానుండెనేని బొడ్డునాళమును కోయకముందే జాతకర్మముచేసి, ఆ మీద నాళమును కోసి, నేయి లేక తేనెయందు తిరుమంత్రమునువ్రాసి, ఆ మంత్రమును ఉచ్చరించుచు శిశువునాలుకయందు రాచవలయును. శిశువు జనించిన 10, లేక 12 వ దినమునందు భగవన్నామమునుంచి నామకరణమును చేయవలసినది. శిశువు జనించిన నాలుగవనెలలో శిశువును బైటికితీసి కొనివచ్చి సూర్యనారాయణమూర్తికి కనఁబఱచవలయును. మఱియు భగవదాలయములకును పోవలయును. ఆఱవనెలలో అన్నప్రాశనము చేయవలయును. సంవత్సరాంత్యమునఁగాని, లేక మూడవ ఏటగాని చౌలముచేయవలయును. అయిదవఏట ఐదవనెలలో విద్యాభ్యాసము చేయవలయును. ఎనిమిది, లేక పదునొకండవ సంవత్సరమున ఉపనయనముచేయవలయును. మఱియు పంచసంస్కారమును చేయవలయును.

బలిజవారియొక్క వివాహక్రమము.

బలిజవారు ఆదియందు ధర్మశాస్త్రప్రకారముగా వివాహమును చేయుచుండిరి. తంజావూరును, మధురను పాలించిన నాయుడుగార్లు వైష్ణవ మతస్థులైనందున, వీరు వైష్ణవసంప్రదాయప్రకారముగా తమ యిండ్లయందు వివాహములను చేసినందున అందఱును అలాఁగే చేయనారంభించిరి.

వివాహముయొక్క మొదటిదినమునందు:—

(1) వడ్లుకొలుచుట—శ్రీరంగము నంబెరుమాళ్ సన్నిధికి, అని ఆరంభించి ముఖ్యమైన తిరుమల, పెరుమాళ్ కోవెల, తిరునారాయణ





పురము, తిరుక్కోవలూరు, శ్రీపెరుంబూదూరు, శ్రీవిల్లిపుత్తూరు అని తమశక్త్యానుసారముగా 12 సన్నిధులకైనను ధాన్యమును కొలుచునది.

(2) ముహూర్త స్తంభస్థాపనము—దీనినే పాలస్తంభమని చెప్పుదురు. ఈ స్తంభము వెదురు, అత్తి, మఱ్ఱి, రావికొమ్మలలో నొకటిగా నుండవలయును. ఈ స్తంభమును శుభముహూర్తమున మంగళవాద్య ఘోషముతో సుమంగలిస్త్రీలు పాటలు పాడుచుండఁగా నాటవలయును.

(3) నలుఁగు—శ్రీరంగనాథుని విషయముగా పాటలుబాడుచు నలుగు పెట్టవలయును.

(4) సభాతాంబూలము—అచ్చట వచ్చియుండు పురోహితులు, బ్రాహ్మణులు, బంధుమిత్రాదులు మొదలగువారికి చందనము పుష్పము తాంబూలము నిప్పించవలసినది.

రెండవ దినమునందు:—

(1) నలుగు, (2) నిశ్చితార్థము, (3) సభాతాంబూలము.

మూడవ దినమునందు—పాణిగ్రహణ ముహూర్తము.

దేవబ్రాహ్మణ సమారాధన, శుద్ధి పుణ్యాహవాచనము, సుంకులు, నలుగు, మంగళస్నానము, పెరుమాళ్ తిరువారాధన, అరమనతోరణము, అఖండదీపము, పుణ్యాహవాచనము, నాంది, నామకరణము, అన్న ప్రాశనము, చౌలము, కుమార భోజనము, రక్షాబంధనము, పాలికపూజ.

ఉపనయనహోమము:—జందెముతోడ బంగారు వెండి పోగులను చేర్చివేయుటయు కలదు.

హోమము:—స్థాలీపాకము. చరువుతో హోమముచేయవలయును.

భిక్షబియ్యము—గంగాయాత్ర.

(గంగాయాత్ర ద్రవ్యము పురోహితులకు చేర్పవలయును.)

ఉపనయన సమయమున భిక్షను పెండ్లికొమారుని యొక్క తల్లి తోడబుట్టిన స్త్రీలందఱును ఉంచినమీఁద ఇతరులు ఉంచవలయును. (భిక్షబియ్యమును ధనమును పెరుమాళ్లకు చేర్పవలయును.)

వివాహపుణ్యాహవాచనము, లాజహోమము, నవగ్రహపూజ, వజ్రభాండపూజ, అరుంధతిపూజ, మహాలక్ష్మీపూజ, వస్త్రదానము, బాసికములుకట్టుట, కత్తికటారి గ్రహించుట, మెట్టెలు ధరించుట.

వరపూజ:—కన్యాదానముచేయుటకై—పెండ్లికొమారునిపాదములను మామయు అత్తయు పూజించి కన్యాదత్తము చేయవలసినది.

మధుపర్కము:—మహాసంకల్పము, సంబంధియు ప్రతిసంబంధియు పరస్పరము వంశావళిని చెప్పవలయును.

మాంగల్యపూజ, ఆచార్యసంభావన, గృహస్థాశ్రమోపనయనము. (ఆచార్యసంభావనను స్వాచార్యులకు అర్పించవలయును.)

ధారాదత్తము:—“కన్యాంకనకసంపన్నాం” అనుశ్లోకమును పఠించి దత్తముచేయవలయును. అప్పుడందఱును “తథాస్తు” అనిచెప్పవలయును.

జీరకబెల్లము:—ఇది వధూవరులకిద్దరికిని యిప్పించవలయును.

మాంగల్యధారణము, పాణిగ్రహణము, శేషబియ్యము (తలబ్రాలు), కొంగుముడి, సప్తఋషిపూజ, ఆనందపాట.

బొట్టును కూర్మాకృతిగాచేయవలయును. శంఖ చక్ర ఊర్ధ్వపుండ్ర శ్రీచూర్ణములను బొట్టునడుమ కొందఱుచెక్కించుటయుకలదు. బొట్టుదారమును (మంగళసూత్రమును) ఎనిమిదిదారములలో గ్రుచ్చి ముహూర్తమునాడు ధరింపఁజేయవలయును. ఆమీఁద వారి వారి యింటివాడుక చొప్పున దారమును పేని శుభముహూర్తమునందు కట్టుకొనవలయును.



మాంగల్యము పలువిధములుగానుండినను ముఖ్యముగా శ్రీకూర్మాకృతియే శ్రేష్ఠమైనది. ఏలనఁగా—శ్రీరంగము శ్రీరంగనాచ్చియారు, తిరుపతి అలమేలుమంగమ్మ, కాంచీపురము పెరుందేవితాయారు, మధురమీనాక్షిదేవి మొదలగు ప్రసిద్ధస్థలములలో గల తాయార్ల కంఠములందు ధరింపఁబడియుండు బొట్టులు కూర్మాకృతిగానే యున్నది.

అరుంధతిదర్శనము, ఫలదానము, మంగళహారతి, లక్ష్మీదర్శనము, అరమనపూజ (పాలికలు, ఔపాసనభాండములుండుగృహములుండుస్థలమునందు చేయుపూజ).

పాలుపండ్లిచ్చుట, ఆరతి, కొంగుముడివిప్పుట, ఆశీర్వాదము, సభాతాంబూలము.

నాలుగవదినమునందు:—

నలుగు, పూలబంతులాడుట, తెంకాయలాడుట (శీర్వాడల్).

తెంకాయలాడునప్పుడు నాచ్చియార్ తిరుమొழిలో “వారణమాయిరం” అను పాశురములను పురోహితులు పెద్దలుచెప్పుచుండఁగా వధూవరులాడుచుండుట.

నాచ్చియార్ సంభావన—తెంకాయలనుదొర్లించు శీర్వాడల్ సమయమునందు దంపతులుగా నుండువారందఱును నాచ్చియార్ సంభావన సమర్పించవలయును. ఆతర్వాత,

మాలలుమార్చుకొనుట:— అనగా పెండ్లికొడుకును పెండ్లికూతురును పరస్పరము ఒకరిమాలనొకరుధరించుకొనుట. ఆమీఁద పాన్పు, ఆరతి, సభాతాంబూలము, కంకణచోరత్వము. పెండ్లికూతురు చేతిలోనికంకణమును పెండ్లికొడుకు దొంగలించుకొనిపోయినమీఁద, పెండ్లికూతురును, పెండ్లికూతురుతోబుట్టువులును, లేక తోబుట్టువరుస గలవారును కంకణమును వెదకి తీసికొనివచ్చి మరల కట్టుకొనుట. (ఈ కార్యము ఆరాత్రియందేజరుగఁదగినది.) ఆ తర్వాత, శ్రీరంగనాయక

స్వామివారిని శ్రీరంగనాయకీదేవివారిని సంవాదపాటలు పాడుట, పాన్పు, హారతి, సభాతాంబూలము.

ఐదవదినము:—నాకబలి.

సుంకులు, నలుగులు, శంఖు, కంకణక్రీడ, మంగళస్నానము, నాకబలిభాండములను అలంకరించుట, పుణ్యాహవాచనము, వజ్రభాండపూజ, శ్రీరంగనాథపూజ, పంచపాలికాపూజ, వసంతమదనపూజ, గజేంద్రపూజ, గృహారాధన, హోమములు, నీలమణిధారణము, దీపపుల్లెము, భాండతంతువిసర్జనము, దశార్ఘ్యము, గజేంద్రసంవాదము, మంగళాష్టకము, కంకణవిసర్జనము, రెండవమారు మెట్టెలు పెట్టించుట, అరుంధతిదర్శనము, వాహనదానము, వసంతము, రాజాంగము, పాన్పు, విడెము, అడపతాంబూలము, శిరవనము, పుత్రోత్సవము (బొమ్మనుపెట్టిపుట్టినట్లుభావన), పుత్రసంభావన, (ఈసంభావనలో సగము పెరమాళ్లకుసగము పురోహితులకు), చంద్రదర్శనము (చందమామనుచూడడము), ఈడు, బృహస్పతిసంభావన, ఫలదానము, ఆశీర్వాదము, హారతి, పాలుపండ్లిచ్చుట, సభాతాంబూలము, పాలికలకు ఆరగింపు, భూప్రదక్షిణము (ఇదేఊరేగింపు), రాత్రిగృహప్రవేశము, మల్లింపుతొల్లింపు మొదలైన ఐతిహ్యములు చేయవయును.

శ్రీసంప్రదాయ తాంబూలవినియోగపద్ధతి.

1. శ్రీపెరియపెరుమాళ్లు, 2. శ్రీపెరియపిరాట్టియార్, 3. ఎంబెరుమానారు, 4. నమ్మాళ్వారు, 5. నాథముని, 6. ఉయ్యకొండార్, 7. మణక్కాల్ నంబి, 8. ఆళవందార్, 9. పెరియనంబి, 10. తిరుకచ్చినంబి, 11. నేనముదలియార్, 12. కూరత్తాళ్వార్, 13. ముదలియాండార్, 14. తిరువరంగత్తముదనార్, 15. ఎంబారు, 16. భట్టర్, 17. నంజీయర్, 18. నంబిళ్ళై, 19. వడక్కుత్తిరువీథిప్పిళ్ళై, 20. పిళ్ళై



లోకాచార్యర్, 21. కూరకులోత్తమదాసర్, 22. తిరువాయ్‌మొళిప్పిళ్ళై, 23. శ్రీవేదాంత దేశికర్, 24. మణవాళమహామునికళ్, 25. వానమామలై రామానుజజీయర్, 26. తిరువేంగడం ఎంబెరుమానార్ జీయర్ 27. శ్రీప్రతివాదిభయకరం అణ్ణన్, 28. పరవస్తుపట్టర్ పిరాన్ జీయర్, 29. శ్రీఆంధ్రవిష్ణుమూర్తి, 30. శ్రీరంగనారాయణజీయర్, 31. శ్రీఎరిచ్చల్ అచ్చార్, 32. అప్పుళ్లార్, 33. ధనుర్దాసర్, 34. శ్రీరంగనారాయణజీయర్, 35. శ్రీనారదర్, 36. పరాశరర్, 37. శ్రీవేదవ్యాసర్, 38. పెద్దదాసర్, 39. విజయరంగచొక్కనాథనాయడుగారు, 40. విజయరాఘవులు నాయడుగారు. ఈ చెప్పఁబడిన క్రమప్రకారముగా తాంబూలమును వినియోగముచేయవలయును.

ఈయైదుదినములలో, మొదటిదినముమొదలు శ్రీద్రావిడవేదపాశురములను, శ్రీ కల్యాణసంకీర్తనములను, శృంగార రాగసీసపద్యములను పాడవలయును. పెండ్లికిముందుగాని, తర్వాతగాని శ్రీఆండాళ్ వైభవమును కాలక్షేపముచేయవలయును. అసహ్యాకరమైన పద్యములను పాటలను శుభకార్యముజరుగు గృహములయందు పాడదగదు.

ఈ చెప్పఁబడిన పద్ధతులన్నియును ఆంధ్రవంశ క్షత్రియకులతిలకులైన బలిజవారు జరుపుచుండినవి గావున బలిజవారందఱును ఇట్లే తమ గృహములయందు అనుష్ఠింపదగినది. మధ్యకాలమునందు వారువారు తెచ్చుకొన్న దుష్టపద్ధతులనంతయు పమూలముగా దొలగద్రోయవలయును.

---

పదునాఱవ అధ్యాయము.

# బ్రహ్మమేధ సంస్కార పద్ధతి.

(పరమపదసమయమున చేయవలసిన కర్మము).

చంద్రవంశ క్షత్త్రియ బలిజవారిలో వివాహమైనమీఁద సంతానము కలిగినపుడు, ఆపుత్త్రులకు క్షత్త్రియధర్మము ననుసరించి మనుధర్మశాస్త్రప్రకారముగా జాతకర్మనామకరణాది కర్మములను చేయించవలయును. ఈమను ధర్మశాస్త్రములోని సారాంశమును గ్రహించి కేశవ చంద్ర బ్రహ్మానంద యోగీశ్వరులు “నవసంహిత” లేక “ఆర్యాచారము” అను గ్రంథమును రచియించియున్నారు. ఈగ్రంథమును ద్రావిడమున నాచే రచియింపఁబడియున్నది. దానింజూచినచో నిశ్చయము బోధమగును. అయినను ఆవిషయమునంతయు నిచ్చోట వ్రాయుటకు సాధ్యపడదు గాన, బలిజవారిలో వైకుంఠప్రాప్తి యగునపుడు చేయవలసిన కర్మములనుమాత్రము సంగ్రహముగా నిరూపింప బడియెడిని.

శ్రీ ప్రపన్నులు పరమపదముచెందు సమయమునందు గృహశుద్ధి చేసి, ఇసుకను నెఱపి, దానిమీఁద దర్భనుపఱిచి, ఆపరమపదించునట్టి భాగవతుని శరీరమును శుద్ధిచేసి, మడివస్త్రమును ధరింపఁజేసి, ద్వాదశోర్ధ్వపుండ్రములనుంచి, వనమాల తులసీమణిమాలలు మొదలగునవి ధరింపఁజేసి, పెరుమాళ్లకు తిరువారాధనము జేసి ఆ తీర్థమును శ్రీపాద తీర్థమును, తీర్థవడితీర్థమును నొకటిగా జేర్చిన తీర్థమును స్వీకరింపఁజేసి, శ్రీపాదరేణువు తిరుమాల చాత్తుపడి ప్రసాదములను స్వీకరింపఁజేసి, ఆదర్భాసనమునందు ఉత్తరమున శిరస్సుండునట్లు పరుండబెట్టి, ప్రపన్నులు పరమపద ప్రయాణముచేయునపుడు అష్టాక్షర మహామంత్రమైన తిరుమంత్ర నిత్యానుసంధానమే కట్టముదు (మార్గభుక్తామృతము)



అని అర్చిరాదిగతియందు కృపచేసి యుండుటవలన తత్కాలమున జననమరణాది దుఃఖమునకు హేతువై యుండు విచిత్రములైన సంసారవ్యాపార సర్వచింతనలను మఱచి మోక్షమునకు హేతువైన అర్చిరాది ప్రబంధానుసంధానమును, ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమనెడు దృఢాధ్యవసాయముతోడను నుండవలయును. మరియు వారియొక్క పుత్త్రుఁడు లేక శిష్యుఁడు వీరు ఆప్రపన్నునియొక్క శిరమును తమ కుడితొడపై నుంచుకొని యుండవలయును. వారు పంచసంస్కారము కానివారుగా నుండిరేని, అప్పుడు పంచసంస్కారమైనవారు దర్భతో శంఖచక్రములను వీరికి వ్రాసి వాక్య గురుపరంపరను తిరుమంత్రమును ఉపదేశించి, ముమ్మాఱు అనుసంధించునట్లుచేసి, ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమను ధ్యానమును, ఉత్తరవాక్యోచ్చారణముతోడ తిరునాడలంకరించవలసినదని చెప్పవలయును. అపుడు అచ్చటనుండు ఆప్తబంధువర్గమువారందఱును ఏకకంఠముగా ఉత్తరవాక్యమును ముహూర్తకాలము అనుసంధించుచుండవలయును.

---

నారాయణబలి విధానము.

ప్రపన్నుఁడు తిరునాడలంకరించినమీఁద, పుత్త్రుడును బంధుమిత్రులును పాత్రలనుతీసికొని జలముండుచోటికి (నదీతటాకాదులకు) పోయి స్నానముచేసి తిరుమణికాప్పుచేసికొని పుత్త్రుడుమాత్రము ఏకవస్త్రుడై అందఱును జలమును తీసికొనివచ్చి, ముంగిటియందు అలికి ఒంటి ముగ్గు పెట్టియుండుస్థలమున ఆబిందెలనుంచవలయును. పుత్త్రుడు భాగవతులకు దండము సమర్పించి లేచి చేతియందు సంభావననుంచుకొని, స్వాములనుజూచి నిలువవలయును. అపుడు భాగవతులు కర్మకర్తనుజూచి “వేఱొన్రుమ్ నానరియేన్” అను పాశురమును అనుసంధించి పుత్త్రుడునుచెప్పి అనుజ్ఞనుబొంది “మమపితృః అక్షయ పరమపదప్రాప్త్యర్థం నారాయణబలిరూపేణ కర్మకర్తుం యోగ్యతాసిద్ధి

మనుగ్రహేణ " అని పుత్త్రుఁడు స్వాములనుజూచి ప్రార్థించి, ఆయనుజ్ఞ సంభావనను సమర్పించి, స్వాచార్యారాధనము జేసి, అనంతరము ముంగిటియందుగాని లోపలగాని అలికి ఒంటి ముగ్గుపెట్టి, అరటియాకువేసి, దానిమీద బియ్యమును నెఱపి, నాలుగుమూలలయందు నాలుగుకలశములను మధ్యయందొక పెద్దకలశమును నూలుదారముచుట్టియుంచి, ఆకలశములలో జలమునుపూరించి, స్వర్ణపుష్పమునుంచి, మామిడాకునుంచి, తెంకాయపెట్టి, వస్త్రమును ధరింపజేసి, పుష్పచందనములనలంకరించి, దర్భకూర్చలనునుంచి, కర్మకర్తయైన పుత్త్రుఁడు తూర్పుముఖముగాను, యాజ్ఞికుడు (పురోహితుఁడు) ఉత్తరముఖముగాను కూర్చుండవలయును. తక్కినస్వాములందఱును పరివేష్టించి యుండవలయును. పురోహితుఁడు కర్తకెదురుగానుండు కలశమునుండి " శ్రీశైలేశదయాపాత్రం " అని ఆరంభించి, " గురుముఖమనధీత్య " అను శ్లోకమువఱకు అనుసంధించునట్లుచేసి, " నమః " అని ఆళ్వారాచార్లను ఆవాహనముచేసి మానసీకముగా షోడశోపచారములనుజేసి, తత్కాలోచితమైన పాశురములను స్వాములు సేవించి కుంభములకంతయు నొక్కమాఱుగానే " స్తపయామి " అని అక్షతలువేసి పునః పూజ చేయవలయును.

ఆమీద, వేఱొకస్థానమునందు శుద్ధిచేసిన పలకనుంచి, ఆ చరమవిగ్రహమును ఉత్తరశిరముండునట్లు పరుండబెట్టి పుత్త్రుడు మొదలగు సకలమైన బంధువర్గమువారు ప్రత్యేకప్రత్యేకముగా నూనెను తాకి శిరస్సునందుంచి, అక్లే సీకాయయునుంచి, మున్ను తెచ్చిన బిందెలలోని జలముచేత స్నానముచేయించి, ఆమీద పంచకలశముల తీర్థముచే స్నానముచేయించి, తడియొత్తి, ద్వాదశోర్ధ్వ పుండ్రములను ధరియింపించి, పెరుమాళ్ సన్నిధి తిరుమాలచాత్తుపడికావించి, వస్త్రభూషణములచే నలంకరింపించి, ఆపంచకలశములను దక్షిణసహితముగా స్వాములకు సమర్పించవలయును.

---



## శ్రీచూర్ణపరిపాలన క్రమము.

ఆతర్వాత ఉత్తరముఖముగానుండు పురోహితుడు, తూర్పుముఖముగానుండుకర్తకు, అశేషశ్రీవైష్ణవపాద మూలంసమర్పయి, ఇమాం......పితుః అక్షయపరమపదప్రాప్త్యర్థం, కోవెల, తిరుమల, పెరుమాళ్ కోవెలస్వాములును జీయర్లును శ్రీవైష్ణవులును వేంచేసి, శ్రీచూర్ణపాలనము చేయవలయునని పురోహితులుచెప్పి, కర్తయు ఆప్రకారమే స్వాములనుజూచి ప్రార్థించి, నారాయణబలిచేసినచోట, శుద్ధిచేసిసరోటికిని రోకలికిని కొత్తవస్త్రమును, తిరుమణి శ్రీచూర్ణమును ధరింపఁజేసి, దర్భను మామిడాకులుకట్టి, ఒకదొప్పయందు చాదిన తిరమణిని, మరొకదొప్పయందు చాదినశ్రీచూర్ణమును, ఒకదొన్నెలో నేయియుంచి, కర్మకర్తమొదలగు భాగవతులు రోకలినిదీసి రామానుజ నూత్తందాదిలో "మొయ్‌శ్రీమైక్కడక్కుం పెరుంపుకళా౯" అను పాశురమును అనుసంధించి, రోకటిచేత ముమ్మాఱు రోటియందు మెల్లగా దంచి, రోకలిని క్రిందుగానుంచి, ఆతర్వాత మూఁడు దొన్నెల నొకతట్టయందుంచి స్వాములు, బంధువులు, మిత్రులకు వినియోగము జూపవలయును. వారు ఒక్కవ్రేలితో నేతినిఅద్దుకొని తిరుమణిశ్రీచూర్ణమును తాకి ముఖమందుంచుకొనవలయును. ఇట్లు పుత్రుడు మొదలగు వారందఱును ధరించుకొన్న మీఁద పుత్త్రునిచేతిలో చరమవిగ్రహమునకు ధరింపఁజేసి, చరమవిగ్రహము వేంచేయుమార్గమునందు జలమును ముమ్మాఱు ప్రోక్షించవలయును. ఆతర్వాత,

## అగ్నిసంస్కార పద్ధతి.

కర్త స్వాములనుజూచి, "మమపితృ అక్షయపరమపదప్రాప్త్యర్థం తుషాగ్నినా సంస్కారం కర్తుం యోగ్యతా సిద్ధిం అనుగృహేణ " అని దక్షిణసమర్పించి, జలమునెత్తి అగ్నికి అపసవ్యముగా చతురస్రముగా ప్రోక్షించి, తిరుమంత్రమును "శూఙ్గ్ విశుం పణిముకిలై" అనుపాశుర

మును అనుసంధించి, సమిథలనుంచి, అత్తియాకు, లేకమామిడాకు చేత ఆజ్యమును అగ్నియందాహుతిచేసి, దర్భకూర్చలచేత జలమును అపసవ్యముగా ప్రోక్షించి, చరమవిగ్రహమును పుత్రుడు రెండుచేతులతో వస్త్రమును కప్పినమీాద, పుత్రుఁడుహోమముచేసిన అగ్నిభాండమును చుట్టుకుదురుమీాదనుంచి యెడమచేతబట్టుకొని గృహమునుండి వెడలి చరమవిగ్రహమునకుముందుగా నిల్వవలసినది.

అనంతరము చరమవిగ్రహమునకు చక్కగావస్త్రములను కప్పి గృహమునుండి పాదములుముందుగాను శిరస్సువెనుకగాను వేంచేపించుకొని, గోవిందనామోచ్చరణముతో బయటికిగొనివచ్చి కటుకుపైనుంచి చక్కగాబంధించి, అగ్నిముందుగను, చరమవిగ్రహము వెనుకను, బంధుమిత్రాదులతోగూడి ముందువెనుకగను చరమ తిరుమంత్రమునందలి ఉత్తరవాక్యమును, పరమపదసోపానమును అనుసంధించుచును సంస్కారప్రదేశమునకుపోయి, ఉత్తరముగా శిరస్సుండులాగుననుంచి, వెంటవచ్చిన బంధువులు తెచ్చిన జలముచే చితిపై ప్రోక్షించి, చరమవిగ్రమును బంధములువిప్పి తీసికొనిపోయి చితిపైనుంచి, అగ్నిస్థాలియందున్న అగ్నిని చితికిపశ్చిమముగ దిగువక్రమ్మరించి, కొంచెమునిప్పును పిడుకయందుతీసికొని, తూర్పుముఖముగానిల్చి, చరమ విగ్రహముయొక్కఊర్ధ్మునందు పిడుకలతోఅగ్నియుంచి, తిరుమంత్రముచేత ఆజ్యాహుతిచేసి, జలముచేత దక్షిణమునుండి పడమరవఱకునుప్రోక్షించి, దండము సమర్పించి, తీర్థఘట్టమునకువచ్చి, నగ్నశ్రాద్ధముచేసిన మీాఁద, బంధుమిత్రులు చందనకాష్ఠాదులనుపేర్చి, జాగ్రత్తతో దహనము చేయవలయును. ఆతర్వాత అందఱును తీర్థమాడి గృహమునకువచ్చి పుణ్యాహవాచనముచేసి భోజనముచేయవలయును.

రెండవదినమునందు సంచయనమును, 11వ దినమునందుపుణ్యాహవాచనమును, ఆ దినమునందే ద్రావిడవేదసేవాకాలమునకు ప్రారంభించి మరునాడు (12 వ దినమున) సమాప్తిచేయవలసినది. పురుషులకు



తిరుమంత్రమును కుడిచెవియందును, స్త్రీలకు ఎడమచెవియందును ఉపదేశము చేయవలయును. కర్త ఎవరినిగూర్చి కర్మచేయునో ఆ వరుసగలవారిని ఉచ్చరించునట్లుగా పురోహితుఁడు చెప్పవలయును. (అనఁగా మాతా, పితృ మొదలగు వరుసలను అని తెలియునది.) ఇదిగాక కర్మవిధానము ననుసరించి పరమపదించిన చరమ విగ్రహము యమపురమునకు అడ్డుబాటులేకపోవుటకై దక్షిణ శిరస్సుగా పరండుబెట్టవలయును. వైతరణీనదినిదాటి సుఖముగా యమలోకముచేరుటకై వైతరణీగోదానమును చేయవలయును. ప్రపన్నులగువారు ఇత్యాదికర్మలను చేయరు. ఏలన, వీరికి వైకుంఠలోకమేప్రాప్తిగాన యమలోక సంబంధమైన కర్మలు చేయరు.

శ్రీవైష్ణవ సన్న్యాసులకును పై విధముగనే అన్నికార్యములను చేయుదురు. అయినను కొన్నివ్యవస్థలు వేఱుగనున్నవి. నిర్ణయకాలమున చరమవిగ్రహమును పద్మాసనముతో వేంచేసియుండునట్లుగానుంచి, బ్రహ్మరథమున వేంచేపించుకొని పుష్పవృష్టినిగురిపించుచు సంస్కారభూమికిగొనిపోయి ఎనిమిదిఅడుగులవెడల్పు, అంతనిడివి, అంతలోతుగల గుహయందు ఉప్పును కర్పూరమునుపఱచి, చరమవిగ్రహమునుంచి, బ్రహ్మరంధ్రముభేదించునట్లుగా శిరస్సున తెంకాయలుగొట్టి, ఆమీాద లవణము, మృత్తిక వీనితో తిరుప్పళ్లిచేర్చి, మీాఁదుగ బృందావనము నిర్మింపవలయును. తర్వాత తిరువారాధనచేసి అందఱును తీర్థప్రసాదములను స్వీకరింపవలసినది.

---

చంద్రవంశ క్షత్త్రియులైన గౌరవులనెడి బలిజవారికి ఆదికాలమునందు శిఖాయజ్ఞోపవీత ధారణములుండెను. కొంచెముకాలమునకుముందు తిరుక్కోవలూరియందు వేంచేసియున్న ఎంబెరుమానార్ జియ్యరుగారు కొందఱిని ప్రపన్నానుష్ఠాన పరులనుగాను, కొందఱిని కర్మానుష్ఠానపరులనుగాను నుండునట్లునియమించిరి. వీరిలో ప్రపన్నాను

ష్ఠానపరులకు శిఖాయజ్ఞోపవీతములులేవు. కర్మానుష్ఠాన పరులగువారి కందఱికిని నేటికినిగలవు. ప్రపన్నులనుజూచి కొందఱు తెలివిలేక శూద్రులని చెప్పుచున్నారు. జాత్యాదిగౌరవములు ప్రపన్నులకు ప్రతిబంధకముగానున్నది. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనెడి చరమ శ్లోకార్థము నెఱుంగనివారే కులగౌరవాదులను గోరుదురని ఎంబెరుమానారు జియ్యంగారు ప్రపన్నులకు బోధించియున్నారు.

మఱియు శిఖాయజ్ఞోపవీతములేనంతమాత్రమున నే శూద్రత్వము సంభవించునన్నట్లైనచో, శంకరాచార్యాది మహాత్ములందఱును శూద్రులే కావలసివచ్చును. కనుక ప్రపన్నులకు శిఖాయజ్ఞోపవీతములు అనావశ్యకమని తెలియవలయును. ఇదిగాక యజ్ఞోపవీతమునుధరించియుండు గౌరవులందఱును క్షత్రియులనియును, యజ్ఞోపవీతమును ధరింపని గౌరవులందఱును బ్రాహ్మణులనియును, వైష్ణవులనియును, ప్రపన్నులనియును, బ్రహ్మచారి స్వాములవారు వ్రాసియున్నారు.

---

## పదునేడవ అధ్యాయము.

### పేటబలిజవారు.

ఇదివఱకును చంద్రవంశక్షత్రియులైన కోటబలిజవారి చరిత్ర చెప్పఁబడెను. ఇఁక పేటబలిజవారి చరిత్రము చెప్పఁబడును:—

పేటయనఁగా కోటకువెలుపలనుండు గ్రామములు. పూర్వము విజయనగరముయొక్క కోటకువెలుపలనున్న బలిజవారికి పేటబలిజవారని పేరుకలిగినది. ఈ పేటబలిజవారును విజయనగర రాజులకు బంధువులై యుండిరి. ఆతర్వాత కాలదేశవర్తమాన వ్యత్యస్తములచేత వర్తకము వ్యవసాయము మొదలగు వృత్తుల నవలంబింపవలసివచ్చెను. వీరిలో పూర్వము 18 తెగలుండెను. ఇప్పుడు రత్నాలవారు (జాళ్లవారు), ముత్యాలవారు, పగడాలవారు, గాజులవారు, చిత్రాలవారు,



ఒప్పనవారు, వెలమవారు, కమ్మవారు, పెరికవారు, గొల్లవారు, మునుకువారు, లింగవారు, పూందమల్లివారు, కోయిలడివారు, ఖండివారు, పత్తివారు, జనపవారు, వాడవారు, కన్నడబలిజవారు, ఎద్దుకన్నడబలిజవారు, ఎనుముకన్నడ బలిజవారు, సెట్టి బలిజవారు, ఉప్పు బలిజవారు, అని పలు తెగలువారుగానున్నారు.

వీరందఱును పూర్వకాలమున నొకేకుటుంబస్థులుగా నుండియుందురని తోఁచుచున్నది. కాలవ్యత్యాసముచేత వేఱువేఱు తెగలవారై పోయి పలువిధములవృత్తుల నవలంబించిరి. వృత్తులకుందగినట్లుగా ఆచారవ్యవహారాదులును వేఱుగా మాఱెను. అయినను వీరిలో గొందఱినిగూర్చి చెప్పఁబడుచున్నది:—

రత్నాలబలిజవారును గాజులబలిజవారును పేటబలిజవారిలో శ్రేష్ఠులు. వీరిలో రత్నాలబలిజవారు ఆదియందు విజయనగరరాజులకురత్నాదులను దూరదేశములనుండి తెప్పించియు, పోయి తెచ్చియు నిచ్చుచుండిరి.

గాజులబలిజవారు ముత్తైదువులకు కావలసిన పసుపు కుంకుమము కస్తూరి మొదలగువస్తువులను, గాజులను తెప్పించి సంస్థానమువారికిప్పించుచుండిరి. వీరియందుగల శ్రేష్ఠగుణమునుబట్టి వీరికి దేశాహిశ్రేష్ఠి, నగరశ్రేష్ఠి అను బిరుదులునిప్పించిరని తోఁచుచున్నది.

దేశాహిపట్టమువచ్చినదానికి కారణము:— ఆదియందు దేశము నెమ్మదిగానుండినందున అపూర్వముగా వ్యాజ్యములు జరుగుచుండెను. అట్టి వ్యాజ్యములను రాజే విచారించుచుండెను. రాఁగారాఁగా ఈ దేశమునందు అన్యమతములు వృద్ధియైనందునను, అన్యమతస్థులు రానారంభించినందునను రాజులు సదా యుద్ధవిషయ విచారమునందే కాలముగడుపవలసినవారైరి. అందుచేత యోగ్యులగు వారికి గ్రామపరిపాలనాధికారముల నిప్పించి, వారికి దేశాహిశ్రేష్ఠి, లేక నగరశ్రేష్ఠి, అను బిరుదులనిచ్చి వారివారి గ్రామములందు జరుగగల వ్యాజ్యము

లను, శుభాశుభకాలములందుజరుగు వ్యాజ్యములను, ఆయా మతస్థులలోగలుగు కులవిషయ వ్యాజ్యములను, విచారించునట్టి అధికారము నొసంగిరి. అదిమొదలు గ్రామాదులయందు వ్యాజ్యములనంతయు దేశాహిశ్రేష్ఠులే విచారించుచుండిరి. మఱి కొంతకాలమునకు ఈ దేశాహిశ్రేష్ఠులకును గ్రామవ్యాజ్యములను విచారించుటకు సాధ్యముకానంత ఎక్కువ వ్యాజ్యములేర్పడినందున తమకులముయొక్క మంచిచెడ్డలను మాత్రమే విచారించుకొనుచునుండిరి. ఇప్పుడును వీరికి యీ అధికారము గలదు. ఇట్టి దేశాహి అధికారము శ్రీరాములవారి కాలమునందే యున్నట్లుగా వాల్మీకిరామాయణమునందు, శ్రీరాములవారు లంకయందుండి జయముతో అయోధ్యకుపోవునప్పుడు కావించిన నగర శృంగారాది నిర్మాణ విచక్షణయె చెప్పక చెప్పుచున్నది. ఇదిగాక క్రీస్తుపుట్టిన 1011 లో రాజ్యమేలుచున్న రాజేంద్రచోళుని కాలమునందే దేశాహిపట్టమున్నట్లుగా 1900 సం॥ ఇండియన్ రివ్యూ గ్రంథము మొదటిసంపుటము 503-505 పుటలయందు వ్రాయంబడియున్నది.

(1) విజయనగర సంస్థానము మంచిస్థితిలోనున్నపుడే అపుడపుడు రాజవిరోధులతో నెదిరింపవలసియుండినది. అందుచేత కులముయొక్క కట్టుదిట్టములను విచారించుకొనుటకై, పేటబలిజవారిలో రత్నాలబలిజవారికిని, గాజులబలిజవారికిని దేశాహిశ్రేష్ఠి పట్టమును కొన్నిబిరుదులు నియ్యబడెను.

(2) దక్షప్రజాపతికుమార్తెదాక్షాయణీదేవి తనకాభరణములు లేదని తండ్రితో మొఱబెట్టుకొనఁగా, దక్షుడు బ్రహ్మదేవునితో ఆలోచించెను. అంత చతుర్ముఖుఁడు యాగమునుచేయుమని చెప్పెను. ఆలాగే దాక్షాయణియజ్ఞముచేయగ అంకుండియొక మహాత్ముడుదయించి ఆకన్యకకుకావలసిన చందన కుంకుమాదులను, కంకణము మొదలగు ఆభరణములనిచ్చెను. అదిమొదలు బలిజ అని పేరుకలిగినది. బలి=యజ్ఞమునందు, జ=పుట్టినవాఁడు. ఈకారణముచేతనే వీరు గౌరీదేవిని యిష్ట



దైవముగాగొనిరి. అందుచే వీరికి గౌరవులనియును పేరుకల్గెను. గౌరీదేవికి రత్నాభరణములొసంగినందున రత్నాలవారనియును గాజులవారనియును పేరుగల్గెను.

(3) గాజులబలిజవారనుటకు మఱియొక కారణము:—ఆదియందు ఈ బలిజవారు ముత్తైదవులకుకావలసిన వస్తువులను దేశదేశములకు గొనిపోయి విక్రయించుచుండిరి. అట్లే ఒకప్పుడు కాంచీపురమునకును బోయి విక్రయించుచున్నపుడు వీరియొద్దనున్న అద్దమును కాంచీపురి రాజైన ధరణిరాజుకుమార్తె తనకు క్రయమున కిమ్మనియడిగెను. ఆయద్దము కామాక్షిదేవికి సమర్పించుటకై తెచ్చినందున యిప్పించుటకు కాదని చెప్పఁగా, రాజు ఈసంగతిని తెలిసికొని మీవ్యాపారవస్తువులకు సుంకమీయవలసినదనిచెప్పెను. ఈబలిజవారు సుంకమీయడములేదని నిరాకరించగా, రాజు బలాత్కారముగా వీరిపైబడి యుద్ధముచేయ నారంభించెను. బలిజవారు ఆఘాతకోర్వక కామాక్షిదేవికడకుబోయి మొఱయిడగా, ఆదేవి ఆరాజునుపట్టి కడుపుచీల్చి వానిప్రేగులను గాజులమలారముగను, వాని తలపుఱ్ఱెను గాజులను అతికించు అగ్నికుండముగను, వానిదవడలను పట్టుకాఱుగను చేసికొనుడని బలిజ వారికిచ్చి వానితోలును కంబళిగానుంచుకొనుడని చెప్పినదేగాక ఆకంబళినిఎడమకాలిపెద్దవ్రేలితోనే యెత్తుకొనవలయునని అనుగ్రహించెను. అదిమొదలు వీరు గాజులబలిజవారనేపేరుతో కామాక్షిదేవిని యిష్టదైవముగాగ్రహించిరి. వీరు గౌరీదేవిని పూజించుటచేత గౌరవులనఁబడుచున్నారు.

(4) పైనచెప్పినకథయేమఱియొకవిధముగానున్నయది—ఎట్లన, ధరణిరాజుయొక్క చెఱసాలయందున్న త్వష్టాచార్యతలను నరికివేయగా ఆతల కామాక్షిదేవిపాదములపైబడి మొఱపెట్టినంత, కామాక్షిదేవి ధరణిరాజునుచంపి వానిప్రేగులను బలిజవారికి మలారముగా నిచ్చినట్లు చెప్పఁబడియున్నది.

గాజుల బలిజవారికి కుడిచెయ్యివారని వచ్చినందులకు కారణము:—పరిమళచోళునిపట్టమునకు పణ్బురిచోళుడువచ్చినపుడు క్రమముగా యువరాజు పట్టమును పరిమళచోళునకిప్పించక తనకుమారుడైన పాలనచోళునకిచ్చినందున, రాజకుటుంబములో కుడిచేయి, ఎడమచేయి అనెడి రెండుకక్షులుకలిగినది. అప్పుడు రాజుతరపునచేరినవారందఱును కుడిచేయివారనియును, ప్రతివాదిప్రక్కచేరిన వారందఱును ఎడమచేయివారనియును పేర్కొనబడిరి. ఇందులో కుడిచేయి కక్షివారిలో ముఖ్యులు దేశాహిబలిజవారుగానుండిరి. ఇంతేగాక వీరికి అనేకబిరుదులును నీయఁబడెను. వీరు 18 జాతులవారిలోగల వ్యాజ్యములను తీర్పుచేయుచునుండిరి.

ఎడమచేయికక్షివారికి ముఖ్యులుగానున్నవారు కంసాలవారు. ఈవిషయము చిత్తూరుజిల్లాతీర్పును చూడఁగాఁదెలియును.

---

బలిజవారియొక్క ఉత్పత్తి మొదలగువానిందెలిపెడి "గౌరీపుత్ర పురాణ" ప్రకారముగా నీదిగువ వ్రాయఁబడుచున్నయది.

బ్రహ్మాండపురాణము ఉత్తర ఖండమునందు గౌరీపుత్రుల ఉత్పత్తినిగూర్చి చెప్పఁబడియున్నది. జనమేజయుడు వైశంపాయనునితో కుంతిదేవియే యుద్ధమునకు ముఖ్యకర్త్రియనెను. దానికి వైశంపాయనుఁడు జనమేజయునింజూచి యిట్లనియె:—కుంతిదేవి కారణముకాదు, పూర్వము పార్వతిని శివునికిచ్చి పెండ్లిచేయ నిశ్చయించి హిమవంతుడు సకలదేవతలను రప్పించియుండెను. ఆవచ్చినవారిలో బ్రహ్మదేవుడు పార్వతినిజూచిమోహించెను. ఆసంగతి శివుడెఱింగి వానితలను ఖండించగా ఆతలపుఱ్ఱె శివునిచేతిలో అంటుకొనెను. అపుడు శివుడు దుఃఖించుచు విష్ణువునొద్ద మొఱఁబెట్టుకొనఁగా, విష్ణువు ఓశివుఁడా! నీవు కాశికిపోయి 16000 ఏండ్లు బ్రహ్మదేవుని కపాలమున భిక్షాన్నము



గ్రహించి కాలము గడపుచుంటివేని ఈ కపాలము నీచేతినివిడిచిపోవునని చెప్పగా, శివుఁడట్లే కాశికిబోయి భిక్షాన్నముతో 16000 ఏండ్లు కాలము గడపుచుండెను. అప్పుడాకడపటిసంవత్సరమున కాశియందు మాధవస్వామి సన్నిధికిబోయి భిక్షాన్నమును వేడగా, లక్ష్మీదేవి భిక్షము పెట్టునపుడు కొన్ని మెతుకులు క్రిందపడెను; ఆమెతుకుల నేర్పఱుచుటకై కపాలము శివునిచేయివిడిచి క్రిందికి జారగా, శివుడిదే సమయమని పఱుగిడిపోయెను. ఆకపాలము శివునింగానక నలుప్రక్కల సంచరించుచు లోకమునుదహించుచురాగా, విష్ణువు ప్రసన్నమై కపాలమునుజూచి ఓ బ్రహ్మకపాలమా! 16000 ఏండ్లు భిక్షాన్నమునుదినియు దృప్తికాలేదా? యనగా, కపాలము—స్వామీ! రక్తపానముచేయనిది నాకు తృప్తిలేదనఁగా, విష్ణువు—ద్వాపరయుగమున క్షత్రియులు యుద్ధముచేయుదురు, ఆరక్తమును నీవు పానముచేయుము, అంతవఱకు లోకమును పీడింపకుండుమనగా, కపాలము సమ్మతింపలేదు. అప్పుడు అచ్చటనున్న ఋషులలో నొకరైన మార్కండేయ లిట్లనుచున్నారు. మున్ను గౌరీదేవిచేసినట్టి యాగమునందు గౌరీపుత్రుఁడనువాఁడు పుట్టి లోకమునంగల ముత్తైదువులకు వలయు చందన కుసుమ కుంకుమాదుల నొసంగుచున్నాఁడు. వాఁడీ కపాలమును భరింపఁగలఁడనెను. అంతవిష్ణువు గౌరీపుత్రుని రప్పించి వానిచేతికి కపాలమునిచ్చెను. వాఁడా కపాలమును భరించినంత దేవతలందఱును మిగుల సంతోషించి ఆగౌరీపుత్రునకు పట్టపుసెట్టిగారు అనుబిరుదొసంగి;బలిజవారు, జాండ్రవారు, భోగమువారు, జనపవారు,ఈడిగవారు, సివియరువారు, మంగలవారు, ఏనాదివారు, ఎఱుకులవారు, బోయవారు, పండివారు, ఒడ్డెవారు, ఉప్పరవారు, లంబాడివారు, దేవరవారు, మాలవారు, అను 18జాతులకు అధిపతిగాను నుండునట్లు నియమించిరి.

అపుడు విష్ణువు మొదలగుదేవతలు గరుడధ్వజ, హంసధ్వజాది అనేకధ్వజములను, భేరీకాహళాది వాద్యములను అనుగ్రహించిరి.

ఇట్లు గౌరీపుత్రుడు దేవతలచే నీయఁబడిన గౌరవబిరుదులను పొంది జాతిధర్మమునుపాలించుచుండు సమయమునందు, ద్రుపద మహారాజు యజ్ఞముచేయ నారంభింపఁగా, ఆయజ్ఞమునందు ఈ కపాలముపోయి పడి ఆహుతియయ్యెను. ఆయగ్నియే ద్రౌపదిగా పుట్టెను. ఈ వృత్తాంతమును తెలిసిన ధర్మరాజు కృష్ణునింబంపి గౌరీపుత్రుని రావించి చాలా మర్యాదలుచేసెను. అపుడు శ్రీకృష్ణమూర్తియు, పంచపాండవులును మరియునుగల పాండవుల బంధువులును తమతమయోగ్యతకుంగల బిరుదులనిచ్చి గౌరవించిరి. కనుక ద్రౌపదీదేవియే యుద్ధమునకు కర్త్రియేగాని కుంతిదేవికాదని వైశంపాయనుడు జనమేజయునకుం జెప్పెను. (ఈకథవలన గౌరీపుత్రుని చరిత్రమును బోధమగుచున్నది).

---

## పదునెనిమిదవ అధ్యాయము.

### ఆంధ్రదేశమునందు ప్రచారముగానుండు శాసనములు.

ఈ శాసనములు దేశాహిశ్రేష్ఠుల గౌరవములను తెలియఁజేయుచున్నవి. ఇవి రాయని మంత్రిభాస్కరునికాలమునందు కల్గినవి.

మహారాజశ్రీ అలంగరు పాదుషావారు మంత్రీమహానాటివారి దయచేయించిన ఫర్మానా.

స్వస్తి సమస్త త్రిభువన విపులజ్ఞాన వీరవీరావతారులున్ను, గరుడధ్వజ, సింహధ్వజ, బిరుదాంకమాలికా ప్రశస్తధారులున్ను, దేశింగురాయరాజ్యస్థాపనాచార్యులున్ను, అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజాది ఛప్పన్న దేశాధీశులును, వైడూర్య గోమేధిక పుష్యరాగాది నవరత్నాధికారులున్ను, హరి, హర గురుభక్తిపరాయణులున్ను, పరనారీ సహోదరులున్ను, మాళిపట్టభద్రులున్ను, అయిన స్వస్తి సమస్తకలనామాంక మాకాదప్రశస్తధారులున్ను, విప్రముఖ్యులైన రాయనిమంత్రిభాస్కరులు మొదలయిన సాలుమూలసమయ పెక్కండ్రున్ను, శ్రీమహాకళ్యాణ ధారులున్నుఅయిన మంత్రిమహానాటివారికి దయచేయించిన పట్టా పాదుషాఫర్మానా.



అలంగరు పాదుషా సౌరాష్ట్రి దుర్గాలు సాధించి అశ్వపతి, నరపతి, గజపతి ముగ్గురు రాజులున్ను, సౌరాష్ట్రి దుర్గాలవారున్ను, ఛప్పన్న దేశాధీశ్వరులున్ను, ఈ దేశాలమంత్రీమహానాడున్ను, ముప్పదియిద్దరు సరదారులున్ను, అంతా గోలకొండలో పాదుషాగారు కూర్చుని సమస్తమైనవారున్ను కొలువుతీర్చియుండగా దేశాలుఅన్నీ సాధించి వస్తిమిగదా? దేశాలవారికి గెలుపు తాంబూలము యిప్పించవలెను. సౌరాష్ట్రి దుర్గాలవారున్ను, ఛప్పన్న దేశాలవారున్ను, ముప్పదియిద్దరు సరదార్లున్ను రావలసినదిగనుక, వీరిని సముఖమునకు బిలుపించుమని ఆజ్ఞయిస్తే, సమస్తమైనటువంటివారు సముఖమునకు వచ్చి, తాంబూలమందక సమయము కట్టినందువల్ల, అందులో తగు మంత్రులబిలుపించి పాదుషాగారు అడిగిన యుత్తరము. మిమ్మున పిలుపిస్తే యింగువచ్చి తాంబూలము పుచ్చుకోక సమయంకట్టిన కారణమేమనిఅడిగితే, మంత్రులు విన్నపములుచేసినమాట—సౌరాష్ట్రి దుర్గాలవారు, (౫౬) యేబదియారు దేశాలమంత్రి మహానాడున్ను, (౩౨) ముప్పదియిద్దరు సరదార్లున్ను, యేకముగా పాదుషాగారితోవిన్నపము చేయుమన్నయుత్తరం.

మైగాలపు బెజ్జినీడు, కనకాలనల్లాపాత్రుడున్ను, కంచి కామాక్షమ్మవద్ద వరప్రసాదులు, మహా సత్యసంపన్నులున్ను, యితని సత్యమువలన అమ్మవారు ప్రసన్నమగుచున్నది. మంత్రిభాస్కరుడు, బెజ్జినీడు, సమయముకట్టిన మహానాటివారు అంతా కూడుదామని కూర్చుండియున్నవారు. వారిని పిలిపిస్తేనేగాని మరియెవ్వరూ తాంబూలము పట్టరు, వారు సత్యసంధులైన వరప్రసాదులు, అతనితండ్రి మైగాల పృథ్విశెట్టి, అతని తాత బిజ్జినీడు, వర్ణాశ్రమములయొక్క పద్ధతులు యెక్కువ తక్కువలు నడుస్తూవున్నారనిన్ని—

౧ చాపకుపన్ను, ౨. కుంచములకుపన్ను, ౩. గంటాలకుపన్ను, ౪. బూడిదెకట్నము. యిటువంటివాటికి పన్నుకట్టి పుచ్చుకుంటూ యు

న్నారు. అటువంటిఅప్రతిష్ఠలు దేశాలవెంబడి చాలా ఉదాసీనము ఆక్షేపణలు పొందుతూవున్నారు. ఈపద్ధతి మానిపించవలసినదనిన్ని; సౌరాష్ట్రదుర్గాలవారు, ఛప్పన్నదేశాలవారు, మంత్రిమహానాటివారు, యీయుదాసీనపుపన్నులు పుచ్చుకోకుండా విడిచి బక్షాయించుమని మంత్రిమహానాటివారు యేలినవారితో విన్నపముచేస్తారు. అని మంత్రులువిన్నపముచేస్తే పాదుషాగారు మాకు వచ్చే అర్థము చాలానష్టము వస్తుంది, అని సెలవుయిస్తే, అపుడు మంత్రిభాస్కరుడు, బెజ్జినీడు, కనకాల నల్లాపాత్రుడు, యెదుటనుండి పాదుషాగారితో విన్నపముచేసేలాగున సెలవుదయచేయిస్తే దేశాలవెంబడి సంతలు సాగించి సాయరుకట్టించి దివాణముకు అర్థముభర్తీచేస్తాము. అన్నపిమ్మట, అశ్వపతి, గజపతి, నరపతి ముగ్గురు రాజులున్ను, సౌరాష్ట్రదుర్గాలవారున్ను, ఛప్పన్నదేశాలవారున్ను, సరదారులున్ను, మంత్రిమహానాడున్ను, సమ్మతించినతరువాత బెజ్జినీడుని నల్లపాత్రుని పాదుషాగారు మీరు అడుగునట్లు జరిగిస్తాముగదా, మాకు నజరు యేమి యిస్తారు అని అడిగితే, అడిగిన నజరుకు అర్థము దేశాలవెంబడిని పంపిణీచేసినపక్షముకు కీర్తి పౌరుషములు భూమియందు ప్రసిద్ధిలోనికి రావలెనని, కంచికామాక్షమ్మను ప్రార్థనచేసి, కామాక్షమ్మ వరప్రసాదియైన బెజ్జినీడు అమ్మవారితో మనవిచేసిన యుత్తరము; పాదుషాగారు అడిగినచోట కల్లకాకుండ మహాలుచుట్టూ అడుగుతప్పించి అడుగునకు (౧౨) పద్రెండు కణజాలద్రవ్యముచూపించవలసినదని కోరుకుంటే, కోరిన ప్రకారము కామాక్షమ్మ వరమిచ్చిన తరువాత, పాదుషాగారిని బెజ్జినీడు మహాలుచుట్టూ త్రవ్వించుకొమ్మని మనవిచేసెను. ఆప్రకారము తవ్విస్తే పైనచెప్పినప్రకారముకనంబడెను. ఈప్రకారమే యెప్పటికీ యిప్పించుమని అడిగితే, కామాక్షమ్మవరము ఆప్రకారము లేదని బెజ్జినీడు చెప్పిన తరువాత, సరదారులున్ను, సౌరాష్ట్రదుర్గాలవారున్ను, ౫౬ (యేబదియాఱు) దేశాలవారున్ను, మంత్రిమహానాటివారున్ను, అందరూ యేకవాక్యముగా సమ్మతించిన



మీదట, అలంగరుపాదుషా సంతోషించి అందలము, పల్లకీ, చక్రవాళపుగుబ్బగొడుగు, అరిగె, ఆలవట్టము, సురటీ, వింజామర, వేత్రుమాలు, జనవశంకరబిరుదు మొదలగు పండ్రెండు (౧౨) బిరుదులు, భేరీమృదంగవాద్యములతో ఛప్పన్న దేశాలయందున్ను నిండుమ్రోవ, బాకాలతో పట్టుసుఖాన పెత్తనము నడిపించుమని వర్ణాలవారివల్ల రశ్మి తేజోపార్జనములు, పుత్రపౌత్రపారంపర్యం అనుభవిస్తూ, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు మొదలగువర్ణాలతో రాయనమంత్రిభాస్కరుడు బెజ్జినీడుతోచెప్పిన యుత్తరము. మిగిలిన పెక్కండ్రు జాతులలోనున్ను, యేమి తగువున్నా నీవేతేరుగడచేయవలసినది. ముందరగంధతాంబూలము మహానాటివారిలో నడిపించుకొనేది. కులాలలో నేమితప్పున్నా ద్రోహమున్నా తప్పుపుచ్చుకునేది. వారినినివారించి తేరుగడచేసేది. అని సమస్తమైనవారి యనుమతిని తాంబూలము పాదుషాగారు యిచ్చిన తరువాత, ముప్పదియిద్దరు సరదార్లున్ను గుజ్జము కోకలుయిస్తే పుచ్చుకున్నారు. రాసౌష్ట్రదుర్గాలవారికి తాంబూలము యిప్పిస్తూవున్నాము. ఏదుర్గానికి మునుపుగా విలియా తాంబూలము యివ్వవలయునని అడిగితే కొత్తపల్లి (కొండపల్లీ కావచ్చును) దుర్గానకు ముందుగా విలియా తాంబూలము యివ్వవలయునని చెప్పినతర్వాత, బట్టుకవిరాజు పాదుషాగారికి ఖూనీసలాముచేసి ఆదినియోగియైన రాయనిమంత్రిభాస్కరునితో అడిగిన యుత్తరం; నీవు అయితే ఆదినియోగివేకాని యీపంచాణమువారు సంకును, దాగటిని, నాగటిమీదను సుత్తిపని చేస్తూవున్నారు గనుక యిదిసమయము; పదునెనిమిది జాతులవారిలో అవుదురో కారో అని అడిగినపిమ్మట పంచాణమువారు మహానాటివారితోఁ దిరుగబాటుగా చెప్పిన యుత్తరము; మేము కులాలలోనికి విశ్వకర్మ సంతతివారము. భూలోకమందు కాడి, మేడి, వస్తువాహనాదులు చేయక మీకు జరుగవుగదా, మేమున్న చోటికి మీరు రావలయును గాని, మీరున్న చోటికి మేము రావడములేదు. అని తిరస్కరించి

యుత్తరము చెప్పినతరువాత, పాదుషాగారికి కోపమువచ్చి పంచాణము వారు దేవతలశాపముచేత సభాయోగ్యులుకారని శాపంయిచ్చిరి. మహానాటివారంతా చెప్పిన యుత్తరము. నాడు అగస్త్యమహాముని వారిశాపముచొప్పునమిమ్మునుకులములలోకలియనిచ్చినారుకారు గనుక, నేడున్న మీరు మహానాటివారితో గర్వించి యుత్తరముచెప్పినారు గనుక మాసమయములో కలియనివ్వలేదు సరిగదా, మీరు మీమీ కులాలలో నొకరికొకరు పొందక ద్వంద్వయుద్ధముగా అఘోరింతురు. అని మహానాటివారు శాపముపెట్టిరి. కామాక్షమ్మ వరప్రసాదమువలన వచ్చినశాపముచేతనున్ను, కులభేదములాయెను. నాడు కలియకుండా చేసిన హేతువుచేతను ఇప్పుడున్న కనియనియ్యవలసిన ప్రసక్తిలేదు. అనిన మంత్రిభాస్కరుని బట్టుకవిరాజు బహుజనసింహాసనస్థుడవోయి, భయాకులాధీశ్వరుడవోయి, మహానాటికి కీర్తితెచ్చినవాడవోయి, జయావిజయీభవ,అని పాదుషాగారి సమ్ముఖమందు కైవారముచేసెను. తరువాత, ముగ్గురు రాజులు, సౌరాష్ట్రదుర్గాలవారు, యేబదియారు దేశాలవారు, ముప్పదియిద్దరు సరదారులున్ను, బెజ్జిసీడిని, నల్లామల్లా పాత్రుని విశేషముగా బహుమతీచేసి మెప్పించిరి. తరువాత పాదుషాగారి సముఖమందు సమస్తమైన వర్ణాలవారి వివాహములు మొదలయిన శుభకార్యములయందు బెజ్జిసీడు, నల్లామల్లా పాత్రుడు మొదలయిన మహానాటివారి తాంబూలములు కట్నములు యివ్వవలసినందుకు నిర్ణయించిన పద్ధతుల వైనమున్ను వాహనములు మొదలైనవి నడిచేప్రకారమున్ను యీక్రింద వ్రాయడమయినది.

౧. బ్రహ్మక్షత్రియులు రెండువర్ణములవారికి వివాహకాలములయందు పల్లకీలు, తురంగములు మొదలగు సమస్త వాహనములు నడుచును.

౨. దేవ తెలుకులవాళ్లకు కపిలమహామునిశాపముచేతను, తిలలయొక్క తైలం తీసినందున అయోగ్యత పట్టినది. వీరు మనువంశజులైన క్షత్రియులు, గనుక వీరికి వివాహకాలములయందు పల్లకీలుమాత్రము నడుచును. మహానాటివారికి తాంబూలము యిచ్చుకోవలసినది.



౩. వైశ్యుల పెండ్లిండ్లకు పాలకీలు, తురంగములు నడుచును. వీరు మహానాటివారికి తాంబూలము యిచ్చుకోవలసినది.

౪. శూద్రుల పెండ్లిండ్లకు పాలకీలు, తురంగంబులు మొదలగు వాహనములు నడుచును. ఈశూద్రరత్నంబులు మంత్రులకు సమయమంత్రికట్నము యివ్వవలసినది. ఈశూద్రరత్నంబులు వ్యవహారరీతువును యితరవర్ణాలకుచేసే నిర్ణయము.

౫. సాలీల పెండ్లిండ్లకాలములయందు మూడుకట్టలు తమలపాకులు, సేరుపోకచెక్కలు, రూపాయి కట్నము మహానాటివారికి తాంబూలము యివ్వవలసినది, సాలీలు భావనాఋషిసంతతి గనుక పాలకీలు, తురంగములు నడుచును.

౬. కుమ్మరుల పెండ్లిండ్లకాలములయందు మూడుకట్టలఆకులు, సేరుపోకలు, ఆరురూపాయిలు మహానాటివారికి తాంబూలము యివ్వవలసినది. కుమ్మరులు శాలివాహనుని సంతతివారు గనుక పాలకీలు నడుచును.

౭. కైకాలవాళ్ల పెండ్లిండ్లకాలములందు మూడుకట్టలఆకులు, సేరుపోకలు, ఆరురూపాయలు కట్నము మహానాటివారికిని, ౧ సెల్లా మంత్రులకును, యీప్రకారం మహానాటివారికితాంబూలము యిచ్చుకోవలసినది. కైకాలవాళ్లు షోడచక్రవర్తి సంతతివారుగనుక పల్లకీలు నడుచును.

౮. కరిణీలు (కరిణీబత్తులు) పెండ్లిండ్లకాలమందు మూడుకట్టల ఆకులు, సేరుపోకలు, ఆరురూపాయిలు, మంత్రులకొకసెల్లా యీప్రకారం మహానాటివారికి యివ్వవలసినది. కరిణీలు మాండవ్యముని సంతతివారుగనుక పల్లకీలు నడుచును.

౯. గొల్లవాండ్ర పెండ్లిండ్లకు ౧ కట్ట ఆకులు, పావుసేరు పోకలు, రెండురూపాయిలు కట్నము, మహానాటివారికి యివ్వవలసినది. వీళ్లు యాదవ సంతతి గనుక పల్లకీలు నడుచును.

౧౦. నటకులు అనగా భోగమువాండ్రు. పెండ్లిండ్లకాలముల యందు తాంబూలము రెండురూపాయిలున్ను కట్నము యివ్వవలసి నది. వీళ్లు రంభసంతతి గనుక పాలకీ నడుచును.

౧౧. సానివాళ్ళ పెండ్లిండ్లకాలములయందు తాంబూలము, రెండురూపాయలుకట్నము యివ్వవలసినది. వీళ్లు ఊర్వసి సంతతిగనుక పల్లకీలు నడుచును. నవకోటిసిద్ధులలో యేతప్పులున్నా ఆ తగవులు తీర్చి తప్పులు నిర్ణయించి నేరంకొలది తాంబూలము పుచ్చుకోవలెను.

౧౨. దాసరివాళ్ళ పెండ్లిండ్లకాలములయందు తాంబూలము, అర్ధరూపాయి యిచ్చుకోవలసినది. దాసర్లకు గుఱ్ఱములు నడుచును.

౧౩. ఈడిగవాండ్ర పెండ్లిండ్లకాలములయందు తాంబూలము అర్ధరూపాయికట్నము యివ్వవలసినది. వీళ్లు తెలియమహాముని సంతతివారు గనుక పాలకీనడుచును.

౧౪. గమళ్ళవాళ్ళ పెండ్లిండ్లకాలములయందు మాలవాళ్లువచ్చి గమళ్ళ మందిరాలమీదపడి తోరణములు తెంచి, కామధేనువు శల్యములు కట్టించి, పందిలిపాకలు అన్నీ విరగకొట్టించి, వీధిలోవేసి తగలబెట్టించి, వాహనములు విరగగొట్టించి కూడావేసి కట్టి మహానాటివారి శెలవుప్రకారము నడువక వ్యతిరేకముగా సంచరించినందున వాళ్ళకు వాహనములు మొదలగునవి జరుగవు.

౧౫. మంగలవాండ్ర పెండ్లిండ్లకు మహానాటివారికి తాంబూలము యివ్వవలసినది. వీళ్ళకు గుఱ్ఱములు నడుచును.

౧౬. చాకలవాళ్ళ పెండ్లిండ్ల కాలములయందు మహానాటివారికి తాంబూలము యివ్వవలసినది. వీళ్ళకు గుఱ్ఱములు నడుచును.

౧౭. ఎరకలవాళ్ళ పెండ్లిండ్లకాలమందు తాంబూలము, అర్ధరూపాయి యివ్వవలసినది.



౧౮. మేదరవాండ్ల పెండ్లిండ్ల కాలములయందు తాంబూలము, అర్ధరూపాయి యివ్వవలసినది.

౧౯. కొండవాళ్లు, కోయవాళ్ళు, కోమలవాళ్ళు యీ మూడు వర్ణములవాళ్ళు తాంబూలము, అర్ధరూపాయిచొప్పున కట్నము యివ్వవలసినది.

౨౦. శిల్పికారులు, పంచాణమ్మువార్లు, యీ అయిదువర్ణముల వారికి దేవతలనాటి శాపమున్నదిగనుకను, మహనాటివారి సమయములోనివారు కానందున పాలకీ మొదలయినవి నడువవు. శుభకార్యములు వచ్చినపుడు కొమ్మతోరణము కట్టకూడదు. మహానాటివారి సమ్మతిని ఆకుమడిచి దొప్పతోరణము కట్టుకోవలసినది. గోడకు వెల్ల వేయకూడదు, మూడుచెంగులయిల్లడము పట్టవలసినది.

౨౧. మాలవాళ్ళు మొగవాళ్ళ పెండ్లిండ్లకు మహానాటివారికి తాంబూలము, అర్ధరూయి కట్నము ఇవ్వవలసినది. గ్రామములో ఆడుపడుచు పెండ్లికి పావలా కట్నము ఇవ్వవలసినది. వెల్లగుఱ్ఱము, వెల్లగొడుగు, పట్నమునడుమ నాలుగు వీధులు ఊరేగడమును గలదు. ఇది గాక మహానాటివారికి సంకురాత్రికట్నము, ఇంటికి మూడేసి కుంచముల వరిగలు ఇవ్వవలసినది.

౨౨. మాదిగవాళ్ళ పెండ్లికి మూడు స్తంభముల పందిరి. బొట్ట మోపుగా నొకరాట నిల్పుకునేది. మూడుచెంగుల యుల్లనము పట్టవలసినది. తుడుముతప్పెట్లు దొడ్డికొమ్ము యముఁడుయెక్కే వాహనము కలదు. ఊఁకి ఉత్తరమున వూరేగింపుకలదు. విడిమూరెడు పసుపులో తడిపిన పసుపుపొత్తి ఉత్తరము, దక్షిణము తూర్పు యిండ్లుకట్టరాదు. పడమరయిల్లు గోడలుమట్టి కట్టుక నక్షత్రవీధి కనిపించేలాగున విడిచిపెట్టవలసినది. ఇండ్లకు మేలుముద్దలేదు. బోయలు కానకుండా అవిరేడు కలదు. యెండినకుండయందు వాళ్లు వెల్లతీసేది. కత్తివంకపిల్లు, విచ్చుకత్తి, విసనకఱ్ఱ, సింధుప్రతిమ, దొప్పతోరణము, అరుంధతీదేవి శాప

మువల్ల యీ ప్రకారముగా నడిచేమర్యాదలు, పెండ్లికి మహానాటివారికి కట్నము ఇవ్వవలసినది. ఇదిగాక సంకురాత్రి పండుగుకింద కత్తికి బేడ, గూటమునకు బాతిక, ఆరెకు దూలము, కులాచార ధర్మములు చెడగొట్టక యీ చొప్పున నిచ్చుకోవలసినది. యీపద్ధతికి యీపైన వ్రాసిన జాతులలోను వ్యవహారపు పద్ధతుల చొప్పున వప్పుకున్న కులాలవారికి యెవరి పద్ధతుల చొప్పున వారికి నడిపించవలసినది.

౨౩. ఈ జాతులలో పుస్తిముడుపు కట్టుకునేవర్ణములకు ముడుపు ౧కి మూడురూపాయిలు చొప్పున తప్పు యిచ్చుకోవలసినది.

౧ బ్రాహ్మణుల పెండ్లిండ్లకు అందలములు పల్లకీలు తురంగములు.
౨ క్షత్రియుల డిటో డిటో డిటో డిటో
౩ వైశ్యుల డిటో డిటో డిటో డిటో
౪ శూద్రుల పెండ్లిండ్లకు పై విధముగానే నడుచును.
ఈ శూద్రజాతుల వ్యవహారమే యితరజాతులకు నిర్ణయము.
౫ పల్లెవారి పెండ్లిండ్లకు పల్లకీలు. తురంగములు.
౬ అరవకులం గొల్లవారి పెండ్లిండ్లకు డిటో డిటో
౭ కుమ్మరి గుండయ్య సంతతికి డిటో డిటో
౮ పంచాణం అయిదువిధములవారికి దేవతలు, ఋషులు పెట్టిన శాపమున్నందున నొప్పలేదు. } లేదు. లేదు.
౯ సాలెవారి పెండ్లిండ్లకు పల్లకీలు. తురంగములు.
౧౦ తెలుకులవారి పెండ్లిండ్లకు డిటో డిటో
౧౧ చాకలి
౧౨ మంగలి } వారి పెండ్లిండ్లకు లేదు డిటో
౧౩ భిక్షుజంగము డిటో లేదు డిటో
౧౪ చిత్రకారుల శోభనాలకు నరపతి యిచ్చిన పంచవన్నెలు, మహానాటివారిచ్చిన తెల్లగుఱ్ఱము,



పేటీరుమాలు, సుల్తాను బాసికము గలదు. లేదు డిటో
౧౫ ఎఱుకులవారి పెండ్లిండ్లకు వాహనములేదు. లేదు డిటో
౧౬ మాలవాండ్ల పెండ్లిండ్లకు తురంగము. లేదు తురంగములు.
౧౭ మాదిగవాండ్ర పెండ్లిండ్లకు యముడుఎక్కే వాహనముకలదు. మూడుకొంగుల పుల్లడకలదు. మూడుస్తంభముల పందిలికలదు. ఒొమ్ముతప్పెటకలదు. ఊరికి ఉత్తరమువైపున నూరేగింపుకలదు. భూమిమీాద అవిరేణి కలదు.

ఈ పద్ధతి పదునెనిమిది జాతులలో జన్మమైన వారికల్లాకలదు. ఈప్రకారాన యీహద్దులు మహానాటిలో ముగ్గురు రాజులును ఏబదియారు దేశాలను మంత్రీమహానాడు కులాలహద్దులు తీర్చిన తీర్పున యీప్రకారాన వొట్లు నీమకాలతోచేసినహద్దులు. ఈ హద్దులుతప్పి యేదేశమందు ఎవరునడిచినా ఆ దేశానకు అనర్థంవచ్చును.

ఇందుకు వ్యతిరేకము జరిగించిన పక్షముకు మహానాటివారు యేచొప్పున జరిగించినా, అందుకు అడ్డముపెట్టే అధికారులులేరని తెలియవలసినది. పైనివ్రాసిన ప్రకారము కులాచారములచొప్పున జరిగించగలందులకు యీఫర్మానా వ్రాయించి దయచేయించడమైనది. అక్షయనామసంవత్సర, చైత్ర, శు ౧౦ యిందువాసరము.

పార్శీ మోహరున్నది— పాదుషాగారి పారశీదస్కతున్నది.

ఇది గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి రాయనిభాస్కరమంత్రిచరిత్రయందుండి గ్రహింపఁబడినది.

పై శాసనములను జదివిన వారికి శాలివాహనుని పదునేనవ శకాబ్దములో నీ తెనుగు దేశములోని జనులలో జరిగిన కట్టుబాటుల రీతులు కొంత కొంత తెలియగలవు.

---

## పంతొమ్మిదవ అధ్యాయము.

### 1901 సం॥ జనగణితీప్రకారముగాబలిజవారియొక్క జనసంఖ్య.

| జిల్లాల పేరు. | పురుషులు | స్త్రీలు | మొత్తం. |
|---|---|---|---|
| 1 గంజాం | 2931 | 3938 | 6869 |
| 2 విశాఖపట్నము | 10002 | 11627 | 21629 |
| సదరు ఏజెంటుడివిజనులలో | 39 | 48 | 87 |
| 3 గోదావరి | 6660 | 7221 | 13881 |
| సదరు ఏజెంటు డివిజనులలో | 127 | 135 | 262 |
| 4 కృష్ణా | 13806 | 14128 | 27934 |
| 5 నెల్లూరు | 44499 | 4578! | 902280 |
| 6 కడప | 59795 | 58715 | 118510 |
| 7 కర్నూలు | 29368 | 30032 | 59400 |
| బనగానపల్లె | 813 | 718 | 1531 |
| 8 బల్లారి | 8624 | 8546 | 17170 |
| 9 అనంతపురము | 25914 | 25630 | 51544 |
| 10 మద్రాస్ | 23795 | 24550 | 48309 |
| 11 చెంగల్పట్టు | 18934 | 18867 | 37801 |
| 12 ఉత్తరఆర్కాడు | 64306 | 66340 | 130646 |
| 13 సేలము | 29002 | 30530 | 59532 |
| 14 కోయముత్తూరు | 11930 | 12472 | 24402 |
| 15 నీలగిరి | 1640 | 759 | 2399 |
| 16 దక్షిణఆర్కాడు | 24333 | 24810 | 49143 |
| 17 తంజావూరు | 21299 | 24640 | 45939 |
| పుదుకోట | 1232 | 1224 | 2456 |
| 18 తిరుచినాపల్లి | 18131 | 19668 | 37899 |
| 19 మధుర | 33228 | 34574 | 67802 |
| 20 తిరునెల్వేలి | 45138 | 42917 | 88055 |
| 21 మలయాళము | 1967 | 1955 | 3922 |
| 22 దక్షిణకన్నడము | 329 | 405 | 734 |
| మొత్తము | 497806 | 510230 | 1008036 |

ఇదిగాక తిరువనంతపురము, కొచ్చి, గోవా, పుదుచ్చేరి, మైసూరు, బెంగళూరు మొదలగుప్రాంతములలోనుండు బలిజవారునుచేరి మొత్తము 16,00,000 లక్షుల జనులున్నారు.

---



1901 సం॥ జనగణితీప్రకారముగా బలిజవారియొక్క వర్తకవ్యాపారములుచేయువారి జననసంఖ్య.

ఈ బలిజవారిలో ఆంధ్రదేశీయులను బలిజవారనియు, ద్రవిడదేశీయులను గౌరవులు ( கவரைகள் ) అనియును విభజించియున్నారు. ఈ యిరుతెగలవారు నొక్కరేయైయుండగా వీరిని యిట్లు విభజించి వ్రాసినది అనావశ్యకమేయని నొక్కచెప్పగలము. ముందైనను గవర్నమెంటువారు దిద్దుకొనగోరెదము.

| తెనుఁగుదేశబలిజవారిలో వర్తకము మొదలగునవిచేయువారి వివరము. | ఆయావృత్తి యందుండు వారిసంఖ్య. | తెనుఁగుదేశబలిజవారిలో వర్తకము మొదలగునవిచేయువారి వివరము. | ఆయావృత్తి యందుండు వారిసంఖ్య. |
|---|---|---|---|
| 1. పరంపరగాచేతిపనిచేయువారు | 3285 | 14. బండివాండ్రు, బండితోలువారు | 601 |
| 2. భూజీవముగలవారు | 7352 | 15. బేలుదారిపనివాండ్రు | 465 |
| 3. వ్యవసాయచేసి జీవించువారు | 22280 | 16. పశువులనుపెంచి విక్రయించువారు | 450 |
| 4. పలసరకు వ్యాపారముచేయువారు | 3339 | 17. కల్లు అమ్మువారు | 401 |
| 5. బిచ్చగాండ్రు | 2399 | 18. సంస్థాన గుమస్తాలు | 353 |
| 6. సర్కారు ఉద్యోగస్థులు | 1702 | 19. పెన్షన్ బొంది జీవించువారు | 353 |
| 7. పశువులు మేపువారు | 1523 | 20. చాపలుగంపలు అల్లువారు | 347 |
| 8. పత్తినూలు నేతగాండ్రు | 1271 | 21. రైలుబండిలో పనిచేయువారు | 345 |
| 9. మిఠాయి అమ్మువారు | 871 | 22. అల్లికపనిచేయువారు | 313 |
| 10. వడ్లుదంచువారు | 846 | 23. మట్టిపని చేయువారు | 297 |
| 11. సాధారణపనివాండ్రు | 818 | 24. కాయగూర లమ్మువారు | 274 |
| 12. ఇంటిపని చేయువారు | 848 | 25. గుడిపని యందుండు [వారు | 262 |
| 13. ధాన్యవర్తకులు | 610 | | |

| తెనుగుదేశబలిజవారిలో వర్తకము మొదలగునవి చేయువారి వివరము. | ఆయావృత్తియం దుండు వారిసంఖ్య. | తెనుగుదేశబలిజవారిలో వర్తకము మొదలగునవి చేయువారి వివరము. | ఆయావృత్తియం దుండు వారిసంఖ్య. |
|---|---|---|---|
| 26. పువ్వులు గట్టి అమ్ము వారు | 251 | 35. పాట కులు, వాద్య గాండ్రు | 181 |
| 27. ఉపాధ్యాయులు | 250 | 36. పొడి, పొగాకు అమ్ము వారు | 173 |
| 28. సారాయము అమ్ము వారు | 249 | 37. జానిసె వృత్తియం దుండువారు | 170 |
| 29. సున్నము అమ్మువారు | 236 | 38. కుట్టుపని చేయువారు | 152 |
| 30. గుడ్డలమ్మువారు | 220 | 39. చందనముఅమ్మువారు | 152 |
| 31. వడ్రంగి పని చేయు వారు | 216 | 40. అడవియిలాకాసిబ్బం దులు. | 137 |
| 32. కావలి గాండ్రు | 208 | 41. ఛిల్లరపనిచేయువారు | 15581 |
| 33. పట్టు గుడ్డలు నేయు వారు | 206 | | |
| 34. పచ్చిక, కట్టెలుఅమ్ము వారు | 196 | మొత్తము. | 134996 |

| ద్రవిడదేశమునందుండు గౌరవులనెడి (கவரைகள்) బలిజ వారిలో వర్తకము మొదలగునవి చేయువారి వివరము. | ఆయావృత్తి యందుండు వారి సంఖ్య. |
|---|---|
| 1. పరంపరగా చేతిపనిచేయువారు | 1595 |
| 2. భూజీవనముగలవారు | 24275 |
| 3. వ్యవసాయముచేసి జీవించువారు | 7307 |
| 4. గుత్తసాగుబడిచేసి జీవించువారు. | 2989 |
| 5. ప్రత్తినూలు నేయువారు | 2695 |
| 6. సర్కారు ఉద్యోగస్థులు | 1241 |
| 7. గంపలు చాపలు అల్లువారు | 983 |
| 8. పలసరకు వర్తకము చేయువారు. | 913 |
| 9. వడ్లుదంచువారు | 810 |
| 10. మిఠాయిచేసి అమ్మువారు | 745 |
| 11. సాధారణపనివాండ్రు | 744 |
| 12. బిచ్చగాండ్రు | 565 |
| 13. బండితోలువారు | 376 |
| 14. పశువులుమేపువారు | 289 |
| 15. బేల్దారి పనివాండ్రు | 337 |
| 16. ధాన్య వ్యాపారస్థులు | 288 |
| 17. కల్లు అమ్మువారు | 286 |
| 18. పట్టునూలు నేయువారు | 233 |
| 19. పాటకులు, వాద్యగాండ్రు | 226 |
| 20. పశువులను పెంచి విక్రయించువారు | 197 |
| 21. సున్నము అమ్మువారు | 187 |
| 22. ఇంటిపని చేయువారు | 181 |
| 23. దారము అమ్మువారు | 166 |
| 24. సారాయము అమ్మువారు | 162 |
| 25. నూనె అమ్మువారు | 155 |
| 26. పెన్షన్ వలన జీవించువారు | 146 |
| 27. రైలుబండి పనివాండ్రు | 136 |
| 28. గుడ్డలమ్మువారు | 133 |
| 29. తపాలాఫీసు ఉద్యోగస్థులు | 128 |
| 30. గుడిపనివాండ్రు | 118 |
| 31. మట్టిపనివాండ్రు | 116 |
| 32. కంచరపని చేయువారు | 116 |
| 33. వడ్రంగి పనివాండ్రు | 99 |
| 34. ఉపాధ్యాయులు | 109 |
| 35. పొగాకు, పొడి అమ్మువారు | 96 |
| 36. కావలిగాండ్రు | 88 |
| 37. కాయగూర లమ్మువారు | 84 |

| ద్రవిడదేశమునందుండు గౌరవులనెడి (கவரைகள்) బలిజవారిలో వర్తకము మొదలగునవి చేయువారి వివరము. | ఆయావృత్తి యందుండు వారి సంఖ్య. |
|---|---|
| 38. అంగడి గుమాస్తాలు | 73 |
| 39. అడవియిలాకా పనివాండ్రు | 69 |
| 40. చక్కెరకంపెనిలో కూలిచేయువారు | 62 |
| 41. వైద్యులు | 61 |
| 42. గుడ్డకుట్టువారు | 61 |
| 43. చిల్లరపని చేయువారు | 1539 |
| మొత్తము. | 50831 |

1901 సం॥ జనగణితీప్రకాలముగా బలిజవారియొక్క వయస్సు వివరణము.

(1) 1 మొదలు 5 సం॥ వఱకు లోపలివయస్సుగలవారు 13600 మగవాండ్రును, 14661 స్త్రీలునుగలరు.

(2) 5 మొదలు 12 సం॥ లోపలి వయస్సుగలవారు 23371 మగవాండ్రును, 24540 స్త్రీలునుగలరు.

(3) 12 మొదలు 15 సం॥ లోపలి వయస్సుగలవారు 8526 మగవారును, 6799 స్త్రీలునుగలగు.

(4) 15 మొదలు 20 సం॥ లోపలి వయస్సుగలవారు 8855 మగవారును, 7659 స్త్రీలునుగలరు.

(5) 20 మొదలు 40 సం॥లోపలి వయస్సుగలవారు 37124 మగవారును, 38326 స్త్రీలును గలరు.

(6) 40 మొదలు 100 సం॥లోపలి వయస్సుగలవారు 30764 మగవారును, 31149 స్త్రీలునుగలరు.

మొత్తము పురుషులు 122271, స్త్రీలు 123184.

---



1901 సం॥ జనగణితీప్రకారముగా వివాహమైన బలిజవారియొక్క వయోనిర్ణయము.

(1) 1 మొదలు 5 సం॥లోపల పెండ్లియైన పురుషులు 23, స్త్రీలు 53.

(2) 5 మొదలు 12 సం॥ లోపల పెండ్లియైన పురుషులు 94, స్త్రీలు, 1562.

(3) 12 మొదలు 15 సం॥లోపల పెండ్లియైన పురుషులు 92, స్త్రీలు 2302.

(4) 15 మొదలు 20 సం॥లోపల వివాహమైనపురుషులు 385, స్త్రీలు 5794.

(5) 20 మొదలు 40 సం॥ లోపల వివాహమైనపురుషులు 20937, స్త్రీలు 24503.

(6) 40 సం॥మీది వయస్సుగలవారిలో వివాహమైనపురుషులు 22935, స్త్రీలు 8196.

మొత్తము పెండ్లియైన పురుషులు 44466, స్త్రీలు 46410.

---

1901 సం॥ జనగణన ప్రకారము వివాహముకాని బలిజవారి వయోనిర్ణీతము.

(1) 1 మొదలు 5 సం॥లోపలి వయస్సుగల పురుషులు 13575, స్త్రీలు 14603.

(2) 5 మొదలు 12సం॥లోపలి వయస్సుగల పురుషులు 23271, స్త్రీలు 22932.

(3) 12 మొదలు 15 సంll లోపలి వయస్సుగలపురుషులు 8428, స్త్రీలు 2429.

(4) 15 మొదలు 20 సంll లోపలి వయస్సుగలపురుషులు 8498, స్త్రీలు 1549.

(5) 20 మొదలు 40 సంll లోపలి వయస్సుగలపురుషులు 14909, స్త్రీలు 1009.

(6) 40 సంll మీది వయస్సుగలవారిలో పురుషులు 1893, స్త్రీలు 562.

మొత్తము పెండ్లికాని పురుషులు 70574, స్త్రీలు 45084.

---

1901 సంll జనగణనప్రకారముగా భార్యలుగతించినపురుషులయు, భర్తలుగతించిన స్త్రీలయు వయోనిర్ణయము.

(1) 1 మొదలు 5 సంll లోపల పురుషులు 3, స్త్రీలు 5.

(2) 5 మొదలు 12 సంll లోపల పురుషులు 6, స్త్రీలు 46.

(3) 12 మొదలు 15 సంll లోపల పురుషులు 2, స్త్రీలు 68.

(4) 15 మొదలు 20 సంll లోపల పురుషులు 6, స్త్రీలు 46.

(5) 20 మొదలు 40 సంll లోపల పురుషులు 1278, స్త్రీలు 8814.

(6) 40 సంll మీది వయస్సుగలవారు పురుషులు 5936, స్త్రీలు 22391.

మొత్తము భార్యలుగతించిన పురుషులు 7231, భర్తలుగతించిన స్త్రీలు 31640.

---



1901 సంll జనగణితీప్రకారముగా బలిజవారిలోని విద్యావంతులైన స్త్రీపురుషులసంఖ్యా నిర్ణయము.

వీరిలో 122271 పురుషులును, 123134 స్త్రీలును చదివి యున్నారు. వీరిలో 14316 గురు పురుషులును, 991 స్త్రీలును తమ పేర్లనుమాత్రమే చదువగలరు.

చదువు తెలిసినవారిలో,

తెనుగు తెలిసినపురుషులు 10360, స్త్రీలు 728.

అఱవము తెలిసినపురుషులు 3902, స్త్రీలు 187.

కన్నడము తెలిసినపురుషులు 17, స్త్రీలు లేదు.

ఇంగ్లీషు తెలిసినపురుషులు 949, స్త్రీలు 13.

చదువు తెలియనిపురుషులు 107955, స్త్రీలు 122223.

---

ఇరువదియవ అధ్యాయము.

పేటబలిజవారిలోని అంతర్భాగములు సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

లింగబలిజలు, (లింగాయితులు). వీరు ప్రథమమున శైవులుగానుండిరి. ఆమీద వైష్ణవులైరి. ఇట్లువైష్ణవులుగా శ్రీరంగపట్టణము, మైసూరు మొదలగుప్రాంతములయందుండు కాలమునందు, అచ్చట ఆకాలమున ప్రసిద్ధముగానున్న శైవులనుజూచి మరల శైవులైరి. ఈ మతస్థులలో లింగపూజచేయువారికి జంగములనియును, వ్యవసాయముచేయువారికి రెడ్లు అనియును, వర్తకము చేయువారికి ఖండము వారనియును, ఉద్యోగముచేయువారికి నాయడు అనియును పేర్లు కల్గియున్నవి. ఈ లింగాయతులుగడ్డమును శిరమును క్షౌరము చేసికొనెదరు. బ్రాహ్మణులయింట్లలో సున్నమైననుతీయరు. 1901 సంll జనగణితీప్రకారము మద్రాసురాజధానియందు మాత్రము 138518 లింగాయితులున్నారు.

ఈ లింగాయితుల వంశావళినిగూర్చి కొందఱు మఱొకవిధ ముగాఁజెప్పెదరు. ఎట్లన,—చంద్రవంశ క్షత్రియ ఆంధ్రచాళుక్య విజ్జలరాజు, తనమంత్రియైనబసవయ్యచెల్లెలు పద్మావతినివరించెను. ఈ పద్మావతి కుమార్లందఱును లింగాయితమతమునే అవలంబించుచుండిరి. అదిమొదలు ఈమతమువృద్ధియైనదనెదరు. దీనింబట్టిచూడగా తండ్రియైన విజ్జలరాజు జైనమతమును, కుమారులు తమ మేనమామయైనబసవయ్యస్థాపించిన లింగాయితమతమును అవలంబించిరి. ఇది ఆకాలమున సహజముగా నుండియుండును. ఈకాలమునను శూద్రులలో కొందఱు శైవమతస్థులు వైష్ణవమతస్థులుగనుండు శూద్రులతో సంబంధముచేయుచుండుటను ఇప్పుడును మనముచూచుచునే యున్నాము. ఇంతకంటె మరొక అన్యాయముకలదు:—అదేమనఁగా, సిలోన్ (లంక) వాసులలో ననేకులు క్రీస్తువులుగను హిందువులుగను నున్నారు. వీరిలో నొకరికొకరికి సంబంధ ప్రతిసంబంధములునుగలవు. ఇట్లే ఆకాలమున నున్న జైనబౌద్ధ శైవవైష్ణవమతస్థులలోననేకులు సంబంధప్రతి సంబంధములు చేయుచుండిరనిస్పష్టముగా తెలియుచున్నది. ప్రతాపరుద్రుఁడు తండ్రిమతమైన జైనమతమునువిడిచి తల్లిమతమైన వైష్ణవమతము నవలంబించినాడనియును ; చాళుక్యవిమలాదిత్యుఁడు చోళరాజపుత్రిని వివాహమైనాఁడనియును; తంజావూరి అచ్యుతప్పనాయడు పాండ్యరాజపుత్రిని పరిణయమయ్యెనియును; ఈపురాణమునందే మున్ను వ్రాయఁబడియున్నదికదా! కనుక ఇట్లుజరుగుట ఆశ్చర్యముకాదు.

### ఖండి బలిజవారు.

మధురనుపాలించిన విశ్వనాథనాయడుగారి కుమారుఁడు కృష్ణప్పనాయడుగారు లంకమీఁదికి దండెత్తి ఆదేశమును జయించి ఖండియందు తమసంస్థానమునుస్థాపించిరి. అదిమొదలు వీరికి ఖండిబలిజవారనిపేరుగల్గెను. వీరు తంజావూరు మొదలగుచోటులయందుండి కన్యకలను గైకొనుచుండిరి. వీరింటిపేరు చింతలపురియట. వీరు కాశ్యప



గోత్రస్థులు ; వీరందఱును క్షత్రియులవలెనే యజ్ఞోపవీతధారులైయున్నారు. వీరిస్త్రీలందఱును అంతఃపురమునందేయుందురు. వీరిలో ననేకులు తిరునెల్వేలి,మధుర, నాగపట్టణము, తంజావూరు, తిరుచినాపల్లి మొదలగు ప్రాంతములలోనున్నారు. వీరిసంతతివారికందఱికిని సింహళ మహారాజ అనుబిరుదుపేరు వారివారిపేర్ల కడపటవచ్చు చుండును. వీరిలో ననేకులు సర్కారువారిచ్చు ఉపకారవేతనమునుబొంది జీవించుచున్నారు.

### చిత్రాల బలిజవారు.

వీరు విజయనగరసంస్థానములో చిత్రరూపభావపటములు వ్రాయుచును, వస్త్రములకు రంగువేయుచును శిల్ప విద్యానిపుణులుగను నుండిరి. వీరిలో 1901 సం॥ జనగణితీప్రకారముగా 6110 జనులుండిరి.

### ముసుకుబలిజవారు.

విజయనగరమునందు తురకలు ప్రవేశించినకాలములో వీరిస్త్రీలు ముసుకుబెట్టుకొని దాగియుండిరి. అందుచే నీపేరు వీరికిగల్గెను. వీరందఱును విజయనగర సంస్థానాధిపతియైన జగదేవరాయల సంతతివారు. వీరు తమ పూర్వచంద్రవంశాచారప్రకారమే శుభాశుభకార్యములను జరుపుచున్నారు. పెండ్లికాలమున బెండుబాసికములను గట్టక పుష్ప బాసికమునేకట్టుచున్నారు. వీరిలో మూతకమ్మల బలిజవారని మరియొక తెగవారుకలరు. వీరు మ్రానితో జేసిన కమ్మలనుధరించుటచేత ఈపేరు వీరికి గల్గెను.

వీరిలో రాణావారు, కూలియమువారు, రఘురౌతువారు, కుప్పాలవారు, బండివారు, కఠారివారు, నెల్లంకలవారు, మడికలవారు, ఆకులవారు, సామిసెట్టివారు, మేడిసెట్టివారు, అంకిసెట్టివారు, చెట్లువారు, పుంకాలవారు, శ్రీగిరివారు, గాజులవారు, బయ్యపువారు, బాగారపువారు, అరిగిరివారు, సింగమువారు, కుంపినివారు, మంత్రివారు అను ఇండ్ల పేర్లుగలవారు ముఖ్యులు.

వీరు పాలగోత్రము, అక్షింతలగోత్రము, విష్ణువర్ధనగోత్రము మొదలగుగోత్రములలో జేరినవారు.

వీరు తత్కాలమున చిత్తూరు, గూడలూరు, సేలము, ధర్మపురి, కృష్ణగిరి, కావేరిపట్నము, డెంకణికోట, పెణ్ణాగరం, వేలూరు, రాయకోట, కుందనపల్లి, ఈరోడు, సత్యమంగలం, కోయముత్తూరు, ముద్దనూరు, మొదలగుస్థలములలో వసించుచున్నారు.

---

## ఒప్పనబరిజవారు.

వీరు విజయనగరసంస్థానపు భుజబలరాయలయొక్క సంతతిలో జేరినవారు. ఈసంస్థానము శ్రీరంగపట్టణమునకు పోయినమీఁద బైటిపరగణాలలోనుండి కిస్తి వసూలుచేయు (ఒప్పనము) ఉద్యోగమునందు వీరు నమ్మకముగా వర్తించుచుండిరి. అదిమొదలీపేరు వీరికిగల్గెను. వీరిలో ననేకులు యోధులుగానుండిరి. అందుచే వీరికి రాతులనియును పేరుగల్గినది. వీరందఱును ఆదియందు మంచిస్థితిలోనుండిరి. విద్యాబుద్ధులుగలవారై యుండిరి. వీరిస్త్రీలందఱును రాణివాసమునందేయుండిరి. వీరిలోని స్త్రీలకు పగటికాలమునందు వివాహముచేసినయెడల పరపురుషులు చూతురని రాత్రియందు చేయుచుండిరి. కొందఱిపుడును వివాహకాలములందు భుజబలరాయలు, కృష్ణదేవరాయలు మొదలగు తమపూర్వులను కులదైవముగా భావించి పూజించెదరు. వీరిలో ననేకులు విచారవిహీనులైనందుచేత తమ కులగోత్రములనైనను తెలిసికొనక పత్రము మొదలగువానియందు రాతుజాతి, రాతుకులము అని వ్రాసెదరు. ఆదిలో వీరు 1000 ఇండ్లవారుండిరి. ఇప్పుడు కోయముత్తూరు, సేలము, శెవ్వాపేట, ముసిరి, పుదుకోట, నిమ్మలగుడి, మన్నారుగుడి, కుంభఘోణము, శ్రీవిల్లిపుత్తూరు, మధుర మొదలగుచోటులందు వీరు వసించుచున్నారు.



# ఇరువదియొకటవ అధ్యాయము.

## వెలమబలిజవారు.

(చిత్తూరుజిల్లాచరిత్రప్రకారము.)

వీరు వెలమవారు, వెలమదొరలు, వెలుగోటివారు, అను పేర్లు గలవారై యున్నారు. ఆదియందు విశాఖపట్నము, గంజాము మొదలగు ప్రాంతములందుండి దక్షిణము చిత్తూరుజిల్లాలోవచ్చినిలిచి వ్యవసాయముచేయుచుండి, తర్వాత సామంతరాజులైరి. ఈ వెలమదొరలు విజయనగరముదొరలకు ఆప్తులై యుండిరి.

వీరు పల్లవవంశస్థులని డాక్టర్ ఆపర్టుశాస్త్రియును; కాపురెడ్డివంశస్థులని కర్నల్ మెకంజిదొరయును; చెప్పుచున్నారు. వీరిలో ఆదివెలమలు, పద్మవెలమలు, తెనుఁగువెలమలు, ద్రావిడవెలమలు, కోనవెలమలు అను 142 తెగలవారున్నారు. వీరు తమకంటె తక్కువ కోటదేశబలిజవారందఱిని తక్కువవారని చెప్పుచుందురు. అట్లే కోటదేశబలిజవారు వెలమబలిజలను తక్కువవారని చెప్పుచుందురు.

ఇదిగాక ఆదియందు కమ్మబలిజవారును వీరును ఒకేకులస్థులై యుండిరి. తురకలు విజయనగరమునకువచ్చినపుడు, ఈ వెలమవారు తమస్త్రీలను అంతఃపురముననుంచిరి. అదితగదని కొందఱువాదించి, ఒక కమ్మ (తాటాకుజాబు) లో చేవ్రాళ్లుచేసిరి. ఇట్లు చేవ్రాళ్లుచేసినవారందఱును కమ్మవారనియును, చేవ్రాళ్లుచేయక వెలిగానున్నవారందఱును వెలమవారనియును పేరొందిరని చెప్పెదరు. (ఇట్లునరపతివీరనరసింహరాయలవారికాలమందుజరిగినది.) ఇప్పటికి గోషాగా స్త్రీలనుంచియుండువారికి ఆదివెలమలనియును, గోషాను పాటింపనివారికి పద్మవెలమలనియును పేర్లుకలవు.

ప్రకృతము ఈవెలమబలిజలు కృష్ణా, గోదావరి, బందరు, రాజమంద్రి, నెల్లూరు, కాళహస్తి, వేంకటగిరి, కార్వేటినగరం, పిఠాపురము, బొబ్బిలి, పుంగనూరు మొదలగుస్థలములయందున్నారు. 1901 సం॥ జనగణితీప్రకారముగా వెలమలు 436327 గురుండిరి.

## వెలమబలిజవారి ఉత్పత్తి వివరణము.

(బాపట్ల - శ్రీ సీతారామనాయడుగారు చెప్పినప్రకారము.)

వెలమబలిజవారిలో ఆదివెలమలు, పద్మవెలమలు, కొప్పువెలమలు,కోనవెలమలు, నీలిచాయవెలమలు, తెఱచాటువెలమలు, కొండవీటిసీమవెలమలు' అనునీమొదలగు భేదములు చాలాకలవు, వారిలో ఆదియన్న,పద్మన్న, అనునిర్వురు సహోదరులుండిరి. వీరిలోపద్మన్నకొకఆడుబిడ్డ పుట్టెను. పద్మన్నతన కుమార్తెను తనస్నేహితుండైన యొకరాజునకియ్యఁదలఁచియుండెను. అందులకు ఆదియన్న సమ్మతింపనందున ఉభయులకును కలహములు సంభవించెను. అట్టికాలమున ఆదియన్న జాలరివానిసహాయముచేత నదినిదాఁటిప్రాణములనుదక్కించుకొనెను.ఆ హేతువుచేతనే నేటికిని ఆదివెలమవారిలో వివాహకాలములందు జాలరివానిసహాయముచే జయముగా దరిజేరిన కృతజ్ఞతను మఱువనివారై పాలచెట్టునకు చేఁపలవలనుగట్టి,ఆమీదవివాహముచేసెదరు.వీరు అయిదుదినములు పెండ్లి చేయుదురు. సన్నికల్లుమెట్టుట (సప్తపది) లేదు. వీరిస్త్రీలకు రాణివాసము కలదు.

---

### వెలమబలిజవారి గృహగోత్ర నామములు.

| గృహనామము. | గోత్రనామములు. |
|---|---|
| 1. అయినాలవారు | కోనతుల్లగోత్రము |
| 2. అంకాలవారు (1) | వంతమారిగోత్రము |
| 3. అంకాలవారు (2) | అయంబకగోత్రము |
| 4. అంకాలవారు (3) | అయుస్తగోత్రము |
| 5. అమ్మనేనివారు | నేమాకులుగోత్రము |
| 6. ఆకునూరివారు | శ్రీవంతసగోత్రము |
| 7. ఆకులవారు | పాలంకిగోత్రము |



| | |
|---|---|
| 8. అగుమాకవారు | ఉల్లంబాకులగోత్రము |
| 9. ఇమ్మానేనివారు | పువ్వాడగోత్రము |
| 10. ఉతెల్లరువారు | కౌండిన్యగోత్రము |
| 11. ఉమ్మడిసింగువారు | పొన్నివెలగలగోత్రము |
| 12. కనకాలవారు | దేవకలగోత్రము |
| 13. కనకపల్లివారు | వేళ్లమూడిగోత్రము |
| 14. కావేరివారు | పట్టెల్లగోత్రము |
| 15. కుళ్లివారు | పాలకులగోత్రము |
| 16. కొప్పిసెట్టివారు | నలకలగోత్రము |
| 17. కలితింబాకవారు | వసిష్ఠగోత్రము |
| 18. కోకావారు (1) | పైనూరిగోత్రము |
| 19. కోకావారు (2) | కూటవల్లిగోత్రము |
| 20. కంచివారు | దేవేంద్రగోత్రము |
| 21. కొలితవారు | రాయాకులగోత్రము |
| 22. చిలంబివారు | కాడుల్లగోత్రము |
| 23. తలగరివారు | కరితులగోత్రము |
| 24. తాయివారు | ఒడివెల్లగోత్రము |
| 25. తిక్కానివారు | నకుడిగోత్రము |
| 26. తీర్థవారు | కడవకూళ్లగోత్రము |
| 27. నంగిరెడ్డివారు | కాన్తళ్లగోత్రము |
| 28. నాయనివారు | క్షేత్రాలగోత్రము |
| 29. నానిసెట్టివారు | శ్రీవత్సలగోత్రము |
| 30. పరిమివారు | వసవలనగోత్రము |
| 31. పంచేటివారు | నేమాకులగోత్రము |
| 32. పాలల్లువారు | యమగానిగోత్రము |
| 33. పాతానివారు | యమగానిగోత్రము |

| | | |
|---|---|---|
| 34. | పాపినేనివారు | బుగియడుగోత్రము |
| 35. | పాకనాటివారు | నెక్కండ్రాగోత్రము |
| 36. | పాకలవారు | శాండిల్యగోత్రము |
| 37. | పారలివారు | సెట్టిల్లగోత్రము |
| 38. | పిళ్లారిసెట్టివారు | కలియుగలగోత్రము |
| 39. | పోకలవారు (1) | శాండిల్యగోత్రము |
| 40. | పోకలవారు (2) | యమకల్లగోత్రము |
| 41. | పోకలవారు (3) | సెట్టిల్లగోత్రము |
| 42. | పోకలవారు (4) | వెలివెల్లగోత్రము |
| 43. | పోకలవారు (5) | ఆత్రేయగోత్రము |
| 44. | పార్లభూతివారు | ఉందంతలగోత్రము |
| 45. | పోలుముదేలవారు | నేమాకులగోత్రము |
| 46. | పోయింతలవారు | సప్తర్షిగోత్రము |
| 47. | మరగానివారు | కార్సతాలగోత్రము |
| 48. | మాదిరాళ్లవారు | ఆమాకులగోత్రము |
| 49. | మాగర్లవారు | ఉద్దండలగోత్రము |
| 50. | మాదిరెడ్డివారు | తామేలనగోత్రము |
| 51. | మొగలిసెట్టివారు | పుర్సక్యార్గోత్రము |
| 52. | మోటుపల్లివారు (1) | సెట్టిల్లగోత్రము |
| 53. | మోటుపల్లివారు (2) | కర్మాలగోత్రము |
| 54. | రాజనాలవారు | నెమిలికలగోత్రము |
| 55. | పడియారుసెట్టివారు | కౌండిన్యగోత్రము |
| 56. | వందివారు | కూటవల్లిగోత్రము |
| 57. | వందంసెట్టివారు | కలియుగలగోత్రము |
| 58. | వరదావారు | పెన్నివెలగలగోత్రం |
| 59. | వారణాసివారు | వెలిసాలగోత్రము |



| | | |
|---|---|---|
| 60. | వెలమాదివారు | వెయికళగోత్రము |
| 61. | సానంసెట్టివారు | హరిదాసగోత్రము |
| 62. | చిరుతావారు | కడవకూళ్లగోత్రము |
| 63. | చిరుపూరివారు | కడవకూళ్లగోత్రము |

---

## ఇరువదిరెండవ అధ్యాయము.

### కమ్మి (బలిజ) వారు.

ఈకమ్మబలిజవారినిగూర్చి పలువురుపలు తెఱగులజెప్పుచున్నారు. మఱియు గ్రంథములు నష్టియున్నవి.

1. ఇదియొకవిధము:—ప్రతాపరుద్రరాజుయొక్క కమ్మ (తాటాకుజాబు) శత్రురాజులయొద్ద చేరిపోయెను. ఆజాబును తెచ్చునట్లు రాజు చెప్పఁగా అప్పుడు కొందఱుకాపులు ధైర్యముగాఁబోయి శత్రురాజుయొద్దనున్న దానిని తెచ్చినందున, వీరికి కమ్మవారు అనుపేరుకల్గెను. ఆశత్రురాజునకుభయపడి పరుగిడినవారందఱును వెలమవారు అనేపేరును పొందిరి, అని. 1891 సం॥జనగణితీపుస్తకమునందువ్రాయఁబడియున్నది.

2. ఇదియొకవిధము:— కృష్ణదేవరాయలవారి యొక్క అంతరంగజాబు (కమ్మను రహస్యముగాఁగొనిపోయి పరరాష్ట్రరాజులకిచ్చుచుండినందున ఈపేరు వీరికికల్గెను. ఇట్లుప్రౌఢప్రబంధమునచెప్పబడియున్నది.

3. ఇదియొకవిధము:—పూర్వము కామాందికఋషి యనునతఁడు చేయు తపస్సును రాక్షసులు చెడుపుచుండగా నాఋషి లక్ష్మిదేవితో మొఱబెట్టినంత నాదేవి తన కమ్మనిచ్చిపూజించుమనిచెప్పెను. ఆఋషి అట్లే 100 ఏండ్లు పూజచేయగా ఆకమ్మయందుండి 500 వీరులుపుట్టి రాక్షసులను హతముచేసిరి. ఇట్లు కమ్మయందుపుట్టినందున వీరికి కమ్మవారు అనుపేరు కల్గెను. అని చిత్తూరుజిల్లా మాన్యుయలు గ్రంథమునందు వ్రాయబడియున్నది.

4. ఇదియొకపద్ధతి:—చంద్రవంశ్యక్షత్రియులైన యయాతిసంతతిలోఁజేరిన శశిబిందురాజునకు తుహీనుఁడనుకొడుకు గలఁడు. వీనికి చండాలస్త్రీయందు నందుఁడుపుట్టెను.అందుచే నందుని నిందించుచుండిరి. ఈఅవమానమువలన నందుఁడు తనదేశమునువిడిచిదక్షిణమునకురాఁగా వానిబంధువులును వెంబడించివచ్చిరి.ఇట్లు వచ్చిపినాకినీనదియొద్దకురాగా నదీప్రవాహము అధికముగానుండెను. అప్పుడాతీరమునందున్న రేణుకాదేవిని ఆరాధించి మొఱ బెట్టగా నాదేవి తనచెవిలోని రెండుకమ్మల నిచ్చెను. ఆకమ్మలను చేతఁదీసికొన్నంతనే పినాకినీనదీ ప్రవాహముతగ్గిపోయెను. అందుచే వీరికి కమ్మ వారనేపేరు కల్గెను. వీరి కులగురువు పేరు బలభద్రభాస్కరయ్య. ఇట్లని ద్రవిడభాషయందుండు కమ్మవారి పురాణమునందు వ్రాయంబడియున్నది.

5. మఱియొకవిధము:— సూర్యవంశీయ దిలీపరాజు యొక్క లక్షసంతతులయందు బుట్టి చంద్రవంశ్యులతో సంబంధము చేసినందున వీరికిఉభయాదులనియును, వీరికి ఆదిపురుషుడు ధర్మపాలుడనియును,వీరికి ఆదిఆచార్యుఁడు ధర్మశీలుఁడనియును,ధర్మపాలునికుమార్తెను చంద్రవంశ్యుఁడొకఁడు గైకొన యత్నింపగా తోడనే దేశమునువిడిచి బయలుదేరిపోగా, పినాకినీనదీప్రవాహము అధికముగానున్నందున అచ్చటనున్న జమదగ్ని, రేణుకాదేవి, పరశురాముఁడు వీరిని పూజించినంత, రేణుకాదేవి తనచెవికమ్మలనిచ్చెను. ఆకమ్మలప్రభావమువలన నదీప్రవాహముతగ్గెను. ఆమీాద వేఱుచోటుపోయిచేరి ఆకన్యకను తమ కులస్థుడొకనికి వివాహముచేయందొడంగినపుడు, తమకు సహాయముచేసిన జమదగ్ని, రేణుకాదేవి, పరశురామఁడు వీరిని పూజించి, ఆమీాద కులగురువైన బలభద్రునికిప్రథమ తాంబూలమునిచ్చివివాహముచేసెదరు. ఇట్లని బ్రహ్మాండ పురాణముతోఁజేరిన ఒకానొకసంస్కృత గ్రంథమునం దున్నది.

6. కమ్మవారు కృష్ణా, మహానదీ తీరములయందుండగా, మహమ్మదీయులు దండెత్తివచ్చి తరుమగొట్టగా నప్పుడు కందిచెట్లలోదాగుకొనియుండి, ఆమీాఁద, పినాకినీ తీరమురాగా ప్రవాహమధికముగనుండెను. అప్పుడు గంగాదేవిని పూజించి నంత ఆమెదారివిడిచెను. అదిమొదలు రు కందిఆకును పెండ్లి పందిటి స్తంభమునందు కట్టుటయేగాక, వివాహ కాలమున గంగాదేవికి పూజయుచేసెదరు.



---

కమ్మవారిలోని భేదములు.

1891 సం॥ జనగణితీప్రకారముగా మద్రాసురాజధానియందు 324155 జనులుండిరి.వీరిలో 231 భేదములుకలవు అందుప్రధానశాఖలు 7.

1. బంగారువారు:—వీరిస్త్రీలు బంగారు ముక్కరను ధరింతురు. చిత్తూరు మొదలగుచోట్లలో 12617 గురుజనులున్నారు.

2. గంపచాటువారు:— పరపురుషుల ముఖమును చూడకూడదని గంపతో ముఖమును మఱుగు పఱుచుకొందురు. కృష్ణా, నెల్లూరు మొదలగు స్థలములలో 199807 జనులున్నారు.

3. గోడచాటువారు:—పరులనుచూడకూడదని గోడకావలనే దాఁగియుందురు. చిత్తూరు, చెంగల్పట్టు మొదలగు ప్రాంతములలో 68446 జనులున్నారు.

4. ఇల్లువెళ్లనివారు:— వీరి స్త్రీలు రాణివాసమునయేయుందురు. అనంతపూరు, నెల్లూరు, కృష్ణా మొదలగు స్థలములలో 87870జనులున్నారు.

5. కావలివారు:—గోదావరిమొదలగుచోట్లలో 42888 జనులున్నారు.

6. పెద్దకమ్మవారు:—కృష్ణా మొదలగుచోట్లలో 26941 జనులున్నారు.

7. తెలుఁగుకమ్మవారు:—కోయముత్తూరు మొదలగు చోట్లలో 28578 జనులున్నారు.

ఈ ఏడు తెగలవారికిని భోజన ప్రతిభోజనములుకలవు. సంబంధ బాంధవ్యము లేదు.

---

### కమ్మవారి గృహనామములు.

గండికోటవారు, కడియాలవారు, ముక్కరవారు, బంగారుముక్కరవారు, పగడమువారు, సింగమువారు, ఇంద్రపురమువారు, లక్షుపురమువారు, వకుళమువారు, లుకుళమువారు, మైలేటివారు, పైడిపాలవారు, పుష్పమువారు, జనకులంవారు, వసంతంవారు, చెంబేడువారు, కందాళంవారు, పునసూరువారు, మహిరాడువారు, మున్నూరివారు, చల్లావారు, వంకాయలవారు, పసుపులవారు, వేలూరువారు, పిడుగలరాళ్లవారు, సేలమువారు, వింతలవారు, ఆడేరువారు, బెల్లమువారు, చప్పిడివారు, కోటవారు, రావులవారు, చెఱుకువారు, ఎట్టూరువారు, కోడుళ్లవారు, భీమనవారు, మరపట్టివారు, వంటాలవారు, మాదనవారు, నాదలివారు, నర్రవారు, జామండలవారు, మందలప్పవారు, పైడివారు, కోడూరువారు, నాయడువారు, కామినివారు, సమ్మెటవారు, సాధువారు, పొజ్జవారు, పొట్టువారు, కందప్పవారు, కాలయర్ కురాసివారు, గట్టమువారు, మదమించివారు, నామవారు, కుంపినివారు. మల్లెనివారు, కురచలవారు, దుప్పటివారు, పచ్చలవారు, తందూరివారు, కొత్తపల్లివారు, రామపట్టివారు, వైనావారు, లింగట్టిలవారు, తాన్రువారు, కెన్నవారు, తాతావారు, వేదగిరివారు, ఆత్తూరివారు, వాసిరెడ్డివారు, కలిసివారు, సోకినివారు, సాకినివారు, విరిప్పినివారు, గురజాలవారు, కొండవారు, కోనపల్లివారు, పిలారివారు, కమ్మవారు, పత్తివారు, అయినాలవారు, గొడుగులవారు, తేటివారు, కాకూరివారు, మందలప్పవారు, శ్రీపాటివారు, మంగపాటివారు, చప్పినవారు, భండారువారు, పంటలవారు, నామినివారు, వత్సలవారు, కెన్నినివారు, కాళహస్తివారు, బెల్లంకొండవారు, కూరపాటివారు, పాలేటివారు, ఈ మొదలగువారుకలరు. వీరిలో అనేకులు తిరునెల్వేలిజిల్లాలోనే యున్నారు. కమ్మవారిలో 600 ఇండ్లవారున్నారట. ఈ కమ్మవారిలో వాసిరెడ్డివారికి మాత్రము తిరునెల్వేలిజిల్లాలో కొన్నిస్థలములయందు బంధువులిండ్లలో ప్రథమతాంబూలమిచ్చెదరు.

---



### కమ్మవారి గోత్రములు.

పాలెల్లగోత్రము, కొంగునీళగోత్రము, పులికొల్లగోత్రము, తాళ్లూరుగోత్రము, వల్లటిగోత్రము, కంజలగోత్రము, కూంబూర్ గోత్రము, అనునీగోత్రములుగలవారు తిరునెల్వేలి జిల్లాయందున్నారు.

---

## ఇరువదిమూడవ అధ్యాయము.

### పెరిక బలిజవారు.

కమ్మవారు పంటబెట్టుధాన్యమును పెరికెయందువేసి విక్రయించువారగనుక వీరికీపేరుగల్గెను. మఱికొందఱు చెప్పినదేమనఁగా:—ఆదియందు క్షత్రియకులనాశకుఁడైన పరశురామునికి భయపడి తలదాఁచుకొనుటకై దక్షిణదేశమునకు పఱుగిడివచ్చిన వారుగాన వీరికి పెరికివారను పేరుగల్గినదనెదరు. వీరువివాహముకాలములందు పెరికయందు కసవునునిండించి ఆసంచిమీఁదుగా విచిత్రములుగావ్రాసి దానికి పూజచేసినతర్వాతనే వివాహముచేయుదురు. వీరికి సప్తపది (సన్నికల్లుమెట్టుట) లేదు. వీరు ఆదియందు ఉప్పుమొదలగునవి పెరికలమీఁదుగా వేసికొని అమ్ముచుండి,క్రమముగా వృద్ధికివచ్చి జమీన్దారులై పోయిరి. విశాఖపట్టణము జిల్లాలోని గజపతిరాయలు అను బిరుదుగలవారును, మఱికొందఱు జమీన్దార్లును, పెరికబలిజసంతతిలోఁ జేరినవారు. వీరికి తెనుఁగుజిల్లాలలో బాబుగారు, వజీరుగారు, రావుగారు మొదలగు పట్టపు పేర్లుకలవు. చెన్నపురి మొదలగు ప్రాంతములలో ఈ తెగవారికి నాయడుగారను పట్టపుపేరు చెల్లుచున్నది. 1901 సం॥ జనగణితప్రకారముగా ఈ పెరికబలిజవారు చెన్నపురి రాజధానియందు 22732 జనులుండిరి.

---

ప_త్తి బలిజవారు.

వీరు ఆదియందు విజయనగరమునందుండి దక్షిణదేశమునకు వచ్చినవారు. విశేషముగా వీరు ప్ర_త్తివ్యాపారము చేయుచుందురు. అందుచే వీరి కీపేరుగల్గెను.

---

కన్నడ బలిజవారు.

వీరును పూర్వము విజయనగర సంస్థానమునుండి వచ్చినవారు. వీరియొక్క ఆదిమతము వైష్ణవమేయైనను వీరుచేరినచోట ఆకాలమున ప్రబలముగానున్న శైవమతమునే వీరును అవలంబించిరి. వీరు బళ్లారి, మైసూరు, మొదలగుస్థలములందున్నారు. వీరు కన్నడభాషను మాటలాడుటంబట్టి కన్నడబలిజవారనఁబడిరి. వీరిలో ఎద్దుకన్నడి, ఎనుముకన్నడి, మొదలగుతరగతులుగలవు. 1901 సం॥ జనగణితప్రకారము మద్రాసు రాజధానియందు 20975 జనులుండిరి.

---

ఉప్ప బలిజవారు.

వీరును ఆదియందు విజయనగరము మొదలగు స్థలములయందుండి దక్షిణమునకువచ్చినవారు. వీరు ఉప్పును అమ్ముచున్నందున వీరికీపేరుగల్గెను. చెన్నపురి, చెంగల్పట్టు మొదలగుస్థలములయందున్నారు. ఇప్పటికిని తక్కువస్థితియందేయున్నారు.

---

జనప బలిజవారు.

వీరు విజయనగరసంస్థానమువారికి కావలసినవస్త్రములను తెచ్చియిచ్చుచుండిరి. అందుచే వీరికీపేరుగల్గెను. వీరికి పుష్పాలబలిజవారనే పేరుగలదట. జనపనారతో గోనెలు నేయుటవలననే వీరికి జనపవారను పేరుగల్గెను. దక్షిణమున గొందరు అఱవభాషనే మాట్లాడుచున్నారు.



వీరుచాలా తక్కువస్థితియందున్నారు. వీరికి శెలుపు సెట్టివారనికూడా పేరుగలదట. 1901 సం॥ జనగణితప్రకారముగా 82362 జనులుండిరి.

---

ఓడబలిజవారు. వలసబలిజవారు.

విజయనగరసంస్థానమువారికి పడవలు సిద్ధముచేసి నదిని దాటించుచుండిరి. అందుచే వీరికి యీపేరుకల్గెను. వీరిలో వలసబలిజలని మఱియొకతెగగలదు. వారు అన్యదేశములకుపోయి అచ్చటివస్తువులను తీసికొనివచ్చి సంస్థానమువారికిప్పించుచుండిరి. అందుచే నీపేరు వీరికిగల్గెను. 1901 సం॥ జనగణితప్రకారము ఈ యిరుతెగలవారును 470989 జనులుండిరి.

---

కోయిలడి బలిజవారు.

మున్ను విజయనగరమునుండి చేవప్పనాయడుగారు తంజావూరికివచ్చినపుడు వారితోఁగూడవచ్చిన వారు. వీరు దక్షిణదేశమునందుండుటంబట్టి అఱవభాషను స్వభాషగాఁజేసికొనిరి. దానికిదగినట్లే ఆచారవ్యవహారములనుకూడా మార్చుకొనిరి. 1901 సం॥ జనగణితప్రకారము అఱవభాషనుమాట్లాడు బలిజవారు 180884 జనులుండిరి.

---

పూందమల్లి బలిజవారు.

వీరు ఆదియందు విజయనగరరాజులకు ప్రతినిధులుగా దక్షిణదేశమునకు వచ్చినవారు. వీరిపుడు తోటపైరుబెట్టి జీవించుచున్నారు.

---

సెట్టి బలిజవారు.

వీరు 24 గురిండ్లవారనెదరు. వీరి ఆదిచరిత్ర యెట్లున్నదనఁగా:— పృథ్వీశుఁడనురాజు అంధకాసురునిబాధ కోర్వక శివునియొద్దికిఁబోయి మొఱఁబెట్టగా నపుడాశివుఁడు అంధకాసురునిసంహరించి, ఆరక్కసుని

కపాలమును త్రాసుతట్టగాను, వెన్నెముకను త్రాసుకోలగాను, నరములను దారములుగాను చేసియిచ్చి వ్యాపారముచేసి జీవించునట్లుచెప్పెను. అట్లే ఆపృథ్వీశుడు వ్యాపారముచేయుచునుండెను. వీనికి సంతతిలేనంమన పుత్రకామేష్టియాగముచేయగా, అందువలన నీతనిభార్యయైన సుజనాభ గర్భమునందు 24 గురు పుత్త్రులుదయించిరి. వీరిలో ఇద్దరు దేశాధిపతులైరి. తక్కిన 22 గురు మంత్రులుగానుండిరి. ఇవ్విధముగా రాజ్యమును పాలించుచుండు కాలమునందు చోళరాజు వీరినిచూచి చెప్పినదేమనగా, మీరు ఓడలను సిద్ధముచేసికొని మలయాళముపోయి వ్యాపారముచేయుడనగా, వీరు ఆ ప్రకారమే ఓడలను సిద్ధముచేసికొని దక్షిణసముద్రమార్గముగా బయలుదేరి మలయాళముచేరి వ్యాపారముచేయుచుండగా, ఆదేశమునేలు చేరరాజు సుంకమిమ్మని యడిగిరి. అందులకు వీరు సమ్మతింపనందున ఇరుతెగలవారికిని జగడముజరిగెను. తుదకు సెట్టిబలిజవారిచేత చేరరాజుచంపఁబడెను. ఆమీఁద ఆ చేరరాజు కుమార్తెయైన శిరోమణి రాజ్యమునకు అధికారిణియయ్యెను. ఇదిగాక, పాండ్యరాజుచే తరుమగొట్టబడినట్టి కాపులను ఈ సెట్టిబలిజవారు రక్షించుచుండిరి. దానికి పాండ్యరాజు ఓర్వక వీరి శిరములను ఖండించెను. కామాక్షీదేవి వరబలముచేత మరల వీరికి శిరములు దక్కెను. అందఱును జీవించిరి. ఆతర్వాత గుజరాతి దేశమునకుపోయి గురుగోవిందుతోనెదిరించి జగడముచేసి గురుగోవిందునుచంపి, వాని కుమార్తెలను ఉంపుడుకత్తెలుగా నుంచుకొని స్వదేశమునకురాగా, వీరి భార్యలు మనసొప్పక అగ్నిప్రవేశమైరి. ఆమీద కామాక్షీదేవి అనుగ్రహమువలన మరల వీరి స్త్రీలు బ్రదికిరి. ఆకారణముచేతనే కామాక్షీదేవి వీరికి కులదైవమైనదట. ఇదిగాక చోళుడు వీరికన్యకను అడుగగా, వీరు బంగారుతో నొకకన్యక ప్రతిమనుచేయించి కామాక్షీదేవి వరప్రసాదమువలన ఆప్రతిమకు జీవమిచ్చి దానిని చోళునకిచ్చిరట.



అందుచేతనే వీరికి కామాక్షీదేవి కులదైవమైనదట. మఱియొకకథ కలదు—వీరు గుజరాతి రాజుతో యుద్ధముచేయఁబోవునపుడు తమ పత్నులనుజూచి చెప్పినదేమనఁగా, మేము జగడముచేసి మడిసినచో అప్పుడు మీకు కుక్కలుకూసి తెల్పునని చెప్పిపోయిరట. ఇట్లుండ వీరింటి కుక్కలు చీమలచే కఱువఁబడి కుయ్యిడఁగా, అదే అపశకునమని భావించి, తోడనే వీరిపత్నులు అగ్నిప్రవేశమైపోయిరట. యుద్ధము ముగిసినమీద వారు వచ్చిచూడగా తమపత్నులు అగ్నిప్రవేశమైనందుచేత, తాము కొంకణదేశ వెలమస్త్రీలను ఉంపుడుకత్తెలనుగానుంచుకొనిరట. అందుచేతనే వీరిలో పెండ్లిచేయునపుడు స్త్రీలులేక పురుషులే పూజ మొదలగునవిచేయుదురట. వీరిభార్యలకు భర్తలు తాళి బొట్టుకట్టక పెద్దముత్తైదువులుగానుండు స్త్రీలనుగొని కట్టుదురట. వీరి స్త్రీలు చేతులకు గాజులువేయరట. 1901 సం॥ కానిష్‌వారి లెక్కప్రకారము 95924 జనులుండిరి.

---

## గొల్ల బలిజవారు.

వీరు ఆదియందు విజయనగర సంస్థానాధిపతులయొక్క పశువులను సంరక్షించుచుండిరి. వీరిలో 274 తరగతులుగలవు. వారిలో 10 తెగలవారు ముఖ్యులుగానున్నారు. 1901 సం॥ జనసంఖ్యప్రకారముగా,

1. ఆలగొల్లలు—గంజాము, విశాఖపట్టణము, గోదావరి ఈ ప్రాంతములలో 135569 జనులున్నారు.

2. ఎఱ్ఱగొల్లలు—గోదావరి, కృష్ణా, నెల్లూరు, కడప, కర్నూల్, కోయముత్తూరు, ఈప్రాంతములలో 172633 జనులున్నారు.

3. కరణగొల్లలు—కడప, కర్నూలు, అనంతపురము, చిత్తూరు, బళ్లారి, నెల్లూరు, ఈప్రాంతములలో 92245 జనులున్నారు.

4. మేకలగొల్లలు—గంజాం, విశాఖపట్టణము, ఈప్రాంతములలో 23002 జనులున్నారు.

5. పాకనాటిగొల్లలు—కర్నూల్, బళ్లారి, ఈచోటులందు 16747 జనులున్నారు.

6. పూజగొల్లలు—కృష్ణా, నెల్లూరు, కడప, కర్నూల్, ఈ స్థలములందు 155075 జనులున్నారు.

7. పూనిగొల్లలు—గోదావరి, కృష్ణా, నెల్లూరు, కడప, చిత్తూరు, ఈచోట్లలో 94252 జనులున్నారు.

8. పూరిగొల్లలు—కృష్ణా, నెల్లూరు, ఈప్రాంతములలో 3338 జనులున్నారు.

9. బొక్కసగొల్లలు—ఆదియందు వీరు విజయనగరసంస్థానాధిపతులయొద్ద బొక్కసదార్లుగానుండిరి. వీరికే అస్థానగొల్లలనియు పేరుగలదు. ఈ బొక్కస (గొల్ల) శబ్దమునే ఈకాలముదాక సర్కారువారు కూడా ధనాగార (ట్రెజరి) సంబంధమైన డిపార్టుమెంటులో "గొల్ల" అను ఉద్యోగమునిచ్చియున్నారు. వీరికి చాత్తాద వైష్ణవులు కులగురువులుగానున్నారు. వీరికిని నాయడుగారనియేపేరు. వీరును బలిజవారును ఒకరింట నొకరు భోజన ప్రతిభోజనములు చేయుదురు. వీరు మున్ను విజయనగరమునేలిన హరిహరరాయలు, బుక్కరాయలు మొదలగు రాజవంశ సంతతిలో జేరినవారట. అన్నిజిల్లాలలోను వీరిప్పుడు 22250 జనులున్నారు. వీరిస్త్రీలకు స్వాతంత్ర్య మధికమట.

---

ఇదిగాక కొందఱు కాపురెడ్లు అనువారును బలిజవారని తమ్మును చెప్పుకొనుచున్నారు.

కాపురెడ్లు.

వీరు అన్నిజిల్లాలోనున్నారు. వ్యవసాయమే వీరికి జీవనము. కాపు= అనఁగా కావలియుండువాఁడు అని యర్థము. రెడ్డి= అనఁగా



రాష్ట్రకూటరాజు అని యర్థము. వీరు ఆదియందు ప్రబలముగానున్న రాష్ట్రకూట దేశమునందున్నవారు. వీరిని చాళుక్యులు, పల్లవులు, బల్లాళులు పలుమాఱు ఓడించినప్పటికిని, 1323 సం॥నందు జ్యాసుద్దీన్ టోగ్లాకు, ఓరుగల్లు ప్రతాపరుద్రుని పట్టుకొన్నతర్వాతనే కాపులనేకులు జమీన్దార్లయిరి. ఒకానొకప్పుడు సైనికులుగానున్న వెలమవారే కాపులనే పేరుగలవారైరనెదరు. నిశ్చయము తెలియలేదు. కాపులలో 840 తరగతులుగలవు. వారిలో ముఖ్యుల నిట వ్రాయఁబడుచున్నది.

---

| రెడ్లగృహనామములు | 1901సం॥ జనగణితీప్రకారముగా వారి సంఖ్య. |
|---|---|
| 1. అయోధ్యవారు | 24278 |
| 2. బలిజవారు | 38697 |
| 3. భూమంచివారు | 29597 |
| 4. దేశూరువారు | 26441 |
| 5. గాజులవారు | 302462 |
| 6. గండికోటివారు | 18905 |
| 7. గోటేటివారు | 91200 |
| 8. కుంచేటివారు | 8842 |
| 9. మొరసవారు | 40934 |
| 10. మోటాటివారు | 145391 |
| 11. నేరడివారు | 29419 |
| 12. ఓరుగంటివారు | 13873 |
| 13. పాకనాటివారు | 226358 |
| 14. పల్లెవారు | 22693 |
| 15. పంటవారు | 455134 |

| | | |
|---|---|---|
| 16. | పెడకంటివారు | 204270 |
| 17. | పోకనాటివారు | 87820 |
| 18. | పొంగనాడువారు | 27887 |
| 19. | తెలగావారు | 18796 |
| 20. | వెలనాటివారు | 49682 |
| 21. | కమ్మపురివారు. | 11500 |

వీరిలో అయోధ్యవారు తిరునెల్వేలి, మధుర, ఈప్రాంతములలో 200 గు రున్నారు. తాము అయోధ్యలోనుండివచ్చిన కాపులనెడి అభిమానముగలవారు. వీరు తాళిబొట్టు బంగారుతో చేయుటలేదు. వీరి ఆచారవ్యవహారములను చూడగా చంద్రవంశ క్షత్రియ బలిజవారుకారని స్పష్టమగును.

దక్షిణదేశమునందు గొందలురెడ్లుకలరు. వారందఱును అఱవభాషను మాటలాడెదరు. వీరిని చూడగా ఉత్తరముదేశములోని తెనుఁగు మాట్లాడు రెడ్డివారితోఁజేరినవారని చెప్పుటకు సాధ్యపడదు. కేవలము నింద్య మైన ఆచారము లాచరించుచున్నారు.

ఇంతేగాక గంగిరెడ్లు అని యొకజాతివారు కలరు. గంగిరెద్దులను ఆడించి జీవించుచున్నారు. ఇట్లు రెడ్లలో పలుజాతులవారుకలరు.

మరియు దక్షిణదేశమునందుండు పల్లెవాండ్రవలెనే తెనుగుదేశములో నొకజాతి పల్లెవాండ్రున్నారు. వారుకూడా తమ్మును రెడ్లనియే చెప్పుకొనెదరు.

అయినను ఈ రెడ్లలో ననేకులు బహుకాలముగా మంచి స్థితిలోనుండుటయేగాక, విద్వాంసులుగనునుండిరి. ఇప్పటికిని యిట్టివారు అనేకు లున్నారు.




బలిజవంశ పురాణము

సమాప్తము.